ర్చి 1996

# చతుర

రూ.6/-

The Largest Circulated Telugu Monthly



లకలపల్లి
శ్వరరావు

'లాకప్'

# చతుర ప్రపంచం

## మహిళా జర్నలిస్టులు

ఈరోజుల్లో జర్నలిజం వృత్తిలో చేరేందుకు ఎంతోమంది అమ్మాయిలు కూడా ఉత్సాహ పడుతున్నారు. అయితే... అందులో ఎంత మంది అనుకున్నది సాధించి మంచి పాత్రికే యులవుతున్నారనేది ప్రశ్న. ఈ విషయంలో 'టైమ్స్ ఆఫ్ ఇండియా', 'ట్రెయినీ జర్నలిస్ట్ స్కీమ్'కి చెందిన ఇద్దరు నిర్వహించిన ఓ సర్వే ఇలా వుంది.

ఢిల్లీకి చెందిన మూడు ప్రముఖ దినపత్రిక లు, రెండు వార్తా సంస్థలు ఇచ్చిన లెక్కల ప్రకారం పురుష పాత్రికేయుల శాతం 80 వుంటే స్త్రీ పాత్రికేయులు కేవలం 20 శాతం మాత్రమే వున్నట్లు తెలుస్తోంది. 'హిందుస్తాన్ టైమ్స్'లో పనిచేసే 160 మంది పాత్రికేయు ల్లో 27 మంది మాత్రమే స్త్రీలు! 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లోని 97 మంది పాత్రికేయుల్లో స్త్రీలు 26 మంది. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో పనిచేసే 77 మంది పాత్రికేయుల్లో 20 మంది స్త్రీలున్నారు.

వార్తాసంస్థలలో స్త్రీ పాత్రికేయుల సంఖ్య మరీ తక్కువ. పి.టి.ఐ లోని 101 మంది పాత్రికేయుల్లో 20 మంది స్త్రీలుంటే, యు.ఎ న్.ఐలో 170 మందికి 20 మంది మహిళా ఉద్యోగులున్నారు. జర్నలిజం కాలేజీల్లో మా త్రం విద్యార్థినుల సంఖ్య క్రమేణా పెరుగు తూవస్తోంది. 1985-86 విద్యాసంవత్స రంలో 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మాస్ కమ్యూనికేషన్'లోగల 20 మంది విద్యార్థు ల్లో 12 మంది విద్యార్థినులే.



వార్తాపత్రికల్లో చాలామంది స్త్రీలు కేవలం డెస్క్ వర్క్‌కే పరిమితమవుతున్నారు. రిపోర్టర్‌గా పనిచేసేవారు చాలామంది పురుషులే. పి.టి.ఐ. వార్తాసంస్థలో పనిచేసే స్త్రీలందరూ కేవలం డెస్క్ వర్క్‌కే పరిమితమయ్యారు. రిపోర్టింగ్‌లో ఒక్క స్త్రీ కూడా లేదు. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' బ్యూరో చీఫ్ శ్రీమతి సేవంతి నైనన్ చెప్పేదేమంటే 'భారతీయ సమాజంలో పిల్లల బాధ్యతను ఇప్పటికీ స్త్రీలే చూసుకోవలసిన పరిస్థితులుండటంచేత నిర్దుష్ట పనివేళలున్న డెస్క్ వర్కే వారికి సముచితమైనది'

యు.ఎన్.ఐ. వార్తాసంస్థ డెప్యూటీ జనరల్ మేనేజరు శ్రీ కె.పి. కుట్టి అనేదేమంటే, 'స్త్రీలని రిపోర్టింగ్‌కు పంపితే వారికి అదనపు రక్షణ బాధ్యత, ఎస్కార్ట్ కల్పించవలసి వుంటుంది' అని. అయితే దాన్ని కొంతమంది పాత్రికేయురాళ్లు ఖండించారు.

కొంతమంది అభిప్రాయం ప్రకారం ఎక్కడో కొంతమంది తప్ప చాలామంది మహిళా పాత్రికేయులు విభిన్న రంగాల్లో ఏదో ఒకదాన్ని ప్రత్యేక సబ్జక్టుగా తీసుకోకపోవడంతో, కేవలం ఇంగ్లీషు లేదా ప్రాంతీయ భాషా సామర్థ్యంతో పాత్రికేయులుగా తీసుకోబడతారు. దాంతో వారు రిపోర్టింగ్‌లో కొంచెం ఇబ్బందిని ఎదుర్కోవలసి వస్తోందట.

---

## గుప్పెడు చిలుక

**అ**లెగ్జాండర్ చక్రవర్తి భారతదేశానికి వచ్చినప్పుడే తొలిసారిగా చిలుకలను చూశాడు. వెళ్లేటప్పుడు కాశీనుంచి ఓ మంచి చిలుకను గ్రీసుదేశం తీసుకెళ్లాడు. అందుకనే కాశీలోని కొన్ని రకాల చిలుకలని 'అలెగ్జాండర్ చిలుకల'ని పిలవడం కద్దు.

శతాబ్దాలుగా చిలుకకు మనిషికి మధ్య అవినాభావ సంబంధం కొనసాగుతూనే వుంది. దీనికున్న చక్కని రంగులు, మానవ స్వరాన్ని అనుకరించే సామర్థ్యం, తెలివితేటలు, సాధుస్వభావం ఇవన్నీ చిలుకలని మనిషికి చేరువయ్యేలా చేశాయి.

చిలుక శరీర పరిమాణం, ఆకృతి విభిన్న దేశాల్లోనేగాక ఒకదేశంలోని విభిన్న ప్రాంతాల్లో వేరువేరుగా వుంటుంది. అడవుల్లో కేవలం 6 సెంటీమీటర్లే వుండే అతి చిన్న చిలుకలనుంచి, 200 సెం.మీ. శరీర వైశాల్యంగల అతి పెద్ద చిలుకలు కూడా కనపడతాయి. కొన్నిరకాల చిలుకల్లో మగ, ఆడ చిలుకలను అతి సులువుగా పసికట్టవచ్చు.

అసలు ఈ చిలుకజాతి మొదట ఆస్ట్రేలియాలో బయటపడినట్లు తెలుస్తోంది. ఇంతవరకు వీటిలో 316 రకాల చిలుకలున్నట్లు గుర్తించారు. పెద్దతల, ఒంపు తిరిగిన ముక్కు, సన్నటి పొట్టి మెడ, కాళ్లకి ముందుభాగంలో రెండువేళ్లు, పొడవైన తోక ఇవి ఇంచుమించు అన్ని చిలుకల్లోనూ కనిపించే సామాన్య లక్షణాలు. చిలుక ముక్కు ఎంత గట్టిదంటే చాలా గట్టి గింజలను కూడా సునాయాసంగా పగలకొడుతుంది. అప్పుడప్పుడు ఆహారమే దొరకనప్పుడు తన ముక్కును తనే తింటుందంటారు. సామాన్యంగా చిలుకలన్నీ చెట్లపైనే నివశించినా, కొన్నిచిలుకలు నేలమీద కూడా తిరుగుతూ వుంటాయి. అవి పరుగుపెట్టడంలో పావురాన్ని ఓడిస్తాయి.

సామాన్యంగా మగ, ఆడ చిలుకలు మైథున సమయంలోనే దగ్గరవుతూవుంటాయి. మిగిలిన సమయాల్లో ఆడ, మగ చిలుకలు తగినంత దూరంగా మసులుకుంటాయి. ఎక్కువ ధాన్యం వుండేచోట ఈ చిలుకలు గుంపుల్లో కనిపిస్తాయి. ఇవి స్వతహాగా చక్కని త్యాగస్వభావాన్ని కలిగివుంటాయి. ఏదైనా ప్రమాదం సంభవించినప్పుడు తాను తప్పించుకోవడమేగాక తోటి చిలుకలను కూడా తప్పించుకోమని గట్టిగా శబ్దాలు చే





స్థాయి చిలుకలు.

చిలుకలెక్కువగా శాఖాహారాన్నే తింటాయి. పండ్లు, ధాన్యం, గింజలు వగైరాలతోపాటు అప్పుడప్పుడు సూక్ష్మక్రిములను, కీటకాలను తింటాయి. పువ్వులోని మధువును పీల్చుకుందుకు దాని ముక్కు బాగా ఉపయోగపడుతుంది.

కొన్నిచోట్ల అప్పుడప్పుడు వేలాది చిలుకలు గుంపులు, గుంపులుగా చేలపై పడి పంటలను నాశనంచేస్తూ వుంటాయి. ఓరకం ఆస్ట్రేలియా చిలుకలైతే మేకల కాలేయాన్ని ఇష్టంగా తింటాయట!

చిలుకలు ఎక్కువగా కొండ గుహల్లో, చెట్టు తొర్రల్లో నివశిస్తూ వుంటాయి. లారీకూల్స్ అని పిలువబడే చిలుకలు రాత్రి సమయాల్లో చెట్టు కొమ్మలకి తలకిందులుగా వేలాడుతూ నిద్రిస్తాయి.

ఆడ మగ చిలుకలమధ్య ఓసారి మైథునం జరిగితే చాలాకాలం అవి రెండూ భార్యాభర్తలుగా జీవిస్తాయి. గుడ్లు పొదిగే సమయంలో మగ చిలుక ఆడచిలుకకు ఎంతో సాయం చేస్తుంది. ఒక కాన్పులో రెండునుంచి తొమ్మిది గుడ్లను పెడుతుంది చిలుక. గుడ్లు 3 వారాలకు పిల్లలవుతాయి. అప్పుడే పుట్టిన చిలుక పిల్లకు కళ్లు కనిపించవు. కొద్దిరోజుల తర్వాత క్రమేపీ అది చూడగలుగుతుంది.

చిలుకలకు జ్ఞాపకశక్తి ఎక్కువ. అంకెలను నేర్పితే నేర్చుకుని, మర్చిపోకుండా అడిగినప్పుడు అప్పచెబుతాయి. కొన్నిచిలుకలు ఎంత శక్తివంతంగా వుంటాయంటే పంజరాన్ని కూడా విరగ్గొట్టి పారిపోతాయి.

చిలుకకు మాటలు నేర్పాలంటే కొంచెం చిన్న వయసులోనే ప్రారంభించాలి. వయసు ముదిరితే అవి పలకలేవు. అక్టోరనిస్ వర్గానికి చెందిన చిలుకలు చూడ్డానికి అందంగా, ఆకర్షణీయంగా వుంటాయి.




ఇందులో మగ, ఆడ చిలుకలు సంవత్సరాల తరబడి భార్యాభర్తల్లా కలిసి మెలిసి వుండి చివరకు అందులో ఏ చిలుక చనిపోయినా రెండోది కూడా ప్రాణత్యాగం చేస్తుంది. న్యూజిలాండ్‌లోని గుడ్లగూబలా కనిపించే చిలుకలు మాత్రం మిగతా చిలుకజాతిలా ఎగరలేవు.

# చతుర

సంపుటి: 19 సంచిక: 2 మార్చి: 1996

ఏనేరమూ చేయకపోయినా... తన భార్య ఆరోపణపై ఆ అమాయకుడిని అరెస్ట్ చేయించి లాకప్‌లో పెట్టించాడు ఓ పోలీస్ ఆఫీసర్.

అతడివద్ద ఉన్న వెయ్యి రూపాయలను స్వాధీనం చేసుకోవడమే కాక లాకప్‌లో అతడికి అక్కడున్న అన్నిరకాల ట్రీట్‌మెంట్‌లనూ నిర్దాక్షిణ్యంగా ఇప్పించాడా ఆఫీసరు.

రోలర్ ట్రీట్‌మెంట్, స్వీట్ ట్రీట్‌మెంట్, డ్రింక్ ట్రీట్‌మెంట్, ఎరోప్లేన్ ట్రీట్‌మెంట్... వగైరా పోలీసు చిట్కాల్లో దేని ఫలితమోగానీ... కొద్ది గంటల్లోనే ప్రాణాలు విడిచాడా అమాయకుడు!

ఇరవైరోజులపాటు విడవకుండా రక్తం కక్కేలా కొట్టినా బతికి బట్టకట్టిన నేరస్తులనే చూస్తున్న ఆ పోలీసాఫీసర్ సర్వీస్‌లో ఇది కొత్త అనుభవం.

అయితే... అటుపైన... అనుభవాలతో పండిన పోలీసాఫీసరుగా అతడికి వృత్తిరీత్యా ఎదురైన కేసులెలాంటివి? అవి అతడిని ఎక్కడ నిలబెట్టాయి?

కరడుగట్టిన ఖాకీల కఠోర ఆదేశాలకు, వాటి ఆచరణా ఫలితాలకు... హృదయాలను కదిలించే నగ్నచిత్రణ... మొలకలపల్లి కోటేశ్వరరావు రచన 'లాకప్' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

"దొరికొచ్చాడా, ఇంకా పాతపాటే పాడుతున్నాడా?"

"కొట్టీ కొట్టీ మేం అలిసిపోవడమే సార్! వాడు తనకేం తెలీదంటే తెలీదంటున్నాడు. అప్పటికీ అన్నిరకాల ట్రీట్‌మెంట్సూ ఇచ్చాం సార్. వాడి ఒంటిమీద దెబ్బ తగలని చోటేలేదు. ఒళ్లంతా కదుములు కట్టిపోయింది సార్"

"అయితే ఆ దెబ్బలు చాల్లేదటనా వాడికి? బ్లేడు తీసుకుని గాట్లు పెట్టి కారం రాయండి. లం... కొడుకు అప్పుడైనా చేసిన నేరం ఒప్పుకుంటాడేమో?"

"అంతకంటే పెద్ద శిక్షలే వేశాం సార్! గోళ్లలో గుండుసూదులు గుచ్చాం. ముఖమంతా చుట్టతో వాతలు పెట్టాం. రోలర్ ట్రీట్‌మెంట్ ఇచ్చాం. ఎన్ని తన్నినా, ఎంత చేసినా తెలియదన్నమాటే సార్. వాడి వాలకం చూస్తే నిజంగానే వాడికి తెలియదేమో అనిపిస్తోంది సార్!"

"వాడు ఆ ఏరియావాడే. వాడికి తెలియకుండా ఆ ఏరియాలో దొంగతనం జరిగే అవకాశం తక్కువ. ఇంకా నాలుగు రోజులు లాకప్‌లో ఉంచి ఇంకా నాలుగు బాగా తగిలిస్తేకానీ వాడు చేసిన నేరం ఒప్పుకోడు!"

కాలిమీద కాలు వేసుకుని కూర్చుని, సిగరెట్ పొగ రింగులు రింగులుగా వదులుతూ, పెంచిన మీసంమీద చెయ్యివేసి రౌండ్ షేప్ వచ్చేలా దానిని వేళ్లతో పైకి మెలితిప్పుతూ అన్నాడు ఎస్.ఐ. కిషోర్.

"రెండు రోజుల్నించీ వాడి పెళ్లాం ఉదయం, సాయంత్రం వాడికి అన్నం తీసుకొచ్చి వాడికేమీ తెలియదని లబోదిబోమని మొత్తుకుంటోంది సార్. ఆరోజు రేత్రి వాడు ఆమెదగ్గరే ఉన్నాడంట సార్"

"దాన్ని కూడా బొక్కలో తొయ్యకపోయ్యారూ? వాడిముందే దానికి నాలుగు తగిలిస్తే అప్పుడైనా వాడు దొంగతనం ఒప్పుకునేవాడేమో!" అన్నాడు కిషోర్.

అతను ఆ 'రక్షకభట నిలయం'లో సబ్ ఇనస్పెక్టర్.

ఇంతలో ఫోన్ రింగయ్యింది.

"హలో... హలో..."

"హలో... పోలీస్ స్టేషనేనాండీ!" అవతల గొంతు ప్రశ్నించింది.

"పోలీస్ స్టేషన్ కాదు, పేకాట స్టేషన్! ఏంటీ విషయం? బాబు స్కూల్‌నించి వచ్చాడా?"

"అబ్బ... అంత కోపమైతే ఎలాగండీ? బాబు స్కూల్‌నుంచి వచ్చి గంటసేపవుతోంది"

"సరే... విషయం ఏమిటో చెప్పి, బాబుకి ఇవ్వు ఫోను. వాడితో మాట్లాడాలి"

"అలాగే మాట్లాడుదురుగానీ, మొన్న నేను చెప్పానుగదా, తాగుబోతువిషయం, వాడు ఇవ్వాళ కూడా వచ్చి న్యూసెన్స్ చేస్తున్నాడండీ!"

"ఎక్కడున్నాడు వాడు?"

"ఇంకెక్కడుంటాడు, గాంధీబొమ్మ దగ్గరే!" అంది ఆమె.

"సరే అయితే! ఇద్దరు కానిస్టేబుళ్లను పంపిస్తున్నాను. వాడి విషయం చూస్తార్లే!" అన్నాడు కిషోర్.

ముద్దుల కొడుకుతో కొద్దిసేపు ఫోన్లో ముద్దు ముచ్చట్లాడాడు. తరువాత ఇద్దరు కానిస్టేబుళ్లని పిలిచాడు.

"రాజూ... నువ్వూ, లింగయ్యా వెళ్లి మేం ఉండే బజారులో గాంధీ బొమ్మ దగ్గర ఒకడు తాగి గొడవ చేస్తున్నాడు. వాడి విషయం ఏదో చూడండి"

"వాడ్ని స్టేషన్‌కు ఈడ్చుకు రమ్మంటారా సార్, అక్కడే నాలుగు తగిలించి తరిమి వేయమంటారా?"

"ఎలాగో చేయండి. ఇక జన్మలో తా





వాడు ఆ బజారుకు రాకూడదు. మీరు ఏదైనా చేయండి'' అన్నాడు కిషోర్.

రాజూ, లింగయ్యా ఇద్దరూ సైకిళ్లు వేసుకుని బయలుదేరారు.

దారిలో 'ప్రభుత్వ సారాయి దుకాణం' అనే బోర్డు ఉన్న చిన్న పూరి గుడిసెముందు వాళ్ల సైకిళ్లు ఆగిపోయాయి.

రాజూ, లింగయ్యా ఇద్దరూ సైకిళ్లకు స్టాండువేసి దుకాణంలోనికి దారితీశారు.

ఆ పూరి గుడిసెలో నలుగురైదుగురు కుర్రవాళ్లూ, ముసలివాళ్లూ కూర్చుని, ఘనత వహించిన ప్రజాప్రభుత్వం ప్రజల క్షేమంకోసం, సంక్షేమంకోసం విక్రయిస్తున్న సారాసేవనంలో మునిగిపోయారు.

ఉన్న ఒకే ఒక్క బల్లమీద కూర్చున్న ఇద్దరు యువకులు కానిస్టేబుళ్లని చూసి లేచి, "కూర్చోండి'' అని ఆ బల్ల ఖాళీచేసి పక్కనే నేలమీద చతికిలపడ్డారు.

"చెరి రెండు పేకట్లు ఇవ్వు రాములమ్మా!" లింగయ్య అడిగాడు.

ఆమె కానిస్టేబుళ్లకు ప్యాకెట్లు తెచ్చి ఇచ్చి అంది. "ఇప్పటికే మీకు కాతా ఎక్కువైపోయిందని షావుకారు అరుస్తున్నాడు సారూ! కాతాలు ఎవురికీ పెట్టవాకు, డబ్బులు ఇచ్చినవాళ్లకే అమ్మమని షావుకారు గట్టిగా చెప్పాడయ్యా! మీరు డబ్బు చూడాల!"

"చూద్దాం రాములమ్మా! నాల్రోజుల్నించీ సరైన కేసు ఒక్కటి కూడా దొరకలా! రెండు మూడు రోజుల్లో ఏదో ఒక కేసు తగలకపోదులే రాములమ్మా, ఇస్తాం కదా డబ్బులు!" అని రాజూ, లింగయ్యా ప్యాకెట్లు చింపి, అక్కడే సేవించి కదిలారు.

★ ★ ★

"మహాత్మా గాంధీకీ జై
పూజ బాపూజీకీ జై
గాంధీ తాతకీ జై

పిల్లకాయల్లారా, గాంధీ తాతకి మీరు కూడా గట్టిగా జైజైలు చెప్పాలమరి'' అరగంట సేపట్నించి పెద్దగా అరుస్తున్నాడు అర్జునుడు.

అర్జునుడి చుట్టూ చాలామంది పిల్లల గుంపు ఉంది.

నున్నటి బోడితలతో, చెక్కు చెదరని ముసి ముసి బోసి నవ్వులతో ఉన్న రంగు రంగుల గాంధీ విగ్రహం మెడలో రెండు రూపాయలతో కొనుక్కువచ్చిన నూలుపోగుల దండ వేశాడు అర్జునుడు.

అతను జై చెబితే కొంతమంది పిల్లలు కూడా జైజై అంటున్నారు. కొంతమంది పిల్లలు అతని చేతిలో ఉన్న కాగితం పొట్లంలోనించి చాక్లెట్లు తీసి తమకు ఎప్పుడు పంచుతాడా అని ఆశగా, ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.

అర్జునుడి మాటలు ముద్దముద్దగా వస్తున్నాయి. బాగా తాగి ఉన్నాడు.

"పిల్లకాయల్లారా... మనకి సోతంత్రం తెచ్చిపెట్టిందెవురు? గాందీతాత... అందుకే మీరంతా గాందీ తాతకి గట్టిగా జై చెప్పాల..."

చెప్పిన మాటనే పదే పదే చెవుతున్నాడు. ఉపన్యాసం చెప్పాలని తెలీని ఉత్సాహం చూపిస్తున్నాడు.

అది ఫణిగిరి.

పట్టణమూ, పల్లెటూరూ కాని ఊరు. అతి పెద్ద గ్రామం లేదా అతి చిన్న పట్టణం అని ఆ ఊరిని చెప్పుకోవచ్చు.

ఇంతకుముందు అది తాలూకా కేంద్రంగా ఉండేది. ప్రస్తుతం ఫణిగిరి మండల కేంద్రం.

అర్జునుడిది ఫణిగిరికి 5 కిలోమీటర్ల దూరంలో ఉన్న గంగన్నపాలెం అనే చిన్న పల్లెటూరు. అతను హరిజనుడు.

అర్జునుడు గేదెల మారుబేరం వ్యాపారం చేస్తుంటాడు. దగ్గర దగ్గరి ఊళ్లలో తిరిగి ఒక గేదే, రెండు గేదెలు కొనుక్కుని కొద్ది, గొప్ప

లాభం చూసుకుని అమ్ముతుంటాడు. దళారి పని కూడా చేస్తాడు. అంటే గేదెల అమ్మకం, కొనుగోలు సమయాల్లో దళారిగా ఉండి డబ్బు సంపాదిస్తుంటాడు.

అర్జునుడు అత్యాశపరుడు కాదు. మంచి మనిషిగానే జనం చెప్పుకుంటారు. అర్జునుడిలో అన్నీ మంచి గుణాలే ఉన్నా తాగుడు వ్యసనం కారణంగా అతను పాడైపోతున్నాడని వాళ్ల అన్నదమ్ములు బాధపడుతుంటారు.

అర్జునుడు వారంలో రెండు మూడు రోజులు కూడా తాగకుండా ఉండలేడు. తాగుడు వ్యసనానికి అతను బాగా బానిసైపోయాడు.

ఎంత కష్టపడినా కాలికి చెప్పులు కూడా లేకుండా 9, 10 మైళ్లు తిరిగి ఒక గేదెనో, ఒక దున్నకుర్రనో కొనుక్కుని పాతికా, ముప్పయ్ ఒక్కోసారి యాభై కూడా లాభం చూసుకుని అమ్మినా ఎంత సంపాదించినా అతని సంపాదన అతని సారాయికి సరిపోదు.

"అసలు గాంధీ తాత అంటే ఎవురూ? మనకి సోతంత్రం తెచ్చిపెట్టిన పెద్దమడిసి. ఇంగిలీసోల్లమీద తిరగబడి, వాళ్లని ఈ దేశంనించి యెల్లగొట్టిందెవురు? గాంధీ తాత..."

అర్జునుడు అర్థం పర్థం లేకుండా మాట్లాడుతూ ఉన్న సమయంలోనే కానిస్టేబుళ్లు రాజూ, లింగయ్యా వచ్చారు.

వాళ్లని చూసి అర్జునుడి చుట్టూ ఉన్న పిల్లలు భయంభయంగా, బిత్తర చూపులు చూస్తూ దూరంగా జరిగారు.

ఆ సెంటర్‌లో బండిమీద బజ్జీలు అమ్ముకుంటున్న భార్యాభర్తలూ, అరటికాయలు అమ్ముకుంటున్న మనిషీ పోలీసులవైపు ఆసక్తిగా చూస్తున్నారు.

"రేయ్... ఏ ఊర్రా నీది?" అర్జునుడి దగ్గరకి వచ్చి రాజు అడిగాడు.

"ఎందుకు నీకు, నీది అసలు ఏవూరు?" అన్నాడు అర్జునుడు.

"పీకలదాకా తాగి, ఇలా సెంటర్లో, పబ్లిగ్గా గొడవ చేయొచ్చా?"

"ఎవురు తాగారు? నేను తాగానా, నేను తాగుబోతునా?"

"నువ్వు తాగలేదురా, నీ నోరు తాగింది. పదరా ముందు స్టేషన్‌కి''

"ఎందుకు టేషన్‌కి? నేనేం దొంగనా, రౌడీనా, కేడీనా? ఎందుకు రావాల టేషన్‌కి?"

"ఏందిరోయ్ పోలీసోళ్లతోటి ఎక్కువ మాట్లాడతన్నావ్? ముందు స్టేషన్‌కి పద. అక్కడ నీ మత్తూ గిత్తూ వదలకొడతాం" రాజు అన్నాడు.

"వాడితోటి ఏందీ మాటలు? పదరా గాడిద కొడకా ముందు స్టేషన్‌కి'' అన్నాడు లింగయ్య.

"మాటలు మరియాదగా రానియ్. నేను ఎవుర్ని అనుకున్నావు?"

"నువ్వు ఎవురివైతే మాకెందుకురా? పదరా బాడ్కోవ్ స్టేషన్‌కి..." అని లింగయ్యా, రాజూ తూలిపడబోతున్న అర్జునుడి వీపుమీద దభీదభీమని పిడిగుద్దులు గుద్దారు.

"ఏందీ, ఉత్త పుణ్యానికి నన్ను కొడుతన్నారు. లాగుతారేంది నన్ను, వదలండి'' అని అర్జునుడు వాళ్లనుంచి లాక్కొంటూ, కానిస్టేబుల్ చెంపమీద చెళ్లుమని బలంగా ఒక్క దెబ్బ వేశాడు.

"పోలీసోళ్లని పట్టుకుని కొడతావంట్రా నువ్వు? లం... కొడకా, కానియ్యి రాజూ..." అని పబ్లిక్‌గానే ఆ కానిస్టేబుళ్లు విజృంభించారు.

ఇద్దరూ కలిసి అర్జునుణ్ణి విపరీతంగా లాఠీ కర్రలతో, చేతులతో కొట్టారు. మోకాళ్లతో కుమ్మారు.

అర్జునుడు నేలమీద పడి, "ఓరి దేవుడో... నన్ను కొట్టొద్దు దేవుడో... మీకు దణ్ణం పెడతాను సామో... నన్ను ఇడిచిపెట్టండి





సామో..." అని లబోదిబోమని మొత్తుకుంటున్నాడు.

ఖాకీ దుస్తులు వేసుకున్న ఆ కానిస్టేబుళ్లను అర్జునుడి ఏడుపులూ, అరుపులూ ఏమాత్రం కదిలించలేకపోయాయి. కొట్టడం ఇంకా ఎక్కువ చేశారు.

"తాగి ఏదో వాగుతున్నంతమాత్రాన అలా కొడతారంటండీ వదిలి పెట్టండి, చచ్చిపోతాడేమోనండి! వదలండి అతన్ని" అని ఒకరిద్దరు పోలీసులకు అడ్డంపోవడానికి ప్రయత్నించారు.

అయితే పోలీసులు వాళ్లని తమ పోలీసు భాషలో బూతులతో హెచ్చరించటంతో వాళ్లు వెనక్కి తగ్గారు.

అప్పటికే అక్కడ చాలామంది గుంపు చేరారు. 'పోలీసులతో మనకు ఎందుకు అనవసరపు రగడ' అని చాలామంది విచిత్రం చూస్తున్నట్లుగానో, తమాషా చూస్తున్నట్లుగానో మౌనంగా చూస్తున్నారు.

ఒక రిక్షా కొద్దిదూరంలో పోతూ కన్పించింది.

"రేయ్ రిక్షా, ఇటూరా" అని రాజు ఆ రిక్షా అతన్ని పిలిచాడు.

"రేయ్, ఈ లం... కొడుకుని రిక్షాలో వేసుకొని స్టేషన్‌కి తీసుకురా! అక్కడ వీడంతు చూడాలి" అన్నాడు రాజు.

దెబ్బలు తిని ఏడుస్తున్న అర్జునుడు రిక్షా ఎక్కడానికి నిరాకరించాడు. ఒకవేళ స్టేషన్‌కి తనను తీసుకుపోతే, అక్కడ ఇంకా హింసిస్తారని, ఇంకా కొడతారని భయపడ్డాడు.

కానిస్టేబుళ్లు ఇద్దరూ రిక్షా ఎక్కడానికి మొండికేసిన అర్జునుణ్ణి బలవంతంగా ఎత్తి రిక్షాలో కూర్చోబెట్టారు.

"పదరా" అని రిక్షా అతనికి చెప్పి వెనుక సైకిళ్లు వేసుకొని అనుసరించారు.

దారిలోనే ఉన్న ప్రభుత్వ సారాయి దు

కాణం దగ్గర రిక్షాని ఆపి, కానిస్టేబుళ్లు ఇద్దరూ గుడిసెలోపలికి వెళ్లి మళ్లీ చెరి ఒక పొట్లం సేవించి, స్టేషన్‌వైపు రిక్షాతోపాటు కదిలారు.

★ ★ ★

గంగన్నపాలెం చాలా చిన్న పల్లెటూరు.

ఆ ఊరికి బస్సు లేదు.

ఆసుపత్రి లేదు.

మంచి పాఠశాల లేదు.

పోస్టాఫీసు కూడా లేదు.

ఆ ఊళ్లో తాగడానికి కనీసం పరిశుభ్రమైన నీళ్లు కూడా లేవు.

ప్రభుత్వం కల్పించాల్సిన కనీస సౌకర్యాలు ఏవీ కూడా ఆ ఊరికి లేవు.

అయితే ప్రభుత్వ సారాయి దుకాణం మాత్రం ఆ ఊరికి ఉంది. అది చిన్న పూరిపాకలో ఉండి ఆ ఊరి ప్రజానీకానికి యధాశక్తి సేవ చేస్తూ, వారి రక్తాన్ని పీల్చేస్తోంది.

అర్జునుడు చిన్న నాయకుడు.

దాదాపు పదిహేను సంవత్సరాలనుంచీ ఆ ఊరి హరిజనవాడకి మెంబరుగా ఏకగ్రీవంగా ఎన్నికవుతూ వస్తున్నాడు. పోటీ అనే మాటే లేదు.

అర్జునుడికి చాలా పెద్ద బంధువర్గం ఉంది. ఆ హరిజనవాడలో ముప్పాతిక భాగంకంటే ఎక్కువ కుటుంబాలు ఆయనకి దగ్గర చుట్టాలవే!

వాళ్లు ఎనిమిదిమంది అన్నదమ్ములు. అతనికి ఇంకా ముగ్గురు అక్క చెల్లెళ్లు కూడా ఉన్నారు. ఆ పల్లెలోనే అర్జునుడికి ముగ్గురు మేనమామలు ఉన్నారు. ఆ మేనమామలకి కూడా బోలెడు మంది పిల్లలు ఉన్నారు.

అర్జునుడు కొంచెం నోరు కలిగినవాడు కూడా కావడంతో వాళ్ల హరిజనవాడకి పెద్దగా పెత్తనం కూడా చెలాయిస్తుంటాడు.

కుల పెద్దగానూ, వార్డు మెంబరుగానూ ఉన్న అర్జునుడు వాళ్ల ఊళ్లో తాగడానికి పెద్దగా ఆసక్తి చూపెట్టడు. తక్కువ సందర్భాల్లోనే వాళ్ల ఊళ్లో తాగుతుంటాడు.

గేదెలు, దున్నకుర్రల వ్యాపారం కోసమో, మరొక పనికోసమో, దేనికో దానికోసం అర్జునుడు ఫణిగిరి ఎక్కువగా వస్తుంటాడు.

వచ్చినరోజు మాత్రం ప్రభుత్వ సారాయి దుకాణ ప్రవేశం చేసి మస్తుగా మందు బిగిస్తాడు. మామూలుగా మంచి మనిషే... కానీ తాగితేమాత్రం నోటికి విశ్రాంతి ఉండదు.

తన తండ్రీ, తానూ, తన బిడ్డలూ... తమ వంశం అంతా కాంగ్రెస్‌పార్టీనే నమ్ముకున్నామనీ, తమప్రాణాలు పోయినా ఆ పార్టీకి తప్ప ఇంకో పార్టీకి ఓటు వేసే పని లేదని స్పష్టంగానే చెపుతాడు.

ఎవరైనా నవ్వులాటకి కానీ, ఎగతాళికి కానీ కాంగ్రెస్ పార్టీని పన్నెత్తి మాటన్నా సహించలేడు. తన తల్లిని తిట్టినా, ఒప్పుకుంటాను కానీ కాంగ్రెస్‌పార్టీని మాట అంటే ఒప్పుకునే పని లేదని అంటాడు.

తాగినరోజు అర్జునుడి గుండెల్లోనుంచి దేశభక్తి ఉప్పొంగిన కెరటంలా ఉరకలు వేస్తుంది.

ఫణిగిరి వచ్చినరోజు తాగిన అర్జునుడు ఆ సారా డిపోనుంచే జైకొట్టుకుంటూ సెంటర్‌లో ఉన్న గాంధీతాత విగ్రహం దగ్గరకు వస్తాడు. పిల్లలు కూడా వెంటపడ్తారు.

అర్జునుడి జేబులో 10 రూపాయలు ఉంటే 8 రూపాయలకు సారాయి తాగుతాడు. 2 రూపాయలు మిగిల్చి వాటితో చౌక రకం బిస్కట్లు కొంటాడు.

ఆ బిస్కట్లకోసం పిల్లలు అర్జునుడు చెప్పినట్లే జైకొట్టుకుంటూ, ఆటాడుకున్నట్లు ఆనందంగా ఎగురుతూ గాంధీ బొమ్మ దగ్గరకు వస్తారు. అక్కడ అర్జునుడు రెండు మూడు నిముషాలు మీటింగు చెప్పి బిస్కె




ట్లని పిల్లలకు పంచి పెడతాడు.

ఒకరోజు అతనికి ఒక దున్న కుర్ర బే రంలో వంద రూపాయల ఆదాయం వచ్చింది. ఆ ఆదాయపు ఆనందంలో అర్జునుడు 40 రూపాయలకు సారాయి తాగి, 20 రూపాయలు పెట్టి బిస్కెట్లు కొని పిల్లలకు పంచిపెట్టాడు.

అప్పటినుంచీ అర్జునుడి వెంట పడే పిల్లల గుంపు మరీ ఎక్కువైంది.

ఆ పిల్లలకు అదొక ఆటగా, సరదాగా కూడా ఉంది.

అయితే అర్జునుడు పంచుతున్న బిస్కెట్లు పిల్లల్లో సగంమందికి కూడా చిక్కడంలేదు.

కండపుష్టి ఉన్న పిల్లవాడే అవి దక్కించుకుపోతున్నాడు. ఈ బిస్కెట్లుకోసం గుంపు కూడే పిల్లలు ఒకరిని ఒకరు నెట్టుకోవడం, కొట్టుకోవడం, తొక్కుకోవడం, తోసుకోవడం మామూలైపోయింది.

గాంధీ విగ్రహం ఉన్న వీధిలోనే, ఆ విగ్రహానికి దగ్గరలో ఉన్న ఇంటిలో ఎస్.ఐ. కిషోర్ కుటుంబం ఉంటున్నది. ఆ ఇంటికి పక్క పోర్షన్‌లో మండల అభివృద్ధి అధికారి కుటుంబం ఉంటున్నది.

కిషోర్ భార్య వనజా, ఎమ్.డి.ఓ. భార్య అరుణా మంచిస్నేహితులు. ఎవరి గొప్పలు వాళ్లు చెప్పుకోవడం, కలిసి షాపింగ్ చేయడం, గంటల తరబడి కూర్చొని కబుర్లు చెప్పుకోవడం ఇద్దరికీ అలవాటైపోయింది.

ఆ స్నేహితురాళ్లకి ఇటీవల అర్జునుడి విషయం పెద్ద చర్చనీయాంశంగా తయారైంది.

ఆమధ్య అర్జునుడు తాగి ఎం.డి.ఓ. ఇంటిముందే నేలమీద పడిపోయాడు. ఆ మత్తులో చాలా సేపటివరకూ కదలలేకపోయాడు. బట్టలు అస్తవ్యస్తమైపోయాయి. ఎవరో దారినపోయే దానయ్యా ఆ బట్టలు సరిచేశాడు. ఎస్.ఐ. భార్య వనజ ఆ సంఘటనతో అర్జునుణ్ణి చీదరించుకుంది.

గాంధీ మద్యం మానుకోండని బోధిస్తే మద్యం సేవించి ఆ గాంధీ బొమ్మ దగ్గర, ఆ గాంధీకి జై చెప్పటాన్ని చూసి వాళ్లు సహించలేకపోతున్నారు.

దానికి తోడు ఆమె కొడుకు ఎనిమిదేళ్ల శ్రీధర్ అర్జునుడు పంచే బిస్కెట్లకోసం గాంధీ విగ్రహం దగ్గరకు పోతున్నాడు.

తమ కుక్క కూడా ముట్టని అతను పంచే బజారు బిస్కెట్లకోసం ఆ పిల్లవాడు గాంధీ విగ్రహం దగ్గరకు పోయి అలగాపిల్లలతో ఎగురుతున్నాడు.

నిజానికి అతను వెళ్లేది బిస్కట్లు తినడానికి కాదు. ఇంట్లో సాయంవేళ వంటరిగా కూర్చొని చదువూ... చదువూ అని సతాయించే తల్లినించి కాస్త పక్కకు తప్పుకోవడానికి, ఆమె కళ్లు గప్పి, అతను గాంధీ బొమ్మ దగ్గరకు పోతున్నాడు.

అర్జునుడి వెంటపడుతున్న పిల్లల్ని చూస్తే శ్రీధర్‌కి చాలా సంతోషంగా ఉంది. హాయిగా, స్వేచ్ఛగా, ఎలాంటి కట్టుబాట్లు లేకుండా ఎగురుతూ, అర్జునుడి చేతిలోనుంచి బిస్కట్లు లాక్కుంటూ, గోలచేస్తూ, ఆ బిస్కట్ల కోసం పోటీపడుతున్న పిల్లల్ని చూస్తే శ్రీధర్‌కీ వాళ్లతోపాటు ఆడుకుందామనిపించింది. ఆ పిల్లలతోపాటు గాంధీకి జైకొడుతూ సరదాగా కేరింతలు కొట్టాలనిపించింది.

బడినుంచి రావడమే ఆలస్యం - టిఫిన్ తిని, పుస్తకాలు ముందేసుకొని ఉసూరుమంటూ కూర్చోవడంకంటే, పిల్లలతో కలిసి ఉత్సాహంగా ఎగరడమే శ్రీధర్‌కి ఇష్టంగా ఉంది.

ఆరోజు అరుణ వంటగదిలో ఉంటే పిల్లల అరుపులు విని చదువుకుంటున్న పుస్తకం పక్కన పడేసి గాంధీ బొమ్మ దగ్గరకు వెళ్లాడు శ్రీధర్.

అతనివెంట ఎస్.ఐ. కిషోర్ కొడుకు



సురేంద్ర ఏడుస్తూ వెంటపడితే ఆతనిని కూడా గాంధీ బొమ్మ దగ్గరకు తీసుకుపోయాడు. సురేంద్రకు ఆరేళ్లు.

అర్జునుడు తప్పతాగి గాంధీబొమ్మ దగ్గర అర్థంపర్థం లేకుండా ఏదో మాట్లాడుతున్నాడు.

అతని చుట్టూ పిల్లల గుంపు ఉంది. ముక్కుల్లోనించి చీమిడి కారుతోంది కొందరికి. చిరిగిపోయిన నిక్కర్లతో కొంతమంది ఉంటే, అసలు అవి లేకుండానే చాలామంది ఉన్నారు. వాళ్ల తలలు చీకిపోయిన తాటిటెంకల్లా ఉన్నాయి. కొబ్బరినూనె, దువ్వెన అనే వస్తువులు ఈ ప్రపంచంలో ఉన్నట్లు బహుశా వాళ్లకి తెలియదేమో!

ఆ పిల్లలు అర్జునుడు ఎప్పుడు బిస్కట్లు పంచుతాడా, ఎప్పుడు అవి తీసుకుని తిందామా అని ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు.

అర్జునుడు అయిదు రూపాయలకు ముక్కజొన్న పిండి బిస్కట్లు కొనుక్కువచ్చాడు. ఆ బిస్కట్లు నిజానికి అక్కడ ఉన్న పిల్లల్లో సగంమందికి కూడా రావు. అయినా ఆ పిల్లలు ఆశగా వాటికోసం ఎదురుచూస్తున్నారు.

ఇంతలో ఒక పిల్లవాడు అర్జునుడి చేతిలోని పొట్లం హఠాత్తుగా లాక్కుని పరుగు లంకించుకున్నాడు.

"ఓ..." అంటూ గోలగోలగా అరుస్తూ అయిదారుగురు పిల్లలు అతనివెంట పడ్డారు. పిల్లలు నెట్టుకునీ, పరిగెత్తీ, చెదురు మదురు అయ్యారు.

ఈ గలభాలో శ్రీధర్ కళ్లజోడు కిందపడి ఒక అద్దం పగిలిపోయింది. సురేంద్ర కూడా కిందపడ్డాడు. అతని మోకాలు చిట్లి నెత్తురు వచ్చింది.

'పిల్లలు ఎక్కడికి పోయారు?' అని అరుణా, వనజా బయటకు వచ్చారు.

సురేంద్ర ఏడుస్తూనూ, శ్రీధర్ భయంతోనూ వచ్చారు.

"ఏమైందమ్మా, ఏమైందమ్మా ఎందుకు ఏడుస్తున్నావు?" అని వనజ కొడుకుని అడిగింది.

"నెత్తూరు, నెత్తూరు'' అంటూ ఏడుస్తూ చెప్పాడు వాడు.

"ఎవరూ, ఎవరు నెట్టారు?"

వాడు ఏడుస్తూ గాంధీ విగ్రహంవైపు వేలు చూపెట్టాడు.

"గ్లాసెస్ ఎందుకు పగిలినాయిరా?" అని అరుణ కొడుకుని అడిగింది.

అతను భయంతో జరిగిన విషయం చెప్పాడు.

"అసలు ఎందుకు వెళ్లావు అక్కడికి? నువ్వు వెళ్లేదిగాక బాబుని కూడా ఎందుకు తీసుకువెళ్లావు?" అంటూ కొడుకు వీపుమీదా, చెంపమీదా జుట్టు పట్టుకొని లాగి నాలుగు అంటించింది.

"రోజూ ఈ న్యూసెన్స్ ఏంటండీ? వాడు తాగి వచ్చి సెంటర్‌లో పబ్లిగ్గా గొడవ చేయడం ఏమిటీ?" అరుణ అంది వనజతో.

"నాక్కూడా చాలా అసహ్యంగా ఉంటోందండీ! వాడిది అసలు ఈ ఊరు కూడా కాదట. తాగి వాళ్ల ఊళ్లోనో, ఆ సారాయి కొట్టువద్దో గొడవ చేసుకుంటే పర్లేదు. నడి ఊళ్లో ఏంటండీ గోల?"

"అసలు ఈ తాగుబోతుల్ని క్షమించకూడదండీ! మొన్న చూశారుగదా! బట్టల్లేకుండా మన ఇళ్లముందు ఎలా పొర్లాడుతున్నాడో! ఇలాంటివాళ్లకి తగిన బుద్ధి చెప్పాలండీ!"

"బుద్ధి చెప్పకపోతే లాభంలేదు. ఈ తాగుబోతులవలన మంచివాళ్లు కూడా పాడైపోతారు. పిల్లలు చూడండి, ఎలా వెంటపడుతున్నారో! తాగి ఆ పిల్లలకు బిస్కట్లు పంచిపెడ్తున్నాడు. ఇవ్వాళ బిస్కట్లు పంచిపెట్టేవాడు రేపు ఆ పిల్లలకు సారాయి కూడా పోయడని నమ్మకమేమిటి?"







"అవును, ఖచ్చితంగా పోయిస్తాడండీ. ఇలాంటి వాళ్లవల్లనే కదా, నిండా ఇరవైఏళ్ళు కూడా నిండని వాళ్ళు తాగుబోతులై పాడైపోవడం. అసలు గవర్నమెంటు ఈ సారాయిని బ్యాన్‌చేస్తే ఎంత బావుంటుందండీ?"

"ఆదాయంవస్తుంటే గవర్నమెంటు ఎందుకు బ్యాన్ చేస్తుంది? మన జిల్లాలో వున్న ఎమ్.ఎల్.ఏలు అందరికీ సారాయి వ్యాపారాలు వున్నాయంటండీ! మన జిల్లా మినిష్టర్ అయితే ఈ సారాయి వ్యాపారంలోనే లక్షలూ, కోట్లు సంపాదించాడట!"

"మీ వారితో చెప్పి ఈ తాగుబోతు గాడిదకొడుకుని ఈ బజారుకి రానీయకుండా చేయండి. వాడివలనే కదా ఇవ్వాళ మీ బాబు కాలికి దెబ్బతగలడం, మావాడు గ్లాసెస్ పగలకొట్టుకోవడం" అంది అరుణ.

"ఇవ్వాళ చెప్తా! రేపట్నించీ ఆ తాగుబోతుని ఈ బజారుకి రాకుండా చేయమని చెపుతాను'' అంది వనజ.

అన్నట్లుగానే మర్నాడు భర్త కిషోర్‌తో తాగుబోతు విషయం చెప్పింది ఆమె.

"'తాగి వాడు సెంటర్లో గోల చేస్తే మనకేం వనజా? వాడి సొమ్ము పెట్టి వాడు తాగుతున్నాడు. గవర్నమెంటు ఏమైనా తాగుబోతుల్ని అరెస్టు చేయమని మాకు ఆర్డర్ వేస్తే ఇలాంటి తాగుబోతు వెధవల్ని పట్టుకుపోయి లాకప్‌లో వేసి నాలుగు ఉతుక్కునే వాళ్లం. గవర్నమెంటే తాగుతాగు, తాగితాగి తూలు తూలు అని చెప్తుంటే మనం ఏం చేయగలం?"

"మీరేం చేయగలరు, ప్రతీరోజూ తాగి ఇంటికి రావడం తప్ప! చదువుకున్నవాళ్ళూ పెద్ద పోలీసాఫీసరూ మీరే రోజూ తాగుతున్నారు. చదువులేని, ఏమీ తెలియని ఆ పల్లెటూరివాడు తాగితే విచిత్రం ఏముందిలెండి? ఇంట్లోనూ తాగుబోతులే, వీధిలోనూ తాగుబోతులే, ఎక్కడ చూసినా తాగుబోతులే

నాయె!" అంది వనజ భర్తను ఓరకంట చూస్తూ, హాస్యంగా అతనిని కవ్విస్తూ నవ్వుతూ.

"ఉరుముఉరిమి మంగళంమీద పడినట్లు మళ్ళీ నామీదే గురిపెట్టావ్ నీ విమర్శలు. ఇంతకీ నువ్వు అనేదేమిటి?"

"నేను అనేది ఏముందిలెండి? ఆ తాగుబోతుని ఈ బజారుకి రాకుండా చేయండి, చాలు''

"ఓస్... అది ఎంతసేపు? ఇవాళ వాడు వచ్చినపుడు స్టేషన్‌కి ఫోన్ చెయ్యి. ఇంక జీవితంలో ఎప్పుడూ మందు అనే దాన్ని ముట్టుకోకుండా చేస్తా'' అన్నాడు కిషోర్ మీసం మెలి తిప్పుతూ.

ఒక చిన్న కేసులో మూడు వేల రూపాయలు అనుకోకుండా అతని చేతికి అయాచితంగా దొరికాయి. అందుకే ఆ రోజు కిషోర్ ఉత్సాహంగా, సంతోషంగా వున్నాడు.

మనసు తేలిపోతోంది. ఎప్పుడూ భార్యతో చిర్రుబుర్రు లాడుతూ, చీదరించుకుంటూ మాట్లాడే వాడల్లా ఆరోజు నవ్వుతూ ఉల్లాసంగా మాట్లాడాడు.



తరువాత నాలుగు రోజులకి అర్జునుడు తాగి ఆ వీధికి వచ్చాడు. అప్పటికప్పుడే వనజ భర్తకి ఫోన్ చేసింది.

కిషోర్ పోలీసుల్ని పంపించాడు. వాళ్ళు అర్జునుణ్ణి స్టేషన్‌కు తీసుకువచ్చారు.

"తాగి, వీడు మామీద చెయ్యి చేసుకున్నాడు సార్!" ఎస్ ఐ తో చెప్పాడు రాజు.

"ఏమిటీ? డిపార్ట్‌మెంట్‌మీద చెయ్యి చేసుకోవడమా? లాకప్‌లో వేయండి, వాడి అంతు చూద్దాం!"

అర్జునుడు దణ్ణం పెడుతూ, ఎంత విలపిస్తున్నా వినకుండా లాకప్‌లో వేశారు.

"ఏరా లం... కొడకా, మామీద చెయ్యి చేసుకునేవాడి వంట్రా నువ్వు? ఏ ఊర్రా నీది?"

"నేను చెయ్యి చేసుకోలేదు సార్... నేను ఏ నేరమూ చేయలేదు సార్... నన్ను వదిలిపెట్టుసార్... నీ కాళ్ళకు దణ్ణం పెడతాను సార్..." అంటూ అర్జునుడు కిషోర్ కాళ్ళు పట్టుకున్నాడు.

కూర్చుని కాళ్ళు పట్టుకున్న అర్జునుణ్ణి బూటు కాలితో ఫెడేల్‌మని బలంగా తన్నాడు కిషోర్.

"ఏ ఊర్రా నీది?"

"గంగన్న పాలెం సార్. నేను ఆ ఊరి పంచాయితీ మెంబర్‌ని సార్' అన్నాడు అర్జునుడు ఏడుస్తూ.

"నువ్వు ఆ వూరి పంచాయితీ మెంబరువా? నిన్ను జనం ఎట్లా ఎన్నుకున్నార్రా ఎర్రి లం... కొడకా?" లాఠీతో వీపు మీద ఒక్క దెబ్బ వేసి అన్నాడు కిషోర్.

"మీకు దణ్ణం పెడతా నన్ను వదిలేయండి సార్. నేను ఏ తప్పూ చేయలేదు సార్!"

"ఏ తప్పూ చేయలేదంట్రా, నీ... తాగడం మొదటి తప్పు. తాగి బజార్లంట న్యూసెన్స్ చేయడం రెండవ తప్పు. ఇంక డిపార్ట్‌మెంట్ మీదచేయి చేసుకోవడం మూడో తప్పు. అది అన్నింటికన్నా పెద్ద తప్పు. ఈ తప్పు మాత్రం క్షమించకూడని తప్పు"

"పొరపాటైంది సార్. మత్తులో తెలియలే

దు సార్. ఈ సారికి మన్నించి వదిలేయండి సార్' ఏడుస్తూ, బ్రతిమలాడుతూ అన్నాడు అర్జునుడు.

"రేయ్... నీలాంటి చిల్లర లం... కొడుకూ, పైసాకి పనికిరాని పందికొక్కు, డిపార్ట్‌మెంట్ మీద చెయ్యి చేసుకుంటే, ఆ తప్పుని క్షమించి వదిలిపెడితే మా ప్రిస్టేజీ ఏం కావాలిరా? మేం అంత వెధవలం, గాజులు తొడుక్కుని కూర్చునే పనికిమాలిన రకం అనుకుంటున్నావ్రా?" అని కిషోర్ లాఠీతో అర్జునుడి నెత్తిమీదా, వీపుమీదా, పొట్టమీదా నిర్దాక్షిణ్యంగా, బలంగా కొట్టసాగాడు.

అర్జునుడు "అయ్యో... అమ్మో... దణ్ణం పెడతా దేవుడో, సామో'' అంటూ పెద్దగా ఏడుస్తూ కొట్టొద్దు అని ప్రాధేయపడుతున్నాడు.

అర్జునుణ్ణి కొడుతున్న కిషోర్ దృష్టి అతని జేబుమీద పడింది.

"జేబులో ఆ మూట తీయరా'' అన్నాడు కొడుతూనే.

అవి డబ్బులు. వాళ్ళ చేతుల్లోకి పోతే ఇక రావని జేబుని గట్టిగా పట్టుకున్నాడు.

"అవి తియ్యరా ముందు బయటకు'' అంటూ బలవంతంగా జేబులోనించి ఆ కట్టని బయటకు తీశాడు కిషోర్.

పాలిథిన్ సంచిలో జాగ్రత్తగా పెట్టుకున్నాడు డబ్బులు. తాగి మత్తులో ఎక్కడైనా తాను పడిపోయినప్పుడు ఎవరైనా కాజేస్తారనే ఉద్దేశంతో జేబులో భద్రంగా దాచిపెట్టుకున్నాడు. వెయ్యి రూపాయలు అవి.

అవి అతని జేబులోనించి లాక్కున్న కిషోర్ కొట్టడం ఆపి ఆ డబ్బులు తీసుకుని కానిస్టేబుల్‌కి మూడువందలు ఇచ్చి అన్నాడు.

"రాజూ... ఇవి తీసుకుపోయి ఇంగ్లీషు పట్టుకురా, అందరం పార్టీ చేసుకుందాం. తొందరగా రావాలి!"

"అవి నా డబ్బులు కాదు సామీ... కోతకి దున్న కుర్రని కొనుక్కుందామని అప్పు తెచ్చుకున్నా సామీ..."

"చత్ నోర్ముయ్... నీకు ఇంకా మదం అణగలేదురా! ఇంకా నాలుగు తగిలిస్తే గానీ నీ కొవ్వు అణగదు! రాజూ... ఇదుగో ఈ వంద కూడా తీసుకుపోయి కారా, స్వీటూ పట్టుకురా! స్వీటు ఎక్కువ తీసుకురా! ఈ గాడిదకొడుక్కి స్వీట్ ట్రీట్‌మెంట్ ఇద్దాం! తొందరగా రావాలి!" అన్నాడు కిషోర్.

"అవి నా డబ్బులు కాదు సామీ! మీకు దణ్ణం పెడతా సామీ! అవి అప్పు తీసుకున్న డబ్బు సామీ!" అని అర్జునుడు లాకప్‌లో నుంచి మొత్తుకుంటున్నాడు.

"నోర్ముయ్యమంటే మాట్లాడతావేరా భాడ్కావ్!" ఎస్ఐ అర్జునుడి వీపుమీద లాఠీతో ఫెడేల్‌మని దెబ్బకొట్టి మళ్ళీ అన్నాడు, "ముందు మందు పార్టీకానీ... నీ పని బడతాం!"

ఆ స్టేషన్‌లో ఆ రోజు డ్యూటీలో నలుగురు కానిస్టేబుళ్ళూ, ఒక హెడ్ కానిస్టేబులూ, ఎస్ఐ మాత్రమే వున్నారు. మిగతావాళ్ళు సెలవులో వున్నారు.

బ్రాందీ సీసాలకు వెళ్ళిన కానిస్టేబులు రాజు కొద్దిసేపటికి అవి తీసుకుని వచ్చాడు.

"ముందు మన బంధువుకి ఆ స్వీట్లు పెట్టు. తింటాడు పాపం! వాడి జన్మలో ఎప్పుడూ ఇలాంటి స్వీట్ రుచి కూడా చూసివుండడు. తినరా పంది లం... కొడుకా... పంది తిన్నట్లు తిను!" అన్నాడు కిషోర్.

రాజు తను తెచ్చిన స్వీట్ ప్యాకెట్ విప్పతీసి అర్జునుడికి తినమని చెప్పి ఇచ్చాడు.

"నాకు అవేమీ వద్దు సామీ! నా డబ్బు నాకు ఇచ్చి నన్ను విడిచిపెట్టండి సామీ! నేను అన్నెంపున్నెం ఎరగను సామీ!"




# సాహసకృత్యాలు

నలభైయేళ్ల మైక్ సాలికిన్ కొండచిలువలని పట్టి 'జూ' పార్క్‌లకి అమ్మి పొట్టపోసుకుంటాడు. ఈ సర్పాలు విషపూరితం కాకపోయినా మనిషిని చుట్టుకుని ఎముకలని నుగ్గునుగ్గు చేసి చంపుతాయి. ఆఫ్రికాలో మాత్రమే కనుపించే 'అనగొండ' అనే పేరుగల ఈ సర్పాలు ప్రపంచంలోకెల్లా అతిపెద్ద కొండచిలువలుగా ప్రసిద్ధిచెందాయి. నీటి అడుగున తిరుగాడే ఈ భయంకర సర్పాలని ఏ పరికరం ఉపయోగించకుండానే రెండు చేతులతో పట్టి బయటకు తీసుకొస్తాడు మైక్. పైగా "సాహసంతో కూడిన సంపాదనంటే నాకెంతో ఇష్టం" అనే మైక్ ప్రపంచంలోని అన్ని జంతుప్రదర్శన శాలలకి అనగొండలను సరఫరా చేస్తాడు.

"విడిచిపెడతాం లేరా, ఇవి తిను! ఇవి తింటే విడిచిపెడతాం. ముందు తినరా, వదులుతాం!" అన్నాడు రాజు మెత్తటి స్వరంతో.

"ఇవి తింటే నిజంగా వదులుతారా?" అర్జునుడు అడిగాడు ఆశగా, అమాయకంగా.

"నిజంగా వదుల్తాం, తిను" అన్నాడు రాజు.

అర్జునుడు అతను పెట్టిన స్వీట్లు తిన్నాడు.

ఎస్ఐ, కానిస్టేబుళ్ళు చౌకబారు జోక్స్ వేసుకుంటూ, వాళ్ళ జోకులకి వాళ్ళే వికృతంగా, కౄరంగా నవ్వుకుంటూ, వేరుశనగపప్పూ, చెగోడీలూ తింటూ తాగడం పూర్తిచేశారు.

అర్జునుడు తిన్న స్వీట్లు ఎక్కువ నూనె, ఎక్కువ పంచదార వేసి తయారుచేసినవి. అవి తిన్న తరువాత నోరు ఎండిపోయింది. నాలుక పిడచకట్టుకుపోయింది. ఇక ఒకటే దాహం.

అర్జునుడికి బాగా దప్పికవుతున్నది. "అయ్యా, మీరు పెట్టినవి తిన్నాను సామీ! దప్పికవుతున్నది, మంచినీళ్ళిచ్చి నన్ను యిడిచిపెట్టండి సామీ!" అడిగాడు అర్జునుడు.

"వదుల్తాం లేరా, తొందరపడతావేం? ఇంకా ఇక్కడ నాలుగు స్వీట్లు వున్నాయి. ఇవి కూడా తిను. మంచినీళ్ళిస్తాం" అన్నాడు రాజు నమ్మకంగా.

అర్జునుడు అవీ తిన్నాడు.

పోలీసులు ఉపయోగించే థర్డ్ డిగ్రీ మెథడ్స్‌లో ఇదోరకం హింస. కాస్తంత డబ్బూ, పలుకుబడీ వున్నవాళ్ళని అరెస్టుచేసి, హింసించాల్సిన పరిస్థితి వస్తే సున్నితంగా పోలీసులు ఈ స్వీట్ ట్రీట్‌మెంట్‌నీ, డ్రింక్ ట్రీట్‌మెంట్‌నీ ప్రయోగిస్తారు.

ఎక్కువ నూనెతో తయారుచేసిన స్వీట్లు తినిపించి, ఇక వాళ్ళకి దాహం అవుతుంటే ఎంతకీ మంచినీళ్ళు ఇవ్వకుండా వాళ్ళని బాధించే పద్ధతి స్వీట్ ట్రీట్‌మెంట్!

డ్రింక్ ట్రీట్‌మెంట్ అంటే 'నిందితుడు'కి ఎక్కువ మంచినీళ్ళు ఇస్తారు. ఏలాగోలా ఆ వ్యక్తితో ఎక్కువ నీళ్ళు త్రాగించి ఇక మూత్రం చెయ్యనివ్వకుండా బాధపెడతారు. బయటికి మూత్రం వదలరు. ఆ లాకప్‌లో కూడా మూత్రం చేసే అవకాశం లేకుండా నేరస్తుడు మగ అయితే ఎదురుగా ఆడ పోలీసుల్ని కూర్చోపెడతారు. నేరం చేసిన వ్యక్తి ఆడ అయితే ఎదురుగా మగ పోలీసులు వుంటారు. ఇక ఆ వ్యక్తులు మూత్రం పోసుకునే వీలులేక అనుభవించే మానసిక బాధ వర్ణనాతీతం.

అర్జునుడి దగ్గర డబ్బు కొట్టేశారు కాబట్టి ఏదో సరదాగా అర్జునుడికి స్వీట్ ట్రీట్‌మెంట్ ఇచ్చారు. అర్జునుడు చాలా సేపట్నించీ మంచినీళ్ళు కావాలని అరుస్తూనే వున్నాడు.

"మంచినీళ్ళు కావాల్రా నీకు... ఇస్తా వుండు..." అర్జునుడితో అని "ఫస్ట్‌డ్యూటీ ఎవరు తీసుకుంటారు? స్వీట్ రుచేకాదు. ఈ గాడిదకి అన్ని రకాల రుచులూ చూపెట్టాలి. డిపార్ట్‌మెంట్ మీద చెయ్యి చేసుకోవడం అంటే ఆ చేతిని అంతవరకూ తెగ నరకాలి. నరికితే తరువాత సమస్యరావచ్చు. వాడికి బతికినంతకాలం గుర్తుండేటట్లు పనిష్మెంట్ ఇవ్వాలి. ముందు ఎవరు డ్యూటీ?" తాగుడు నిషాలో హుషారుగా అడిగాడు కిషోర్.

"నేను సార్! వాడు చెంప దెబ్బ కొట్టింది నన్ను సార్. నా కసిని తీర్చుకోనియ్యండి సార్" లింగయ్య అన్నాడు.

"సరే కానీ... నువ్వు టైర్ అయ్యేవరకూ నీ డ్యూటీ. తరువాత రాజు... తరువాత నువ్వూ... తరువాత నువ్వూ..." అని, ఆ నిరుపేద దేహాన్ని రకరకాలుగా చిత్రహింసలు పెట్టడానికీ, ఆ అమాయకుడ్ని అన్ని రకాలుగా బాధలు పెట్టడానికి ఉత్సాహంగా

డ్యూటీలు వేశాడు సబ్‌ఇన్స్‌పెక్టర్.

చొక్కా విప్పి బనియన్‌మీద లాకప్ రూంలోనికి వెళ్లాడు లింగయ్య. రెండు కర్రలూ, ఒక ఇనుపరాడ్ తీసుకుని వెళ్ళాడు.

"వామ్మో... వాయ్యో... దేవుడో..." అని లాకప్ రూంనించి పెద్దపెద్ద అరుపులతో కూడిన ఏడుపులూ, పెద్ద శబ్దాలతో దెబ్బలూ వినబడుతున్నాయి.

ఆ అరుపులకీ, దెబ్బలకీ వీళ్ళు ఆనందంగా పగలబడీ, విరగబడీ నవ్వుకుంటున్నారు.

"కొట్టు లం... కొడుకునీ... లాగో... పీకో... బాగ తగలనీయ్ దెబ్బ... గట్టిగా తగలనీయ్..." అని బయటినించి ఉత్సాహంగా కేకలు పెడుతున్నారు.

కొట్టీ కొట్టీ అలసిపోయిన లింగయ్య విరిగిపోయిన కర్రలతో కొద్దిసేపటికి బయటికి వచ్చాడు.

"మన దెబ్బలకి చస్తాడేమో సార్! ఈ పూటకి రెస్ట్ ఇచ్చి, రేప్పొద్దున మళ్ళీ ఇద్దాం కోటింగ్" అన్నాడు ఒక పీసి.

"ఈ దెబ్బలకే చావడమా, మనిషి చూడు ఎలావున్నాడో! దున్న మాంసం తిని దున్న మాదిరిగా బలిసివున్నాడు'' అన్నాడు రాజు.

తరువాత అతను వెళ్ళాడు లోపలికి.

అర్జునుడి నిస్సహాయత్వానికీ, దయనీయ స్థితికీ ఆ పీసీ జుగుప్సాకరమైన ఆనందం అనుభవిస్తూ కొట్టడం ప్రారంభించాడు.

అంతకుముందు పెద్దగా ఏడ్చిన అర్జునుడు ఇక ఏడ్చే ఓపికా, శక్తీ లేక నీరసంగా మూలుగుతున్నాడు.

"దప్పికవుతోంది... దప్పిక... గొంతెండిపోతోంది... మంచినీళ్ళు కావాలి సామీ..." మూలుగుతూనే అన్నాడు.

"లింగయ్యా... వాడికి మంచినీళ్ళు కావలంట, ఇవ్వు!" అని ఎస్ఐ కిషోర్ ముసిముసిగా నవ్వి, కళ్ళతో సైగచేశాడు.

లాకప్‌లో వున్న సత్తుగ్లాసు బాత్‌రూంలోనికి తీసుకుపోయాడు అతను. అక్కడ మూత్రం ఆ గ్లాసులో పోసి, తెచ్చి అర్జునుడికి ఇచ్చాడు.

దప్పికమీదవున్న అర్జునుడు ఒక గుక్క తాగి, వాసనా, రుచీ తెలుసుకుని అసహ్యంతో గ్లాసు కిందపెట్టాడు.

"తాగరా లమ్డీకొడకా... నీళ్ళు కావాలంటివి కదరా?" అని అతనిని కాలితో ఒక్క తన్ను తన్ని, బయటకు వచ్చాడు లింగయ్య.

అర్జునుడి శరీరం వాతలు తేలిపోయింది. చర్మం చాలా చోట్ల చిట్లి రక్తం స్రవిస్తోంది. అతను నేలమీద పడి పొర్లాడుతూ దండంపెడుతూ వేడుకుంటున్నాడు.

అయినా సరే, ఆ పోలీసు హృదయం కరగలేదు. కరుణ, కనికరం, మానవత్వం, దయ, దాక్షిణ్యంలాంటివి ఏవీ వారిలో లేవు.

రాజు కూడా అలసిపోయేవరకూ కొట్టి ఇవతలకు వచ్చి నిలబడ్డాడు రొప్పుతూ.

"మనం అలిసిపోతున్నాం కానీ, వాడు ఏమీ అలిసిపోతున్నట్లు లేదే! మీరు వుండండి, నేనూ ఒక చూపుచూస్తా!" అని కిషోర్ లాకప్ రూంలోకి వెళ్ళాడు.

కిషోర్ ఐదునిముషాలు ఎడాపెడా కొట్టాడు. అప్పటికే విపరీతంగా దెబ్బలు తిన్న అర్జునుడు ఇక తట్టుకోలేక స్పృహతప్పి పడిపోయాడు.

"రాజూ... ఇలా వచ్చి చూడు... ఏందీ వీడు పడిపోయాడు. మాటాపలుకూ లేదు. చచ్చాడేంది?"

"చావటమా, పాడా సార్. యాక్షన్... దెబ్బలు తప్పించుకోవడానికి ఎత్తు వేస్తున్నాడు సార్!" అన్నాడు అతను.

"శ్వాస తీస్తున్నాడు సార్. చూద్దాం. ఎంతసేపు వీడు ఇలా యాక్షన్ చేస్తాడో..." అన్నాడు మరో పీసి అర్జునుడి ముక్కు దగ్గర వేలుపెట్టి చూసి.





అందరూ ఎస్ఐ రూంలోనికి వచ్చారు.

అర్జునుడి దగ్గర కొట్టేసిన డబ్బులో మూడు వందలు పీసిలకు ఇచ్చి కిషోర్ అన్నాడు, "ఈ డబ్బు మీరు పంచుకోండి రాజూ..."

రాజు మనసులో విసుక్కుంటూ ఆ మూడువందలూ తీసుకుని స్టేషన్ వెలుపలకి వచ్చాడు. లింగయ్య అనుసరించాడు.

"వాడికి ఒక్కడికే 3 వందలూ, ఇవ్వాళ డ్యూటీలో వున్న మన ఐదుగురికీ 3 వందలూనా? వీడు ఈ స్టేషన్‌కి వచ్చాడూ, మన నోట్లో మన్ను వేస్తున్నాడు. కక్కుర్తిలం... కొడుకుగాకపోతే మన నోటిదగ్గర కూటికి ఆశపడటం ఏందంట?" అన్నాడు లింగయ్య.

మాట్లాడుకుంటూ ఇద్దరూ దగ్గర్లో వున్న టీ స్టాల్‌కి వెళ్ళి, అక్కడ కొద్దిసేపు కూర్చుని, టీ తాగి వచ్చారు.

వీళ్ళు వెళ్ళేసరికి ఎస్ఐ కిషోరూ, ఇద్దరు కానిస్టేబుళ్ళూ హడావిడిపడిపోతున్నారు.

"ఏమైంది సార్... ఏమైంది?" అడిగాడు లింగయ్య.

వాడు ఏమిటో నోరు మెదపకుండా పడి వున్నాడు. కదిలిస్తే వులుకూ పలుకూ లేదు. ఏమైనా జరిగితే తరువాత మనకి ప్రాబ్లం అవుతుంది. అనవసరంగా రిస్క్ పడాలి. ఎందుకైనా మంచిది, హాస్పిటల్‌కు తీసుకుపోతే బాగుంటుంది. లింగయ్యా, వెళ్ళి రిక్షాని తీసుకురా'' అన్నాడు కిషోర్.

రాజు లోనికి వెళ్ళి చూసి వచ్చి అన్నాడు, "ఏం కాదులే సార్. సరే, ఎందుకైనా మంచిది హాస్పిటల్‌కు తీసుకుపోతే మనకీ పీడా వదుల్తుంది. చస్తే అక్కడ చస్తాడు. పొరపాటున ఇక్కడ చచ్చినా, ఎంక్వయిరీ అనీ అదనీ ఇదనీ మనల్ని చంపుకు తింటారు. ఎందుకు వచ్చిన రిస్క్?" అన్నాడు రాజు.

లింగయ్య రిక్షాకోసం వెళ్ళి ఐదునిముషాల్లో తీసుకువచ్చాడు.

కానిస్టేబుళ్ళు ముగ్గురూ కలసి అర్జునుణ్ణి మోసుకువచ్చి రిక్షాలో పడుకోబెట్టారు. అతని ముక్కువెంటా, నోటివెంటా నెత్తురు కారిపోతోంది. మనిషి స్పృహలో లేడు.

"హాస్పిటల్‌కు ఎవరు వెళ్తారు?" అడిగాడు కిషోర్.

పీసిలు జవాబు చెప్పకుండా మౌనంగా వున్నారు.

"నువ్వూ, రాజూ వెళ్ళండి లింగయ్యా!"

"మా ఆవిడ ఊళ్ళో లేదు సార్. ఇంటి దగ్గర చిన్నపిల్లలు నాకోసం ఎదురుచూస్తుంటారు సార్. ఇప్పటికే పొద్దుపోయింది. పెందలాడే వస్తానని చెప్పాను సార్'

"మా ఆడదానికి మూడు రోజుల్నించీ జ్వరం సార్. మూసిన కన్ను తెరవడంలేదు. నేను వెళ్ళకపోతే ఇబ్బంది పడుతుంది సార్'

"ఎవరికి వాళ్ళే తప్పించుకుంటే ఎలాగయ్యా? ఏం కాదులే, డాక్టర్‌కి ఫోన్ చేసి మాట్లాడతాను. మీరు హాస్పిటల్లో అడ్మిట్ చేసి ఇంటికి పొండి'' అన్నాడు ఎస్.ఐ.

గంటక్రితం ఉన్న ఉత్సాహం వాళ్ళలో ఇప్పుడు లేదు. ఎవరికి వాళ్ళే ఆందోళనపడిపోతున్నారు. భయపడుతున్నారు. తప్పించుకుందామని చూస్తున్నారు.

"రేయ్ రిక్షా... స్టేషన్‌నుంచి వీణ్ని ఇలా హాస్పిటల్‌కు తీసుకుపోయినట్లు ఎవరితోనైనా మాటమాత్రం అన్నావో, వాడికి ఏ గతి పట్టిందో, నీకూ అదే గతి పడుతుంది'' హెచ్చరిస్తూ అన్నాడు కిషోర్.

"నేను చెప్పను సార్. నాకెందుకు సార్' అన్నాడు రిక్షా అతను.

చివరికి రాజూ, లింగయ్యా కలసి అర్జునుడిని గవర్నమెంట్ హాస్పిటల్లో అడ్మిట్ చేయడానికి తీసుకుపోయారు.

అది చిన్న ప్రభుత్వాసుపత్రి. అందులో రోగులు ఎవరూ వుండరు.

కొట్లాడుకుని దెబ్బలు తగిలిన వాళ్ళూ, యాక్సిడెంట్లు అయి గాయపడినవాళ్ళూ కోర్టుకేసులకోసం ఆ ఆసుపత్రికి వస్తుంటారు. పేదలు కుటుంబనియంత్రణ ఆపరేషన్లు చేయించుకోవడానికి కూడా అక్కడికే వస్తారు.

అంతకుమించి సాధారణ రోగులు ఎవరూ కూడా ఆ ఛాయలకు వెళ్ళరు.

వీళ్ళు వెళ్ళేసరికి డాక్టర్ లేడు. "డాక్టర్‌గారు ఇంటికి పోయారండీ!" అంది అక్కడ వున్న నర్సు.

"ఎలా ఇప్పుడు? అటెండర్ వున్నాడా?" అన్నాడు లింగయ్య.

నర్స్ వెళ్ళి అతన్ని పిలుచుకువచ్చింది.

"వెళ్ళి డాక్టర్ని పిలుచుకురావాలోయ్. అర్జంట్" అన్నాడు రాజు.

ఆ అటెండర్‌కి కూడా ఒక సందర్భంలో పోలీసులతో అవసరం వచ్చింది. వాళ్ళకీ, అతనికీ పరిచయాలు వున్నాయి. వెంటనే అతను డాక్టర్‌కోసం వెళ్ళాడు.

★ ★ ★

గంగన్నపాలేనికీ, ఫణిగిరికీ మధ్య ఆరుకిలోమీటర్లదూరం వుంటుంది.

గంగన్నపాలెం జనం నిద్రలేస్తే ఫణిగిరి వచ్చిపోతుంటారు. సరుకులకోసం, కూరగాయలకోసం, మిత్రులతో కాలక్షేప రాజకీయాలు చర్చించడం కోసం, పేకాట ఆడేవాళ్ళు పేకాటకోసం, కొంతమంది ప్రత్యేకంగా టిఫిన్ చేయడంకోసం, సినిమాలకోసం, పిల్లలు హైస్కూలూ, కాలేజీ చదువులకోసం, వైద్యం కోసం, బ్యాంకు పనులకోసం- ఇలా రకరకాల పనులతో ఆ వూరి జనాభాలో సగంమంది ఫణిగిరిలోనే వుంటారు. ప్రతి చిన్న పనికీ ఆ వూరివాళ్ళు ఫణిగిరి రావాల్సిందే.

అర్జునుణ్ణి బజారులో పోలీసులు కొట్టి, స్టేషన్‌కు తీసుకుపోవడం గంగన్నపాలెం మనిషి ఒకతను చూశాడు. ఇంటికి వెళ్ళిన వెంటనే విషయాన్ని వాళ్ళ కుటుంబానికి తెలియచేశాడు.

హరిజనవాడలో అందరికీ అర్జునుణ్ణి పోలీసులు పట్టుకున్నారని తెల్సింది. ఎందుకు పట్టుకున్నారనే విషయం ఎవరికీ అంతుబట్టలేదు. తెలియని విషయం గురించి రకరకాలుగా మాట్లాడుకోవడం మొదలుపెట్టారు.

అర్జునుడి భార్య తన భర్తని పోలీసులు పట్టుకున్నారనీ, ఫణిగిరి సెంటర్‌లో కొట్టారనీ తెలియగానే పెద్దగా ఏడవటం మొదలుపెట్టింది.

అర్జునుడి అన్నదమ్ములూ, బావమరుదులూ పల్లెలో జనం చాలా మంది కదిలారు. ట్రాక్టరు మాట్లాడుకుని ఆ ట్రాక్టరు ట్రక్కు నిండా జనంతో ఫణిగిరి వచ్చారు.

హరిజనవాడలోని వాళ్ళు వెళ్ళి పోలీసులతో పెద్ద మనిషిగా మాట్లాడటానికి ఆ వూరి సర్పంచ్ నరసయ్యని కూడా తీసుకువచ్చారు. ఆయన కూడా వాళ్ళతో పాటు అదే ట్రాక్టరులో వచ్చాడు.

వీళ్ళు స్టేషన్ దగ్గరకి వచ్చేసరికి రాత్రి దాదాపు 11, 12 గంటలు కావస్తోంది.

స్టేషన్‌లో అప్పుడు ముగ్గురు పీసీలు మినహాయించి ఇంక ఎవరూ లేరు.

ట్రాక్టర్ నేరుగా స్టేషన్ దగ్గరకు వచ్చింది.

జనాల్ని చూడటంతోనే పోలీసులు హడలిపోయారు. భయంతో తుపాకులు సరిచేసుకోవడం మొదలుపెట్టారు.

సర్పంచ్ నరసయ్యా, ఇంకా ఇద్దరు స్టేషన్ లోపలికి వెళ్లారు.

"మా వూరి అర్జునుణ్ణి అరెస్టు చేశారంట. ఎందుకు?" సర్పంచ్ నరసయ్య అడిగాడు.

"మేమెందుకు అరెస్టు చేశామండీ? ఆయన ఏం నేరస్తుడని అరెస్టు చేస్తాం?"

"మరి మీరు పట్టుకు వచ్చారంటకదయ్యా?"






"సాయంత్రం పూట తాగి, బజారులో మత్తులో తెలియకపడిపోయాడు. వంటిమీద దెబ్బలు తగిలివుంటే మావాళ్లు గవర్నమెంటు ఆస్పత్రిలో చేర్పించారు'' అన్నాడు హెడ్‌కానిస్టేబుల్.

"తాగి బజారులో పడిపోతే దెబ్బలు ఎందుకు తగుల్తాయ్? అదీ, ఆస్పత్రిలో చేర్పించాల్సినంత పెద్ద దెబ్బలు ఎందుకు తగుల్తాయ్?" అన్నారు జనం.

అందరూ మళ్ళీ ట్రాక్టరు ఎక్కి గవర్నమెంట్ హాస్పిటల్ దగ్గరకు వెళ్ళారు.

అక్కడ జనం అందర్నీ అర్జునుడు ఉన్న రూంలోనికి వెళ్ళనివ్వలేదు.

సర్పంచ్, అర్జునుడి భార్యా, కొడుకూ ఆ రూంలోనికి వెళ్ళారు. అక్కడ అర్జునుడు స్పృహ లేకుండా వున్నాడు. చేతికి సెలైన్ సీసా కట్టివుంది.

అతని వంటినిండా దెబ్బల గుర్తులు స్పష్టంగా కనపడుతున్నాయి. ఉండీ, ఉండీ ఒక్కోసారి మూలుగుతున్నాడు. పెద్దగా ఉలిక్కిపడుతున్నాడు.

అర్జునుణ్ణి ఆ స్థితిలో చూసిన భార్యా, కొడుకూ ఒక్కసారిగా పెద్దగా ఏడుపు మొదలెట్టారు.

"ఊరుకొండి... వూరుకొండి... ఇక్కడ ఏడవకూడదు'' అని సర్పంచ్ వాళ్ళని సముదాయించడానికి చూశాడు.

డాక్టరూ, నర్సూ, కంపోండరూ కలిసి "ఇక్కడ ఏడవకూడదు. అతనికి ఏంకాదు. భయపడకండి'' అని వాళ్లకి చెప్పి బయటకు పంపించారు.

వీళ్లు బయటకు వచ్చి ఏడుస్తూ అతని పరిస్థితి చెప్పడంతో అర్జునుడి అన్నదమ్ములూ, కొడుకులూ, కోడళ్ళూ, కూతుళ్లూ అందరూ పెద్దగా ఏడవటం మొదలుపెట్టారు. వాళ్ళ ఏడుపులతో ఆ ఆస్పత్రి ఆవరణ అంతా గందరగోళంగా తయారైంది.

పోలీసులే అర్జునుణ్ణి చిత్తుచిత్తుగా కొట్టి ఆస్పత్రిలో చేర్పించారని అక్కడ చేరిన ప్రజ లకు తెలిసిపోయింది.

ఆడవాళ్లు పోలీసుల్ని శాపనార్థాలు పెడు తూవుంటే, మగవాళ్లు బండబూతులు తిడు తున్నారు.

అర్జునుడి దగ్గర రాజు అనే పీసీ ఒక్కడే వున్నాడు. వాళ్ళ తిట్లు వింటూ, బిక్కు బిక్కుమంటూ వున్న అతను అక్కడినించి వెళ్ళిపోవాలని ప్రయత్నించాడు.

"మీ డిపార్ట్‌మెంటేగదా హాస్పిటల్లో అడ్మిట్ చేసింది. అతని పరిస్థితి సీరియస్‌గా వుంది. మీరు ఎవరో ఒకరు ఇక్కడ కంపల్సరీగా వుండాలి. ఇది కాంప్లికేటేడ్ కేసు'' అని డాక్టర్ స్పష్టంగా తేల్చిచెప్పడంతో రాజు అక్కడే వుండాల్సివచ్చింది.

డాక్టర్ ఆ రాత్రి రెండు గంటలవరకూ అర్జునుడికి అవసరమైన మందులు వాడాడు. ఉండేకొద్దీ రోగి పరిస్థితి క్షీణించడం మొదలుపెట్టింది.

"లాభం లేదండీ, ఈ కేసు నా వల్ల కాదు. అవసరమైన మందులూ, పరికరాలూ మా దగ్గర లేవు. జిల్లాకేంద్రం ఆసుపత్రికి తీసుకుపోతే బాగుంటుంది. ఏమైనా జరిగిన తరువాత మీరు బాధపడి ఉపయోగం వుండదు'' అన్నాడు డాక్టరు.

జిల్లాకేంద్రం అక్కడికి 140 కిలోమీటర్ల దూరంలో వుంది.

ప్రభుత్వ వైద్యశాలల్లో అవసరమైన పరికరాలు వుండవు. సరైన సౌకర్యాలు వుండవు. మందులు వుండవు. ఉన్నా, మంచి మందులు వుండవు. అవసరమైనంత సిబ్బంది వుండరు.

కాంపౌండరూ, నర్సూ అర్ధరాత్రి వరకూ వుండి, తమ డ్యూటీ టైం అయిపోయి కూడా చాలాసేపు అయిందని ఇంటికి వెళ్ళిపోయారు. అయినా డాక్టర్ ఒక్కడే అర్జునుడి బెడ్‌పక్కనే కూర్చుని ఆ రాత్రి అంతా నిద్రలేకుండా అవసరమైన వైద్యం చేస్తూనే వున్నాడు.

ఆక్సిజన్ పెట్టినా అతనికి వూపిరి తీసుకోవడం కష్టంగా వుంది.

★ ★ ★

అర్జునుడి పరిస్థితి విషమించిన తరువాత, అక్కడ వున్న కానిస్టేబుల్ రాజు నెమ్మదిగా బయటకు వచ్చి ఎస్.ఐ. కిషోర్ వాళ్ళ ఇంటికి వెళ్ళాడు.

నిద్రపోతున్న కిషోర్‌ని లేవగొట్టాడు.

"మనం ఆస్పత్రిలో చేర్పించిన గంగన్న పాలెపోడు చచ్చిపోయేట్లు వున్నాడు సార్! డాక్టర్ కేసు తనవల్ల కాదనీ, పెద్దాసుపత్రికి తీసుకుపొమ్మని చెప్పాడు సార్!"

"వాడికి అంత ప్రమాదం అయిందీ? ఎలా ఇప్పుడు? వాడు పొరపాటున చచ్చేడా మన కొంపలు మునుగుతాయి!"

"ఏం చేద్దాం సార్?"

"అదే ఆలోచిస్తున్నా... రామాపురం మర్డర్ కేసులో మనం డబ్బులు దొబ్బి, వాటా ఇవ్వలేదని డిఎస్పీగాడు మనమీద గొంతుదాకా కోపం పెంచుకుని వున్నాడు. రామాపురం వాళ్ళు మనకు ఇవ్వలేదని చెప్పినా మన మాట నమ్మలా... ఆ కోపం ఇప్పుడు తీర్చుకుంటాడు''

"ఎలా సార్?"

"నేను డ్రెస్ వేసుకుని స్టేషన్‌కు వస్తున్నా కానీ నువ్వు పద! కానిస్టేబుల్స్ అందర్నీ స్టేషన్ దగ్గరకి అర్జంట్‌గా తీసుకురా! తెల్లవారి నలుగురికీ విషయం తెల్సిందా మనం ఇరుక్కుపోయినట్లే!" అన్నాడు ఎస్.ఐ.

రాజు అప్పటికప్పుడే వెళ్ళి ఇతర పీసీల్నీ, రైటర్నీ పిలుచుకుని స్టేషన్ దగ్గరకు వచ్చాడు.

"లింగయ్యా... వాణ్ణి ఆ గాంధీబొమ్మ సెంటర్‌లోనే నాలుగు దెబ్బలు వేసి తరిమేస్తే పోయేదానికి, స్టేషన్‌కు ఈడ్చుకువస్తిరి. ఆ




దిక్కుమాలిన పందిలం... కొడుకు నాలుగు తన్నులకే చచ్చే పరిస్థితి దాపురించె! ఏంచేద్దాం ఇప్పుడు?"

"చెయ్యండి సార్, మీరే ఏదో..." అన్నాడు లింగయ్య నిర్లక్ష్యంగా.

"నేను ఒక్కడ్నీ చేసేది ఏం వుంటుంది? అందరం కలిసి ఆలోచించి ఏదో పరిష్కారం కనుక్కోవాలి. అసలు వాడ్ని ఇక్కడకు తీసుకురావడం ఎంత పొరపాటు!"

"మేం బుద్ధితక్కువై ఇక్కడకు తీసుకువచ్చాం. మీరు వాణ్ణి పంపించెయ్యొచ్చు కదాసార్. మీరు లాకప్‌లో వేయమంటేనే కదా మేం వేసింది. మీరు మమ్మల్ని బ్లేం చేయడానికి చూడకండి సార్!"

"బ్లేం చేసేది ఏముంది ఇందులో? అసలు మీరు స్టేషన్‌కు తీసుకురాకపోతే ఈ పరిస్థితి వచ్చేదా? ఇప్పుడు వాడు చస్తే ఎవర్ది రెస్పాన్స్ బిల్టీ? ముందు నా ఉద్యోగం వూడిపోద్ది. మీరు కూడా ఇంటికి పోవాల్సిందే అనుకో. వెనుకా ముందుగా! వీటన్నిటికీ మూలకారణం వాణ్ణి మీరు స్టేషన్‌కి తీసుకురాబట్టేకదా?"

"మీరు మమ్మల్ని ఎందుకు పంపించారు సార్ గాంధీబొమ్మ సెంటర్‌కి? ముందే చెప్పొచ్చుకదా వాడ్ని స్టేషన్‌కి తీసుకురావద్దని" లింగయ్య కోపంగా అన్నాడు.

"ఊరుకొండి సార్. ఇప్పుడు మనం ఒకర్ని ఒకరం అనుకుని అరుచుకుంటే ఏం లాభం? జరగాల్సినపని చూడాలి కానీ..." అన్నాడు హెడ్‌కానిస్టేబుల్.

తాగినప్పుడు మాత్రమే లింగయ్యకీ, ఎస్.ఐ.కీ సఖ్యత వుంటుంది. విడిసమయంలో ఇద్దరికీ ఒక్కక్షణం పడదు.

"లాభం లేదు సార్, బతకడు వాడు. మనిషికి గురకవచ్చింది. ఎగశ్వాసా, దిగశ్వాసామీద వున్నాడు''

"ఆ వూరినించి వచ్చినవాళ్ళలో తెల్సినవాళ్లు ఎవరైనా వున్నారా?"

"ఆ వూరి సర్పంచ్ నరసయ్య వచ్చాడు సార్. ఆయన ఎప్పుడూ మన స్టేషన్‌కి వచ్చిపోతుంటాడు''

"ఆయన వస్తే ఇంక కావాల్సిందేం వుంది? ఎలాగో రాజీచేసి పెడతాడు. అయితే అందరికీ డబ్బులు మాత్రం వదులుతాయి''

"అసలే నెలాక్రరోజులు! ఇప్పుడు ఎక్కడ చూడాలసార్ డబ్బు?"

"ఎక్కడోచోట చూసుకోక తప్పదు. నాకు పదేళ్ళ సర్వీస్. నా సర్వీసులో ఎప్పుడూ ఇలాంటి పరిస్థితి రాలేదు. లాకప్‌లో రోజూ మనం ఎంతోమందిని కొడుతుంటాం. అసలు మనం వీడ్ని ఎంతసేపు కొట్టాం? ఒక్కొక్కడ్ని అయితే ఇరవైరోజులూ, పాతికరోజులూ సరిగా తిండీ, నీళ్లూ కూడా ఇవ్వకుండా నెత్తురు కక్కిందాకా చితక్కొడతాం. అయినా ఎవడూ చావలేదు. వీడు అసలు రోగిష్టివాడి మాదిరిగా వున్నాడు. లేకపోతే మన దెబ్బలకు చావడం ఏమిటీ?" అన్నాడు కిషోర్.

"ఏదయినా ఇవ్వాళ మన పరిస్థితి బాగు లేదు సార్. వాళ్లు రాజీకి వస్తారని ఎలా చెపుతాం సార్? వాళ్ళ బాధలో వాళ్లు వుంటారాయె!"

"నయాన్నో, భయాన్నో వాళ్ళని రాజీకి వప్పించాలి. ఈ విషయం ఎవరికీ తెలియ కూడదు. ఎస్పీ కొత్త, ఆయనకి రూల్స్ తప్ప ఇంకేం తెలియవని అంటున్నారు. డిఎస్పీ మనం అంటే అగ్గిమీద గుగ్గిలం అయిపోతున్నాడు. మనం ఏదో లక్షల్లక్షలు తిన్నట్లు, వాడికి వాటా ఇవ్వలేదని ఏడుపు! ఈ విషయం బయటపడినా, మన ఉద్యోగానికి ముప్పు తప్పదు. ఉద్యోగాలు వూడిపోవడం గాకుండా కటకటాలు కూడా లెక్కపెట్టాల్సిరావచ్చు'' అన్నాడు కిషోర్.

"ఏదయినా ఈ డిపార్ట్‌మెంటే భాడ్కోవ్ డిపార్ట్‌మెంట్ సార్! లాకప్‌లో కొడితే ఒక తంటా, కొట్టకపోతే ఒక తంటా! పబ్లిక్‌లో

మనం అంటే అసలు రెస్పెక్టే లేదు. ప్రతి గాడిదకొడుకూ మనల్ని తిట్టేవాడే! ఇది బయటపడితే ఈ ఊళ్లో జనం కూడా వూరుకోరు. గొడవ చేస్తారు'' అన్నాడు ఒక పీసి.

"అసలు వాణ్ణి మనం పట్టుకోలేదూ, కొట్టలేదు అంటే సార్?"

"అనొచ్చు. మనం వాడ్ని తన్ని తీసుకురావడం, లాకప్‌లో వేయడం, హాస్పిటల్లో చేర్చడం చాలామంది చూశారు. ఎవడో ఒకడు చెబితే చాలదూ? ఏదయినా ముందే మేల్కోవడం మంచిది. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుని బాధపడితే ఏం లాభం? రాజూ... నువ్వు వెళ్లి నరసయ్యని పిలుచుకురా, విషయం ఏమిటో మాట్లాడుదాం"

రాజు వెళ్ళి, ఒక గంట తరువాత గంగన్న పాలెం సర్పంచ్ నరసయ్యని పిలుచుకువచ్చాడు.

"ఏం నరసయ్యా, ఎలా వుంది వాడికి? ఏమనుకుంటున్నారు వాడి తరపువాళ్లు?"

"వాడు బతకడు సార్. పోలీసోళ్లే కొట్టి చంపేశారని వాళ్లు ఏడుస్తా వుండారు సార్. తెల్లారి ఎం.ఎల్.ఏ.ని తీసుకునిపోయి, కలెక్టరుకి ఫిర్యాదు చేస్తారంట సార్!"

"అంతవరకూ వచ్చింది విషయం? వాడ్ని ఎవరు కొట్టేరు? తాగి పడిపోతే దెబ్బలు తగిలాయేమొ!"

"తాగి పడిపోతే వంటినిండా దెబ్బలు ఎందుకు వుంటాయి సార్? వాణ్ణి మీవాళ్లు సెంటర్ దగ్గర కొట్టి, రిక్షా ఎక్కించుకుని తీసుకుపోవడం చూసినవాళ్లు వున్నారు. వాడ్ని మీ స్టేషన్లో బెల్టుతోనూ, కర్రతోనూ కొట్టడం చూసినవాళ్ళు వున్నారు''

"చూసింది ఎవడూ, చెప్పు?"

"ఏమో, వాళ్ళు అనుకుంటున్నారు సార్ రేపు ఆ సాక్షుల్ని కూడా తీసుకుపోయి కలెక్టర్‌కి రిపోర్ట్ చేస్తారంట సార్. వాళ్ళు అంత తెలివితక్కువవాళ్లు కాదు, చాలా తెలివి మీరిపోయారు?"

నరసయ్య వున్నవీ, లేనివీ కల్పించి చెప్పిన మాటలకి పోలీసుల గుండెల్లో రాళ్లు పడ్డాయి. అందరికీ ఆ చల్లగాలిలో కూడా చెమటలు పట్టాయి.

"సరే, జరిగిందేదో జరిగిపోయింది నరసయ్యా! మా వాళ్లు తెలిసీ తెలియక ఏదో పొరపాటుపని చేశారు. మమ్మల్ని ఎలాగైనా ఈ గండంనించి నువ్వు గట్టెక్కించాలి. ఈ కేసు బయటపడితే మేం చాలా చిక్కుల్లో పడతాం"

"ఇప్పుడు నన్ను ఏం చేయమంటారు సార్?"

"వాళ్లు మీ వూరివాళ్లు. నిద్రలేస్తే మీ పనులకి వచ్చేవాళ్లు. వాళ్ళకి నువ్వు ఎంత చెబితే అంత! నీ మాటని వాళ్ళు జవదాటరు. వాళ్ళకి కొంత డబ్బు ఇద్దాం. ఎలాగోలా నచ్చచెప్పి రాజీ చెయ్యి నరసయ్యా!"

"సరే, నా ప్రయత్నం నేను చేస్తాను సార్! అయితే ఎంత ఇస్తారు వాడి కుటుంబానికి?"

"ఐదువేలో, ఆరువేలో ఇద్దాం నరసయ్యా!, విషయం మాత్రం మూడో కంటివాడికి తెలియకూడదు. నువ్వు మావాడివని చెపుతున్నాం, వాళ్ళు కాదూ, కూడదంటే ఇంకో నాలుగువేలు ఇద్దాం. ముందు ఆరుకి మాట్లాడు''

అలా అర్జునుడి ప్రాణానికి వెల నిర్ణయించారు వాళ్లు.

"సరే'' అని నరసయ్య హాస్పిటల్ దగ్గరకు వచ్చాడు.

★ ★ ★

నరసయ్య పోలీస్‌స్టేషన్‌నించి వచ్చేసరికి హాస్పిటల్ దగ్గర పరిస్థితి ఘోరంగా వుంది. ఆడవాళ్ళూ, పిల్లలూ అందరూ లబోదిబోమని నెత్తీనోరూ కొట్టుకుంటూ విలపిస్తున్నారు.






రోగికి కావాల్సిన మందులు అక్కడ లేకపోతే బజారులోని షాపులనించి తెప్పించి వాడాడు ఆ డాక్టరు. ఎంతగా కృషి చేసినా ప్రయోజనం లేకపోయింది.

తెల్లవారుజామున ఐదుగంటల ప్రాంతంలో అర్జునుడి ప్రాణాలు ఈ లోకాన్ని వదిలిపెట్టిపోయాయి.

94 వరకూ గడిచిన దశాబ్దకాలంలో కృష్ణా, గోదావరీ, తుంగభద్ర నదులు ప్రవహిస్తున్న సౌభాగ్యవంతమైన ఆంధ్రప్రదేశ్‌లో లాకప్పుల్లో కనీసం 224 మందిని పోలీసులు ఇలాగే పొట్టన పెట్టుకున్నారట!

ఈ 224 హత్యలూ పత్రికలూ, హక్కుల సంఘాల ద్వారా ప్రపంచం దృష్టికి వచ్చినవే! ఇక వీళ్ళ దృష్టికి రాకుండా ఇంకెన్ని హత్యలు జరిగివుంటాయో!

వీళ్ళలో ఓ 30 మంది అయితే ఎలాంటి నేరం చేయకుండానే ఈ దేశంలోనో, ఈ రాష్ట్రంలోనో పుట్టిన పాపానికి పోలీసులు అవలంబించే చిత్రహింసల పద్ధతులకు మృత్యువాత పడ్డారు. ఈ 30 మందీ కనీసం ఒక నిముషం జైలుశిక్ష పడేటంత తప్పు కూడా చేసినవాళ్ళు కాదు.

160 మంది లాకప్ మృతులు చిన్న చిన్న నేరాలుచేసిన వాళ్లు. సైకిల్ దొంగతనం చేసో, జేబు కత్తిరించో, చిన్న చిన్న పోట్లాటలూ, తగాదాల కారణంగానో పోలీసు లాకప్పులో అడుగుపెట్టి ఈ భూప్రపంచాన్ని శాశ్వితంగా వదిలిపెట్టిపోయినవాళ్లు!

వీళ్ళు చేశన దొంగతనం సొమ్ము విలువ ఒక పోలీస్ అధికారో, సివిల్ అధికారో, ఒక ఎం.ఎల్.ఏనో, ఒక మినిస్టరో ఒకరోజు అక్రమంగా సంపాయించిన సొమ్ము అంత కూడా వుండదు. అయినా ప్రాణాలు పోగొట్టుకున్నారు.

మిగతా 30 మంది లాకప్‌మృతులు హత్య, మానభంగం, డెకాయిటీ లాంటి

తీవ్రమైన నేరాలు చేసిన ముద్దాయిలు! ఈ ముద్దాయిల్ని విచారించడానికీ, శిక్షించడానికీ చట్టాలు వున్నాయి, కోర్టులు వున్నాయి! అయినా పోలీసులు తామే న్యాయాధికారులై ఈ 30 మందినీ కాటికి పంపించారు.

పోలీస్ లాకప్పుల్లో అసువులు బాసిన ఈ 224 మంది నిర్భాగ్యులూ నిరుపేదలే! వీళ్ళలో 95 శాతం మంది, అంటే దాదాపు 212 మంది వెనుకబడిన కులాలూ, బలహీనవర్గాలకు చెందిన ప్రజానీకమే!

అర్జునుడి ప్రాణాలు పోవడంతో అతని ఆప్తులూ అందరూ ఘొల్లుమన్నారు. ఆస్పత్రి ఆవరణ అంతా ఏడుపులూ పెడబొబ్బలతో నిండిపోయింది.

"జరిగిందేదో జరిగిపోయింది. మన అర్జునుడికి ఇంతవరకే రాసిపెట్టి వుంది. ఏడవకండ్రా... ఏడిస్తే పోయినవాడు వస్తాడా?" అని సర్పంచ్ నరసయ్య అర్జునుడి కొడుకుల్నీ, అన్నదమ్ముల్నీ సముదాయించడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఒకవైపు వాళ్ళని సముదాయిస్తూనే, అర్జునుడి అన్నదమ్ములతో రాజీ విషయం ప్రస్తావించాడు నరసయ్య. "పోలీసులదే తప్పు అని ఒప్పుకుంటున్నార్రా! 6 వేలు ఇస్తామంటున్నారు, ఏం చేస్తాం... ఆ డబ్బు తీసుకునిపోదాం... ఏడవకండి''

నరసయ్య భార్య చెవిలో ఆ మాట పడింది. "ఆరువేలు కాదు నరసయ్య అన్నా... ఆరు లక్షలు ఇచ్చినా నా మొగుడు నాకు వస్తాడా? నా పసుపు కుంకుమలు నిలుస్తయ్యా? నా మొగుడే పోయిన తరవాత నాకు డబ్బు ఎందుకు నరసయ్య అన్నా..." అని అర్జునుడి భార్య భోరుమని విలపించింది.

"ఊరుకోవే... బిడ్డలు నలుగురు వున్నారు. ఇద్దరికి ఇంకా పెళ్ళిళ్ళు చేయాలి. డబ్బు ఏం చేసుకుంటానంటావేమే ఎర్రిముకమా? ఆరువేలు కాదు కానీ, ఇంకా వెయ్యో, రెండు వేలో కలిపి ఇప్పిస్తా!" అన్నాడు నరసయ్య?

నరసయ్య మళ్ళీ పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాడు.

"అర్జునుడు పోయాడండీ... వాడి పెళ్ళాం బిడ్డల బాధ చెపితే తీరదు. వాడి అన్నదమ్ములతో రాజీపడటానికి పదివేలు ఇస్తాం అన్నా ససేమిరా కాదంటున్నారు. రాజీపడేపనే లేదన్నారు. నేనే వాళ్లని తన్నబోయి, ఎలాగో నచ్చచెప్పి రాజీకి వప్పించా! రాజీకి వాళ్లని వప్పించేసరికి నా తల ప్రాణం తోకకివచ్చింది''

"ఇంతకీ వాళ్ళు ఎంత కావాలంటున్నారు?"

"వాళ్ళు చాలా అడుగుతున్నారు. వాళ్ళు ఎంత కావాలన్నా వాళ్ళ కోర్కెని మనం తీర్చలేములెండి! మీరు 12 వేలు ఇవ్వండి, నేను వాళ్ళకి నచ్చచెపుతా!" అన్నాడు నరసయ్య.

పోలీసులూ, ఎస్ఐ కిషోరూ తర్జన భర్జనలుపడి, చివరికి 12 వేలు ఇవ్వడానికి అంగీకరించారు.

"నెలాకర్రోజులు! మా దగ్గిర ఎక్కడ వుంటయ్యి సార్? మీరు ఎక్కడైనా అప్పు తీసుకురండి. తరువాత అందరం కలిసి ఆ అప్పు తీరుద్దాం" అన్నారు కానిస్టేబుళ్లు.

ఎస్.ఐ. కిషోర్ మోటారుసైకిల్ వేసుకుని తెలిసిన షావుకార్ల వద్దకు వెళ్ళి 12 వేలు చేబదులు తీసుకువచ్చి నరసయ్యకు ఇచ్చి అన్నాడు.

"అర్జునుడు పోలీసుల దెబ్బలకి చచ్చిపోయినట్లు మూడోకంటి వాడికి తెలియకూడదు. మీ వూరు తీసుకుపోయిన వెంటనే దహనం చేయండి. నిజానికి అర్జునుడు ఎందుకు చచ్చిపోయాడో, అది మా మెడకి చుట్టుకుంది. రచ్చకి ఎక్కితే మా ఉద్యోగాలకి ప్రమాదం వస్తుంది. గుట్టుగా పనిపూర్తి చేయించు... బాధ్యత అంతా నీదే నరస




య్యా... ముందు ముందు నీకూ మాకూ అవసరాలు వుంటాయ్!" అన్నాడు కిషోర్.

నరసయ్య అన్నిటికీ తలవూపి, ఆ డబ్బు తీసుకుపోయాడు.

అర్జునుడి అన్నదమ్ములతోనూ, భార్యాబిడ్డలతోనూ మాట్లాడి, పెద్దమనిషితనం వహించి, చివరికి శవాన్ని వాళ్ళ వూరు తీసుకుపోవడానికి వాళ్ళని సంసిద్ధం చేశాడు.

పోలీసుల దగ్గర తీసుకున్న డబ్బుల్లో అర్జునుడి కుటుంబానికి 8 వేలు ఇచ్చి, మిగిలిన 4 వేలూ తన జేబులో వేసుకున్నాడు నరసయ్య.

అప్పుగా తీసుకువచ్చిన ఆ డబ్బులో ఎస్.ఐ. కిషోర్ ఒక్కడూ 6 వేలూ, మిగిలిన 6 వేలు పోలీసులూ తీర్చడానికి అంగీకారం కుదిరిపోయింది.

★ ★ ★

ఉదయం ఏడు గంటలవుతోంది.

ఎస్.ఐ కిషోర్ రాత్రి అలసటమీద ఆదమరచి నిద్రపోతున్నాడు.

పక్క పోర్షన్ ఎం.డి.వో హడావుడిగా వచ్చి కిషోర్‌ని నిద్రలేపాడు. "లెండి సార్...పక్కన కొంపలు అంటుకుపోతుంటే ఇంకా గుర్రుపెడుతూ నిద్రపోతున్నారు''

"ఏమైంది సార్... ఏంటీ హడావుడి'' వళ్లు విరుచుకుంటూ అడిగాడు మంచం మీదనించే కిషోర్.

"ఇది చూడండి సార్..." అని ఆనాటి దినపత్రిక మొదటి పేజీలోని వార్తని వేలుపెట్టి చూపించాడు ఎం.డి.వో.

ఆ దినపత్రిక మొదటిపేజీలో ప్రచురితమైన వార్తని చూసి వులిక్కిపడ్డాడు కిషోర్. నిద్రమత్తూ గిత్తూ దెబ్బకి వదిలిపోయింది. ఆ వార్తని చూడటంతోనే మనిషి బెంబేలు పడిపోయాడు. నిమిషంవరకూ నోట మాటరాలేదు. షాక్ తిన్నట్లు అయిపోయాడు.

"తాగిన పాపానికి అర్జునుడి ప్రాణాలు హరీ! "

"ఫణిగిరిలో మరో లాకప్ డెత్'

అనే శీర్షికలతో ఫణిగిరి డేట్‌లైన్‌తో ఆ వార్తవుంది.

మరణించిన అర్జునుడి కలర్‌ఫొటో కూడా వేశారు.

వార్త వివరంగా, స్పష్టంగా వుంది.

అర్జునుడు తాగి గాంధీబొమ్మ దగ్గర పిల్లలకు బిస్కట్లు పంచిపెట్టడం, నినాదాలు ఇవ్వడం, పోలీసులు అతనిని అకారణంగా కొడితే అతను తిరగబడి పోలీసుని చెంపదెబ్బ వేయడం, ఆ కసితో అర్జునుణ్ణి లాకప్‌లో చిత్రహింసలు పెట్టడం, అతను స్పృహ తప్పిపోవడం, పోలీసులే ఆస్పత్రిలో చేర్చడం, దెబ్బల ధాటికి అతను మృతి చెందడం, నరసయ్య రాజీ చేయడం, రాజీకోసం డబ్బు ఇవ్వడం- అన్నీ చూసినట్లే రాశారు.

పోలీసులే కొట్టి చంపేశారని అతని భార్య తెలిపిందని కూడా రాశారు.

రాసినవాడి తెలివితేటలకు కిషోర్ ఆశ్చర్యపోయాడు. వాడికి ఈ విషయాలు ఎలా తెలిశాయి? అన్నీ పూసగుచ్చినట్లు రాశాడు.

ఆ పత్రిక పేరు విజయం. అయితే రాసింది దాని విలేకరి కళాధర్‌గాడేనన్నమాట! ఎంతపని చేశాడు!

తమ పోలీసులకీ, గంగన్నపాలెం హరిజనులకీ తప్ప మూడో కంటివాడికి కూడా తెలియకూడదనుకున్న విషయాన్ని పబ్లిక్ చేశాడు. నలుగురికీ తెలియపరిచాడు!

ఏం చేయాలి ఇప్పుడు?

ముందు పైఅధికార్లకి సంజాయిషీ చెప్పుకోవాలి. ఇప్పటికే అధికార్లు తను అంటే మండిపోతున్నారు. రెండు మూడు కేసుల్లో తన పద్ధతి కారణంగా తనని దెబ్బతీయడానికి కాచుకునివున్నారు.

కొద్దిగా తక్కువ కులంవాడని కూడా

తను అంటే చిన్నచూపు! అదే పెద్దకులంవా డూ, అధికార్లూ, రాజకీయనాయకుల అండా, పలుకుబడీ వున్నవాడు ఎన్ని లాకప్‌డెత్‌లు చేసినా సమస్య వుండదు. కొన్నిటికి కేసులు లేకుండానే వుంటాయి, కొన్నిటికి కేసులు వున్నా అవి సునాయాసంగా ఎగిరిపోతాయి.

తనదే సమస్య! అన్నిటికీ గ్రూపులూ, ముఠారాజకీయాలూ! ఛీ, డిపార్ట్‌మెంటే కంపు పట్టిపోయింది.

డబ్బు దగ్గరే... లంచాలు తీసుకోవడం, వాటిని పంచుకోవడం విషయంలోనే పేచీ లూ, రగడలూ, గొడవలూ! ఇవే ముదిరి ముదిరి గ్రూపులుగా విడిపోవడం, ఒకర్ని ఒకరు దెబ్బతీయడానికి కాచుకోవడం!

అవకాశం చిక్కింది కాబట్టి తనని దెబ్బ తీయడం ఖాయం!

ఫణిగిరి జనంతో కూడా సమస్య కావ చ్చు! ఈ జనం కూడా అంత తేలిగ్గా వూరుకోరు. ఈ దిక్కుమాలిన వూళ్ళో ప్రతిప క్షానికి చెందిన పార్టీ కాస్త ఎక్కువ. ఒకసారి ఒక మీటింగ్ సందర్భంలో జనాన్ని తను లాఠీలతో చితక్కొట్టించాడు. తను అధికార పార్టీవైపు వుంటున్నానని ద్వేషం పెంచుకుని వున్నారు.

ఈ సమయంలో వాళ్ళు కూడా ఏదైనా గొడవ చేసినా చేయొచ్చు.

వీటన్నిటికీ మూలకారణం వాడు, ఆ కళాధర్‌గాడే! బుద్ధిలేని పీనుగు!

వాడికి ఇంతకుముందు తను ఇచ్చిన వార్నింగ్ మరచిపోయాడా? గుర్తువున్నా తను అంటే లక్ష్యం లేదా? ఏంచేయాలి వాణ్ణి?

ఇంతకుముందు కూడా ఇలాగే తమ పోలీస్‌స్టేషన్‌కు సంబంధించి ఏవో అవాకు లూ చవాకులూ రాశాడు. చేతిలో కలం వుందికదాని నోటికొచ్చినట్లు రాయడమేనా? ఎవరైనా ఏమైనా చెబితే వెనకాముందూ చూడకుండా రాస్తే ఎలా? ఆ విషయం రాయొచ్చా, రాయకూడదా, పబ్లిక్‌లోనికి తీసుకుపోవచ్చా, తీసుకుపోకూడదా అని ఆలోచించాల్సిన పనిలేదా?

ఆ వార్త రాసినప్పుడు తను పిలిపించి హెచ్చరించాడు. ఇంకెప్పుడూ ఇలాంటి వార్త లు రాయొద్దని గట్టిగా చెప్పాడు. పోలీసులు చెప్పే క్రైం న్యూస్ రాయమన్నాడు. ఒకవేళ పోలీస్‌స్టేషన్‌కు సంబంధించి ఏమైనా రాయ దలుచుకుంటే ముందు తమకు చూపెట్టి, తమతో సంప్రదించి మాత్రమే రాయమన్నా డు.

అలాంటిది కనీసం మాట మాత్రం కూడా లేకుండా తాము వూహించనివిధంగా కలం తమమీద గురిపెట్టాడు. తమకి అలవాటులో పొరపాటు జరిగింది. అది గోటితో పోయింద నుకుంటే గొడ్డలివరకూ తీసుకొచ్చాడు. గొంతుమీదకు గొడ్డలి తీసుకొచ్చి ఎక్కుపెట్టా డు.

ఆలోచనలతో కిషోర్ బుర్ర వేడెక్కిపో యింది. మనసంతా అశాంతిగా, చీకాకుతో నిండిపోయింది. మంచంమీదనించి లేవబు ద్ధి కాలేదు. ఆ పది నిముషాల్లోనే ఐదు సిగరెట్లు తగలేశాడు.

చిన్నగా లేచి బాత్‌రూంకి వెళ్ళాడు.

వనజ హాల్లో మంచం వేసుకుని దుప్పటి ముసుగుపెట్టి పడుకొని వుంది. పిల్లలు ఇంకా నిద్ర లేవలేదు. ఈరోజు పబ్లిక్‌హాలీడే. స్కూలుకి సెలవు అనుకున్నాడు.

పనిమనిషి గిన్నెలు కడిగి, ఇల్లు వూడ్చింది.

"లేచి కాఫీ అయినా ఇచ్చేది వుందా, లేదా?" బాత్‌రూంలోనించి వచ్చిన కిషోర్ భార్యని అడిగాడు.

"నాకు బాగులేదు. బజారులో తాగి పొండి'' అంది వనజ ముసుగు తీయకుండా నే.

"బాగు లేకపోవడానికి ఏం మాయరోగం




వచ్చింది?" అన్నాడు కిషోర్ డ్రెస్ చేసుకుంటూ.

అప్పుడే స్టేషన్‌నించి పీ.సి వచ్చాడు. "డిఎస్పీనించి మెసేజ్ వచ్చింది సార్. అర్జంట్‌గా మిమ్మల్ని స్టేషన్‌కు రమ్మన్నారు. వాడు చచ్చిన విషయం వాళ్ళకి తెల్సింది సార్'

"వాళ్ళకి తెలియడం ఏముందీ, లోకమంతా తెలిస్తే... పేపర్‌లో మనం చంపేశామని రాశారు''

"అందుకేనేమో సార్... హెూటల్ దగ్గిర కొంతమంది కుర్రవాళ్లు పేపరు చదువుకుంటూ, నేను వస్తూవుంటే నావైపు మిర్రి మిర్రి చూస్తున్నారు! ఆ పేపర్ వాళ్ళకి ఎలా తెల్సింది సార్?"

"ఆ పేపర్ విలేకరి కళాధర్‌గాడు లేడూ? కళ్లజోడు పెట్టుకుని తిరుగుతుంటాడు. వాడు పంపించాడు వార్త వాళ్లు వేశారు. డిఎస్పీ ఏమంటున్నాడేమిటి?"

"మిమ్మల్ని స్టేషన్ దగ్గరికి అర్జంట్‌గా రమ్మని వైర్‌లెస్‌లో చెప్పారు సార్. నేను ఇంటిదాకా వెళ్ళొస్తాను సార్'

"నువ్వు తొందరగా రా. ఏం కొంప మునుగుతుందో, ఏమో!" అని కిషోర్ మోటారుసైకిల్ వేసుకుని స్టేషన్ దగ్గరికి వెళ్ళాడు.

★ ★ ★

గంగన్నపాలెం చాలా చిన్న పల్లెటూరు.

అయినా ఆ వూళ్ళో రెండు ముఠాలు వున్నాయి. ఒక ముఠాకి నరసయ్య నాయకుడు. అర్జునుడు వాళ్ళు అందరూ నరసయ్య ముఠాలోనే వుంటారు.

అర్జునుణ్ణి పోలీసులు కొట్టి చంపివేయడం గంగన్నపాలెంలో అందరికీ తెలిసింది. నరసయ్య రాజీచేసి డబ్బులు ఇప్పించాడని కూడా ప్రత్యర్థి ముఠావాళ్ళు తెలుసుకున్నారు.

పంచాయితీకి వచ్చే రోజ్‌గార్ ఫండ్స్ పైసాపని చేయించకుండా అన్నీ సుబ్బరంగా దిగమింగడం నరసయ్యకు అలవాటు. ఊళ్ళో ఎవరైనా ఏదైనా పనిచేసి పెట్టమని అడిగితే ముందు తనకు ఇచ్చే విషయం చెప్పమంటాడు. అలాంటి నరసయ్య రాజీ చేశాడంటే ఎంతో కొంత మింగివుంటాడని ప్రత్యర్థివర్గం భావించింది.

ఎప్పటికప్పుడు వైరివర్గాన్ని దెబ్బ తీయాలని కాచుకుని వుండే వర్గం నరసయ్యని చిన్న దెబ్బ అయినా కొట్టడానికి అవకాశం చిక్కిందని భావించింది. అయితే ఎటునించి నరుక్కుపోవాలో వాళ్ళకి అర్థం కాలేదు.

ఆ ముఠాలోనివాళ్లు రోజుమాదిరిగానే కొందరు ఫణిగిరి వచ్చారు. అక్కడ దినపత్రిక విలేకరి కళాధర్ తటస్థపడ్డాడు.

ఆ మండలంలోని అన్ని రాజకీయ పార్టీల చోటామోటా నాయకులకీ, కార్యకర్తలకీ కళాధర్ పరిచయమే. వచ్చినవాళ్లు విషయాన్ని కళాధర్ చెవిలో వేశారు.

ఈ విషయం బయటకు పొక్కకుండా సర్పంచ్ నరసయ్య రాజీ చేశాడని కూడా వాళ్లు చెప్పారు.

చేసేపనిమీద శ్రద్ధ, బాధ్యత, నిబద్ధత కలిగిన జర్నలిస్ట్ కళాధర్.

అప్పటికప్పుడే గంగన్నపాలెం వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఫొటోగ్రాఫర్ని తీసుకుని, మోపెడ్‌మీద ఇద్దరూ గంగన్నపాలెం వెళ్ళారు.

ఆ వూళ్ళో కళాధర్‌తో చదువుకున్నవాళ్లు వున్నారు. సర్పంచ్ నరసయ్య కూడా కళాధర్‌కి పరిచయమే! నరసయ్యని కూడా కలిస్తే బాగుంటుందనే ఉద్దేశంతో కళాధర్ వాళ్లు ఊరి మొదట్లోనే వున్న ఆయన ఇంటికి మొదట దారితీశారు.

అప్పుడే నరసయ్య మాదిగపల్లెలోనించి వచ్చి కాళ్లు కడుక్కుంటున్నాడు. కళాధర్‌ని చూసి పలకరించాడు.

"ఏమోయ్ విలేకరీ... బాగున్నావా? ఏమిటీ మా వూరు పనిమీద వచ్చావు.

రాకూర్చో..." అంటూ కుర్చీలు చూపెట్టాడు.

"మీవూరు రాకూడదా ఏమిటి?" నవ్వుతూ అన్నాడు కళాధర్ కుర్చీలో కూర్చుని.

"ఎందుకు రాకూడదులే... రావద్దని ఎందుకు అంటాను? మంచినీళ్లు తాగుతారా?" అని అడిగి, ఇంట్లో వున్న భార్యని కేకేసి వాళ్ళకి మంచినీళ్లు ఇప్పించాడు.

"ఏమిటండీ విశేషాలూ... ఇంతకుముందు ఎక్కువగా ఫణిగిరి వచ్చేవాళ్లు, ఈమధ్య బొత్తిగా రావడంలేదు'' అడిగాడు కళాధర్.

"ఎందుకు రావడం లేదు? మండలం ఆఫీసులో పనికో, ఏదో ఒకపనికి రోజుమార్చి రోజు అయినా వస్తానే వుంటా! నువ్వే ఈమధ్య కనబడటంలేదు''

"ఎప్పుడూ నేను ఆ గెస్ట్‌హౌసూ, ఆ ప్రాంతంలోనే వుంటుంటాను. అవునూ, ఆమధ్య మీరు చెప్పిన వార్త వచ్చింది చూశారా మా పేపర్‌లో..."

"ఏ వార్త అదీ?"

"ఫణిగిరీ, మీ వూరు మట్టిరోడ్డుతో ప్రయాణీకులు ఇబ్బంది పడుతున్నారని రాశాను. బస్సులు దిగబడుతున్నాయనీ, వానాకాలంలో బస్‌సర్వీసులు రద్దు చేస్తుండటంతో ప్రయాణీకులు అవస్థలు పడుతున్న విషయం రాశాను. ఈ రోడ్డుని తారురోడ్డుగా మార్చాలని సర్పంచ్ కోరుతున్నాడని కూడా రాశాను'' ఒకవైపు కళాధర్ ఆయనతో మాట్లాడుతూనే అర్జునుడి విషయం ఎలా కదిలించాలా అని ఆలోచిస్తున్నాడు.

"ఓ... అదా... బాగా రాశావోయ్... నా పేరు కూడా వచ్చిందిగా అందులో! అయినా గవర్నమెంటునించి ఏం జవాబు లేదనుకో! ఎం.ఎల్.ఏ.తో కూడా మొన్న చెప్పా! ఈసారి గట్టిగా అధికారులతో మాట్లాడతానన్నాడు''

"వచ్చే ఎన్నికల్లో మన ఎం.ఎల్.ఏ.కి పార్టీ టిక్కెట్టు ఇవ్వరని అంటున్నారు గదా సార్! ఈయనకి జనంలో మంచి పేరు లేదు, ఈ ఫైవ్ ఇయర్స్ పీరియడ్‌లోనే కోటి రూపాయలు సంపాదించాడని ఈయన అవినీతి మీద ఇంటలిజెన్స్ రిపోర్ట్ పైకి పోయిందని అంటున్నారు''

"డబ్బు తినకుండా ఎవురు వుంటున్నారయ్యా ఈ రోజుల్లో! రాజకీయం అంటేనే ఇవ్వాళ డబ్బు సంపాయించడం అయిపోయింది. కిందనించి పైవరకూ అందరూ తినేవాళ్ళేనాయె!"

"సరేకానీ, అర్జునాయ్‌ని పారేశారా, ఇంకా వుంచారా?" వాకిట్లో నిలబడి, వాళ్ళ సంభాషణ వింటున్న నరసయ్య భార్య అడిగింది.

"ఇంకా పారెయ్యలేదే. వాళ్ళ తమ్ముడు కూలిపనులకి వుత్తరాది పోయాడంట. వాడి కోసం మనిషిని పంపించారు. ఈ పాటికి రావాలి''

"అర్జునుడు అంటే ఎవురు సార్?" తన ప్రమేయం లేకుండానే ఆ విషయం ప్రస్తావనకు వచ్చినందుకు కళాధర్ సంతోషించాడు. ఇక కూపీ లాగవచ్చనుకున్నాడు.

"అతను మా పంచాయితీవార్డు మెంబరోయ్. పొద్దున చచ్చిపోయాడు''

"ఎవరూ... పంచాయితీ మెంబరు అర్జునుడా... ఆయన నాకు కూడా తెలుసు సార్. నాకు బాగా పరిచయం. పాపం, ఆయన ఎందుకు పోయినట్లు?"

"జబ్బూ, పాడూ ఏంలేదు! పాపం గుండె ఆగి చచ్చిపోయాడు'' అబద్ధం చెప్పాడు నరసయ్య. నిజం చెబితే పేపర్‌వాళ్ళతో చిక్కు వస్తుందని భావించాడు. పేపర్‌లో వస్తే ఇబ్బందులు పడాల్సివుంటుందని, సమస్యనించి తప్పించుకోవడానికి అబద్ధం చెప్పాడు.

అర్జునుడు చచ్చిపోయిన సమయంలోనే వాళ్లు రావడం, వాళ్లముందే భార్య ఆ విషయం ప్రస్తావించడంతో నరసయ్యాకు చిరాకు కలిగింది.








ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

మార్చి చతుర నవల 'లాకప్'

సమీక్షకుని పేరు: ..........................................................

చిరునామా: ..........................................................

..........................................................

..........................................................

..........................................................

అర్జునుడి లాకప్ మృతిని నరసయ్య రహస్యంగా వుంచదలుచుకున్నట్లు కళాధర్‌కి స్పష్టంగా అర్థమయిపోయింది.

"సరే, వెళ్ళి చూసివద్దాం. మీరు కూడా రండి, కలిసి వెళదాం"

"ఆ మాదిగపల్లెలోనికి ఏం వెళ్తాం? వాడు మంచోడే. అయినా పోయినవాళ్లు రారుకదా? మనం చూసి ఏం చేయగలం?" అన్నాడు నరసయ్య తప్పించుకోవడానికి.

"సరే, మేం చూసి వెళ్ళిపోతాం. మీరు కూడా వస్తే బాగుంటుంది'' అని లేచాడు కళాధర్.

వాళ్లు వెళ్లడానికి నిశ్చయించుకోవడంతో నరసయ్య తొట్రుపడ్డాడు.

అక్కడికి వీళ్లు తను లేకుండా వెళ్తే అన్ని విషయాలూ బయటపడతాయి. డబ్బు విషయం కూడా వెల్లడికావచ్చు. పోలీసులు 8 వేలు ఇచ్చారని ఎవరైనా మాటమాత్రం అనొచ్చు. ఇతను పోయి పోలీసులతో మాటల సందర్భంలో ఆ మాట అంటే తన బండారం బయటపడిపోతుంది.

నిత్యం పోలీసులతో తనకి అనేక అవసరాలు వుంటాయి. వాళ్ళ దగ్గిరే తను డబ్బు మింగినట్లు వాళ్లకి తెలిస్తే తనని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాపిస్తారు.

వీళ్ళతోపాటు తను వెళ్తే అక్కడ డబ్బు విషయం వచ్చినా ఎలాగో దాటవేయవచ్చు అనుకుని నరసయ్య మళ్ళీ పల్లెలోకి వెళ్ళాడు వాళ్లని వెంటబెట్టుకుని.

వీళ్ళు వెళ్లేసరికి అర్జునుడి భార్యాపిల్లలూ అందరూ శవంమీద పడి విలపిస్తున్నారు. పోలీసుల్ని శాపనార్థాలు పెడుతున్నారు.

వచ్చిన వాళ్లని చూసి ఏడుపులూ, తిట్లూ ఉధృతం చేశారు.

"ఏం జరిగిందండీ... పోలీసుల్ని ఎందుకు తిడుతున్నారు?" అడిగాడు కళాధర్, తెలియనట్లు.

నరసయ్యకి విషయం చెప్పక తప్పింది కాదు.

"మరి గుండెఆగి చచ్చిపోయాడన్నారు మీరు...?"

"పోలీసులు ఒక దెబ్బ కొట్టినా వీడు చచ్చిపోయింది మాత్రం గుండె ఆగిపోయే! గుండె ఆగిపోవడం ఎంతసేపు పడుతుందీ?" అన్నాడు నరసయ్య తనని తను సమర్థించుకుంటూ.

"ఇతను మా ఫొటోగ్రాఫర్. ఫొటోలు తీసుకుంటే మీకేమైనా అభ్యంతరమా?" కళాధర్ అడిగాడు అర్జునుడి అన్నని.

"ఎందుకు మీకు ఫొటోలు?" నరసయ్య ఆందోళనగా అడిగాడు.

"ఊరికే! చచ్చిపోయిన మనిషి మళ్ళీ రాడుకదా? ఫొటో అయినా వుంటుందనీ..."

"ఫొటోలు వద్దూ, పాడూ వద్దూ! మళ్ళీ అదొక ఖర్చు ఎందుకు? అసలే వాళ్ళు ఇబ్బందుల్లో వుంటే..."

"డబ్బు అవసరం లేదండీ, వూరికే తీస్తాం. మీకు కూడా రెండు ఫొటోలు ఇస్తాం!' అన్నాడు కళాధర్ అక్కడ చేరిన అర్జునుడి బంధువులూ, అన్నదమ్ములతో.

అర్జునుడికి అంతకుముందు ఫొటో లేదు. ఇక మనిషి రాడు. ఫొటో వూరికే తీస్తామంటున్నారు. ఫొటో వుంటే దండగేముంటుంది? కలకాలం వుంటుంది.

"తీయండి ఫొటోలు'' అన్నారు అందరూ.

"కాదురా, ఫొటోలు తీసుకుంటే చాలా బాధలు పడ్తార్రా! పోలీస్‌వాళ్ళతో కూడుకున్న విషయం. వీళ్లు పైపెచ్చు పేపర్‌వాళ్లు'' అన్నాడు నరసయ్య.

"అయితే ఏమిటీ? తియ్యండి సార్ మీరు ఫొటోలు. పోలీసువాళ్ళు ఫొటోలు తీసుకుంటే ఏం తలతీసి మొలేస్తారా, చంపుతారా? ఎంతమందిని చంపుతారు? కాని

వ్వండి మీరు'' అని అందరూ ఫొటోగ్రాఫర్ని చుట్టుముట్టారు.

నరసయ్య ఎంత వారించాలని ప్రయత్నించినా సాధ్యం కాలేదు. అందరూ కాకులు పొడిచినట్లు నరసయ్యని ప్రశ్నలతో ముంచెత్తారు.

అదే అదునుగా భావించి ఫొటోగ్రాఫర్ టకటకా ఐదారు ఫొటోలు తీసుకున్నాడు.

"ఫొటోలు రెండు రోజుల్లో మీకు పంపిస్తాం" అని కళాధర్ వాళ్ళకి చెప్పాడు.

"వస్తాం సార్. వార్తలు ఏమైనా వుంటే చెప్పండి. పేపర్లో వేస్తాం" కళాధర్ అన్నాడు బయలుదేరుతూ నరసయ్యతో.

"వార్తలు ఏమున్నాయి లేవోయ్. ఈ విషయం మాత్రం మీరు పేపరుకి పంపించకండి. పోలీస్‌వాళ్ళతోటి అనవసరపు గొడవలు. అసలు నిజానికి వీడు చచ్చిపోయింది గుండె ఆగిపోయే'' అన్నాడు నరసయ్య.

"అవునులెండి. గుండె ఆగిపోయే వుంటుంది. గుండెపని చేస్తూవుంటే మనిషి ఎలా చచ్చిపోతాడు?" అన్నాడు కళాధర్ నవ్వి.

"డబ్బులు కాజెయ్యడానికి మాదిగవాళ్లు ఏవో అంటారండీ. అవి అన్నీ నిజం అని నమ్మకండి. మీరు పొరపాటుగా కూడా పేపరుకి ఈ విషయం పంపించకండి. నేను మీ మంచికోరి చెపుతున్నా'' అన్నాడు నరసయ్య మళ్ళీ, హెచ్చరిక ధ్వనింపచేస్తూ.

కళాధర్ ఏం జవాబు చెప్పకుండానే మౌనంగా నవ్వాడు. మోపెడ్ వేసుకుని ఇద్దరూ ఫణిగిరి వచ్చారు.

★ ★ ★

రోజూ ఉత్సాహంగా, మోటారుసైకిల్ స్టాండువేసి ఎగిరినట్లే స్టేషన్‌లోనికి వచ్చే ఎస్‌ఐ కిషోర్ ఆ రోజు బితుకుబితుకుమంటూనే లోనికి అడుగుపెట్టాడు. గేట్ దగ్గర సెంట్రీ అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు. కిషోర్ అతనిని చూడకుండానే కొద్దిగా తల ఆడించి లోపలికి వెళ్ళాడు.

"డిఎస్పీ ఏమంటున్నాడు? ఏమైనా అడిగాడా?" లోపలికి వెళ్ళిన వెంటనే సెల్యూట్ చేసిన రైటర్ని అడిగాడు కిషోర్.

"డిఎస్పీ బయల్దేరి వస్తున్నాడంట సార్. ఎస్పీసారు డిఎస్పీని వెళ్ళి ఎంక్వయిరీ చేసి, సాయంకాలానికి రిపోర్ట్ ఇవ్వమని చెప్పాడంట సార్. మన జిల్లాలో ఈ నెలలోనే ఇది మూడో లాకప్‌డెత్ అంట! పబ్లిక్‌లో మన డిపార్ట్‌మెంట్ పరువు తీసేస్తున్నారని ఎస్పీ కోపంగా వున్నాడంట సార్'

"మన డిపార్ట్‌మెంట్‌కి పరువు ఒకటి ఏడ్చిందటనా? ఎవడి స్వార్థం వాడు చూసుకుంటున్నాడు. డ్యూటీలో వున్న సమయంలో ఏమైనా పొరపాటు జరిగితే దానిని కప్పిపుచ్చుకోవాలా? డిపార్ట్‌మెంట్ సైడ్ నించే గొడవ చేయాలా? ఇంకా ఏమైనా చెప్పారా?"

"ఏం జరిగిందని నన్ను అడిగారు. నేను మొన్న డ్యూటీలో లేనని చెప్పాను సార్. వాడు తాగి సెంటర్లో పడిపోతే మన కానిస్టేబుళ్లు హాస్పిటల్లో చేర్పించారనీ, వాడు నేరస్తుడు కూడా కాదనీ, వాణ్ణి అసలు అరెస్టే చేయలేదని చెప్పాను సార్'

మనవాళ్లు రోగుల్ని ఆస్పత్రిలో చేర్పించే ప్రజాసేవ ఎప్పట్నించీ చేస్తున్నారని అడిగాడు. మొత్తానికి డిఎస్పీ మనం అంటే మండిపడుతున్నాడు''

"ఎందుకు మండిపడడూ? రామాపురం మర్డర్ కేసులో మనం ఏమిటో తిన్నామని వాడు ఏడ్చి చస్తున్నాడు. రానీయ్, వచ్చి ఏం చేస్తాడో, ఎవర్ని ఎంక్వయిరీ చేస్తాడో చూద్దాం. అసలు దీనికంతటికీ మూలకారణం ఆ విజయం విలేకరిగాడు... వాడ్ని బొక్కలో తోసి నాలుగు తగిలిస్తేకానీ వాడి పొగరు అణగదు''

స్టేషన్‌లో పనిచేస్తున్న పీసీలు అందరూ




వచ్చారు.

"ఏం చేద్దామయ్యా ఈ విషయాన్ని? అందరి మెడకూ చుట్టుకునేలా వుంది పరిస్థితి. ఎలా తప్పించుకుందాం ఈ గండం?" వాళ్ళని అడిగాడు కిషోర్.

"మాకేమీ తెలియదని చెపుదాం సార్. వాణ్ణి అరెస్టు చేసినట్లు రికార్డుల్లో కూడా లేదుగదా?"

"లేదు నిజమే. బయటివాళ్ళకైతే మాకేమీ తెలియదని దబాయించవచ్చు. కానీ మన పైఅధికారికి అలా చెబితే కుదురుతుందా? మన జాతకాలు ఆయనకి తెలియవా, ఆయన జాతకం మనకి తెలియదా?"

"ఈయనకి దక్షిణ సమర్పించుకుంటే ఏమైనా లొంగుతాడా సార్?" ఒక పీసీ సందేహం వెలిబుచ్చాడు.

"ఎస్పీ దగ్గరనించి ఆర్డర్ వచ్చిందట. జిల్లాలో ఇటీవల ఇది మూడో లాకప్‌డెత్ కావడంతో ఎస్పీ కూడా సీరియస్‌గా వుంటాడు. మనం వాడి వంటిమీద చెయ్యి వెయ్యలేదనీ, వాడ్ని అసలు కొట్టలేదనీ అందరం ఒకమాటమీద వుందాం"

"అంతే సార్, వాడ్ని కొట్టడం ఎవరు చూశారు? సాయంత్రం అరెస్ట్ చేస్తిమీ, రాత్రికి హాస్పిటల్‌లో అడ్మిట్ చేస్తిమీ! వాడ్ని అరెస్టు చేసిన తరువాత గుండెల్లో నొప్పిగా వుందన్నాడనీ, ఆస్పత్రికి తీసుకుపోతుంటే దారిలో అన్‌కాన్షస్‌లోకి పోయాడని చెపుదాం సార్'

"అంతే. అలాగే చెప్పాలి. అందరం ఒక మాట మీద వుండాలి. ఈ డిఎస్పీకి మన మీద బాగా కోపంగా వుంది. నిజం రాబట్టడానికి ప్రయత్నించినా అందరం ఒకటేమాట మీద వుందాం" అన్నాడు కిషోర్.

★ ★ ★

ఫణిగిరిలో ప్రతిపక్ష పార్టీ ఎక్కువగా వుంది. వామపక్షభావాలు కలిగిన వాళ్లు కూడా చాలామంది వున్నారు.

ప్రతిపక్ష పార్టీకి సంబంధించిన ముఠాకి నిరంజన్ నాయకుడు.

మండలంలో తమ ముఠావాళ్ళని పోలీసులు పట్టుకున్నప్పుడు, వాళ్ళని విడుదల చేయించడం కోసం నిరంజన్ తరచూ స్టేషన్‌కు వెళ్తుంటాడు.

ఎస్.ఐ కిషోర్ ప్రత్యక్షంగా అధికార పార్టీకి కొమ్ముకాస్తూ, ప్రతిపక్షం వాళ్ళని అణచడంలో ఉత్సాహం చూపిస్తుంటాడు. తమ ముఠావాళ్లని విడిపించుకోవడానికి స్టేషన్‌కి వెళ్ళిన సమయాల్లో నిరంజన్‌కీ, కిషోర్‌కీ అనేకసార్లు ఘర్షణా, వాదోపవాదాలూ జరిగాయి.

ఎన్నికలు సమీపంలోనే వున్నాయి. ఆ ఎన్నికల్లో నిరంజన్ ప్రతిపక్ష పార్టీ తరఫున పోటీ చేయాలనుకుంటున్నాడు.

ఎన్నికల్లో పోటీచేయాలంటే జనం మద్దతు కావాలి. జనం మద్దతు కావాలంటే గ్రామాల్లో తగాదాలు వుండాలి. జనం కొట్టుకుంటూ వుండాలి. తరచూ ఘర్షణలు జరుగుతూ వుంటేనే ఏ ముఠాకి ఆ ముఠా పటిష్టంగా వుంటుంది. ఎవరి మనుషులు వాళ్ళకి వుంటారు.

ఈ విషయాన్ని జీర్ణించుకున్న రెండు పార్టీలూ ప్రజల్లో పురులు పెడుతూనే వున్నాయి. వీలైనంత ఎక్కువగా నాయకులు ఘర్షణలు సృష్టిస్తూనే వున్నారు. అలాంటి తగాదాల సమయంలో ఎస్‌ఐ కిషోర్ అధికార పార్టీ కొమ్ముకాయడం నిరంజన్‌కి ఇబ్బందిగా వుంది.

ముఠాలు వుండే ప్రాంతాల్లో ఆ ముఠా నాయకులకి పోలీసుల అండా, సహాయం తప్పనిసరిగా వుండాలి.

కిషోర్ నేతృత్వంలోని పోలీస్ డిపార్ట్‌మెంట్ తమకి సహాయంగా వుండకపోవడమే గాకుండా ప్రత్యర్థి ముఠాని కాపాడుతుండటం నిరంజన్ ముఠాకి తలనొప్పిగా తయారైంది.

ఎన్నికల సమయంలో కూడా కిషోర్ ఎస్ఐగా ఇదే స్టేషన్‌లో వుంటే, చాలా చిక్కుల్లో పడాల్సివుంటుందని నిరంజన్‌వాళ్లు భావించారు.

కిషోర్‌ని దెబ్బతీయడానికి ఇదే సరైన అవకాశం అనుకున్నారు. అర్జునుడి లాకప్ మృతినే ఆయుధంగా వాడుకోవాలనుకున్నారు.

ఇక ఆలస్యం చేయకుండా జనాన్ని సమీకరించే సన్నాహాలు ప్రారంభించారు.



"ఏం నేరం చేయలేదు. కేవలం తాగి బజారులో ఏదో వాగుతుంటేనే పట్టుకుపోయి లాకప్‌లో కొట్టి కొట్టి చంపేశారు"

"పోలీసు నాకొడుకులు ఆడింది ఆటా, పాడింది పాటగా వుందిరా చూడబోతే! దొంగతనం నెపంతోటి మా బామ్మర్ది షడ్డగుణ్ణి పట్టుకుని రెండు నెల్లు టేషన్‌లో పెట్టి ఇష్టం వచ్చినట్టు కొట్టారు. వాడు దొంగతనం చేయలేదూ, ఏంలేదూ! చివరకి ఆ వస్తువులు దొంగిలించినవాళ్లు అమ్ముతుంటే పట్టుకున్నారు. వీళ్ళు కొట్టిన దెబ్బలకి వాడు మూడు నెల్లు మనిషి కాలా? అన్నీ మంచంలోనే పాపం! ఇప్పుడిప్పుడే మామూలు మనిషి అవుతున్నాడు అనుకో!"

"పోలీసోళ్లకి దొంగల్ని కానీ, ఎవుర్నికానీ కొట్టే హక్కు ఎక్కడుందీ? ఎవరన్నా దొంగతనమో, ఖూనీయో చేస్తే వాళ్ళని తీసుకుపోయి కోర్టుకి అప్పగించాల! అప్పుడు కోర్టు విచారించి నిజంగా నేరం చేస్తే శిక్ష వేస్తుందీ, లేకుంటే లేదు. అంతేకానీ పోలీసోళ్లకి ఎవురి మీదైనా చెయ్యివేసే చట్టం, కొట్టే చట్టం లేదు!"

"పోలీసులు పట్టుకున్న తరువాత 24 గంటలలోపు కోర్టుముందు హాజరుపెట్టాల! అదీ చట్టం! 24 గంటలు దాటిన తరువాత ఒక్క గంట కూడా టేషన్‌లో పెట్టడానికి వీల్లేదు! అంతేకానీ, ఇదేందంట ఇట్లా రోజు రోజులు టేషన్‌లో పెట్టుకుని చావగొట్టడం..."

"ఈసారి పోలీసుల్ని వదలకూడదు. మరీ ఇంత అన్నేయమా? వాడేం తప్పు చేసాడని వాణ్ణి చావగొట్టడం? తాగితే తప్పా? చీకటిపడితే మన వూళ్ళో ఈ పోలీసుల్లో సారాయి షాపుకో, బ్రాందీ షాపుకో పోయి దూరని వాడెవడు? అతీగతీ, ఆస్తీపాస్తీ లేనివాడు అనేగా వాడిని చావగొట్టి చెవులు మూయడం"

"తాడో పేడో తేల్చుకోవాల్సిందే. పోలీసుల అంతు చూడాల్సిందే! ఇదేం వూరా, అడివా?"

ఎస్పీ ఆదేశంమీద మధ్యాహ్నానికి డిఎస్పీ ఫణిగిరి చేరుకున్నాడు, విషయం తెలుసుకుని రిపోర్టు రాయడానికి.

డిఎస్పీ వచ్చేసరికి ఫణిగిరిలో జనం గుంపులు గుంపులు కూడి వున్నారు. ఎక్కడ చూసినా ఇదే విషయం మాట్లాడుకుంటున్నారు. పోలీసుల్ని పబ్లిక్‌గానే బండబూతులు తిడుతున్నారు.

స్టేషన్‌కు వచ్చిన డిఎస్పీ పోలీసులతోనూ, ఎస్ఐతోనూ మాట్లాడాడు. వాళ్ళు మాకేం తెలియదంటే తెలియదనీ, అతని శరీరంమీద ఒక్క దెబ్బ కూడా వెయ్యలేదని చెప్పారు.

"ఒక్క దెబ్బ కూడా వెయ్యకపోతే





ఎందుకు చస్తార్రా బద్మాష్లల్లారా! వాడు కాదు, మీరు తాగి వున్నారులా వుంది చూస్తుంటే..." అని డిఎస్పీ ఆ సిబ్బందిని తిట్టిన తిట్టు తిట్టకుండా నోటికి వచ్చిన తిట్లల్లా తిట్టాడు.

ఎస్పీకి ఫోన్ చేశాడు.

"ఇక్కడ చాలా వుద్రిక్తంగా వుంది సార్. ప్రజలు ఏక్షణంలో అయినా స్టేషన్మీద దాడి చేయవచ్చు. గొడవ జరిగే ప్రమాదం వుంది. అదనపు బలగాలు అవసరం సార్!" అని డిఎస్పీ ఇంగ్లీషులో ఎస్పీకి విషయం తెలిపాడు.

"సరే, ఒక గంటలో బలగాల్ని పంపిస్తున్నాను. రేపు మంత్రి గాడి ప్రోగ్రాం వుంది. వాడి ప్రోగ్రాంకి బందోబస్తు ఏర్పాట్లు చూడాలి. నేను అక్కడికి రావడం కుదరదు. నువ్వు అక్కడే వుండి ఎలాంటి సమస్యా రాకుండా చూడు. కొద్ది నెలల్లో ఎన్నికలు జరుగుతాయి కదా! వీలైనంతవరకూ కాల్పులు జరిపే పరిస్థితి తీసుకురావద్దు. ఒకవేళ కాల్పులు జరిపితే జనం చస్తారు. ప్రభుత్వంమీద వ్యతిరేకత వస్తుంది. ఎన్నికల్లో ఆ ప్రభావం వుంటుంది. తరువాత మనకి ప్రాబ్లం కావచ్చు. జనం మాత్రం చావకుండా చూడు'' అని ఎస్పీ ఫోన్లోనే డిఎస్పీకి ఆదేశాలు ఇచ్చాడు.

★ ★ ★

లాకప్ మృతిమీద నిజానిజాలు తెలుసుకోవడానికి మానవహక్కులసంఘంవాళ్లు కారు వేసుకుని వచ్చారు. ఈ బృందంలో ఇద్దరు అడ్వకేట్లూ, ఒక డాక్టరూ, ఒక లెక్చరరూ, ఒక లా విద్యార్థీ, ఒక పత్రికకు సంబంధించిన జిల్లా ప్రతినిధీ వున్నారు.

ఈ నిజనిర్ధారణ బృందాన్ని విలేకరి కళాధర్ కలుసుకున్నాడు. వాళ్ళు అందరూ కలసి గాంధీబొమ్మ సెంటర్ దగ్గరకు వచ్చారు.

అక్కడ ఇద్దరు ముగ్గురు అర్జునుణ్ణి పోలీసులు కొట్టి స్టేషన్కు తీసుకుపోయారని చెప్పారు. కొంతమంది చెప్పడానికి నిరాకరించారు. తమకు ఏమీ తెలియదని చెప్పారు.

అర్జునుణ్ణి రిక్షా ఎక్కించుకుని స్టేషన్కు తీసుకుపోయిన అతను అక్కడే వుంటే అతనితో కూడా మాట్లాడారు.

"నా రిక్షామీదనే టేషన్కి తీసుకుపోయాను సార్. కానీ కొట్టడం మాత్రం నేను చూళ్లేదు సార్. అతను రిక్షా ఎక్కకపోతే, ఎత్తి రిక్షాలో కుదేశారు సార్"

"అతన్ని వాళ్ళు కొట్టారంటావా, కొట్టలేదంటావా?"

"కొట్టినట్లుగానే వుంది సార్. స్టేషన్కి పోయిన తరువాత నీ అంతు చూస్తాంరా అని బెదిరించారు. నాముందే..."

"అతన్ని నేరుగా హాస్పిటల్కు తీసుకుపోలేదు కదా?" లా విద్యార్థి అడిగాడు.

లేదు సార్. స్టేషన్నించి అర్ధరాత్రిపూట మావాడి రిక్షాలోనే ఆస్పత్రికి తీసుకుపోయారు సార్"

"మీవాడా, ఎవరతను, ఎక్కడున్నాడు?"

"గంటక్రితం ఇక్కడే వున్నాడు. ఇంటికి వెళ్ళి వుంటాడు. మిట్టమీద సార్ వాళ్ళ ఇల్లు. రిక్షారాముడు అంటే ఎవరైనా చెపుతారు'' చెప్పాడు అతను.

ఆ రాముడితో కూడా మాట్లాడటానికి నిజనిర్ధారణ బృందం వాళ్ళు మిట్టమీదకు వెళ్ళారు. అతను ఇంట్లోనే వున్నాడు.

హక్కుల సంఘంవాళ్ళు అతనిని విషయం అడిగారు.

"నాకేం తెలియదండీ. నేనారోజు వూళ్ళో లేను అసలు. మీకు ఎవరో నామీద అబద్ధం చెప్పారు''

"అబద్ధం చెప్పకయ్యా రామయ్య... నువ్వు తీసుకుపోవడం చాలామంది చూశారు. వీళ్ళు మనవాళ్ళే. నిన్ను ఎవరూ ఏం

చేయరు. భయపడకుండా జరిగిన విషయం చెప్పు" అన్నాడు కళాధర్.

"అసలు మీరెవరు? మీకెందుకు ఈ ఆరాలు''

నిజనిర్ధారణ బృందంవాళ్ళు తమని తాము పరిచయం చేసుకున్నారు. చట్టంలో వున్న హక్కులు పేదలకు ఎలా అమలు జరగడంలేదో, అందుకు గల కారణం ఏమిటో, హక్కులు కనీసంగానైనా సాధించుకోవాలంటే ఏం చేయాలో, తాము ఏం చేస్తున్నామో అతనికి క్లుప్తంగా వివరించారు.

"నువ్వేం భయపడాల్సిన పనిలేదు. జరిగింది జరిగినట్లు చెప్పు. ఈ మిట్టమీద వాళ్ళు అందరూ నిరంజన్ ముఠా మనుషులే కదా? నిరంజన్ కూడా ఇప్పుడు ఇదే పనిమీద తిరుగుతున్నాడు'' చెప్పాడు కళాధర్.

"ఆరోజు రేత్రి రెండో ఆట సినిమా టయానికి బాడుగలకోసం నేను హాలు దగ్గరకి పోతున్నాను సార్. దారిలో పోలీసులు ఆపి, రిక్షాని టేషన్ దగ్గరకి తీసుకుపొయ్యారండీ! టేషన్ లోపలినించి తెలివితప్పి పడిపోయి వున్న మనిషిని తెచ్చి, రిక్షాలో పడుకోబెట్టి ఆస్పత్రిలో చేర్పించారండీ!"

"నీతో ఏమైనా చెప్పారా?"

"వాడ్ని ఆస్పత్రికి తీసుకుపోయినట్లు ఎవరికైనా చెబితే, వాడికి ఏ గతి పట్టిందో నీకూ అదే గతి పట్టిద్దిరా అని బెదిరించారండీ''

"ఇంకా దారిలో ఏమైనా మాట్లాడారా?"

"ఏం మాట్లాడలేదండీ. ఆస్పత్రిలో పోలీసూ, నేనూ కలిసి అతన్ని బల్లమీద పడుకోబెట్టి, నేను ఇంక హాలు దగ్గరకి పోయ్యానండీ. తరువాత నాకు తెలవదండీ'' రిక్షారాముడు భయపడుతూనే జరిగిన విషయం చెప్పాడు.

హక్కుల సంఘంవాళ్ళు గంగన్నపాలెం కూడా వెళ్ళారు. కళాధర్ కూడా వాళ్ళతో వున్నాడు. వాళ్ళు నేరుగా అర్జునుడి ఇంటికి వెళ్ళారు. తమని తాము పరిచయం చేసుకున్నారు.

అర్జునుడి భార్యా పిల్లలూ భోరుమని విలపిస్తూ చెప్పారు.

"పోలీసోళ్ళకు దూము తగిలిపోనూ. వాళ్ళు నాశినంకానూ... మా మనిషిని కొట్టి చంపేశారయ్యా... మా కాపురాన్ని వీధులపాలు చేశారయ్యా... మమ్మల్ని దిక్కులేని వాళ్ళని చేశారయ్యా... అంత దురుమార్గం పనికిరాదయ్యా... మా బిడ్డలు గాల్లోని పచ్చులైపోయారయ్యా... మాకు ఇంకా సంపాయించి సాదుకునే నాధుడులేడయ్యా..." అని పిల్లలూ, పెద్దలూ విలపించారు.

పోలీసుల్ని తిడుతూ, వాళ్ళే కొట్టి చంపేశారని అర్జునుడి భార్యా పిల్లలూ గట్టిగా చెప్పారు.

"అయితే శవాన్ని పూడ్చిపెట్టారా, దహనం చేసారా?"

"మా ఆచారంలో అందరం చచ్చినోళ్ళని పూడ్చిపెడతామయ్యా! మా ఆచారం ప్రకారం చేసుకుందామంటే మా వూరి పెసిరెంటు శవాన్ని దహనం చేసిందాకా వూరుకోలేదయ్యా! దగ్గరుండి దహనం చేయించాడు మారాజు''

"ఎందుకు ఆయన అలా చేసింది?"

"ఆరోజు రాజీ అని ఎనిమిదివేలు తగలేశారయ్యా! రాజీకి మేం ఒప్పుకోకపోయేసరికి మా చుట్టాలకి ఆ డబ్బు ఇచ్చారు. మా బాధల్లో మేం వుంటే మా చుట్టాలు ఆ డబ్బు తీసుకుని తరువాత మాకు ఇచ్చారు''

అర్జునుడి కుటుంబ సభ్యులతో మాట్లాడిన తరువాత హక్కుల సంఘం వాళ్ళు రాజీ విషయం ఏమిటో, దగ్గరుండి ఎందుకు దహనం చేయించాడో తెలుసుకుందామని సర్పంచ్ నరసయ్య వాళ్ళ ఇంటికి వెళ్ళారు. కాని అతను లేడు.

ఆయన భార్య వరండాలో నిలబడి




వుంది.

"సర్పంచ్‌గారు వున్నారా?" అని అడిగారు.

"లేరు''

"ఎక్కడికి వెళ్ళారు?"

"ఊరికి వెళ్ళారు''

"ఆయనతో పని వుండి వచ్చాం. ఆయన సాయంత్రానికి వస్తారా, వచ్చేవరకూ వుంటాం"

"ఏమో తెలియదు''

"పోనీ ఎప్పుడు వస్తారో ఆ విషయం అయినా తెలుసా?"

"ఏమో తెలియదు''

ఊరికి వెళ్ళాడు అనే ఒక్క విషయం తప్ప, ఇక అన్ని విషయాలకూ 'ఏమో తెలియదు' అనే సమాధానం ఆమెనించి వస్తూండటంతో హక్కుల సంఘం వాళ్ళు ఉసూరని నిట్టూర్చారు.

అర్జునుడి లాకప్‌మృతి వార్త దినపత్రికలో వచ్చిన రోజే నరసయ్య ముఖం చాటుచేశాడు. విషయం సద్దుమణిగిన తరువాత రావచ్చు అని, అతని కొడుకు ఏదోపట్టణంలో వుద్యోగం చేస్తుంటే అక్కడికి పలాయనం చిత్తగించాడు.

హక్కుల సంఘం వాళ్ళు తిరిగి ఫణిగిరి వచ్చారు..

పోలీసులకంటే ముందు ప్రభుత్వ డాక్టర్‌తో కూడా మాట్లాడితే బాగుంటుందని ఆస్పత్రికి వెళ్ళారు.

పోలీసుల హింసా ప్రయోగం వలనే అర్జునుడు మృతిచెందాడని ఆ డాక్టరు చెప్పాడు.

"మరి పంచనామా, పోస్ట్‌మార్టం లేకుండా డెడ్‌బాడీని ఎలా తీసుకుపోయారు? అవి రెండూ ఎందుకు చేయలేదు?"

"అవి మీరు పోలీసుల్ని అడగాల్సిన ప్రశ్నలు. అవి రెండూ చేయలేదంటే నేనేం చేయగలను? నావరకూ నేను రోగిని కాపాడదామనే తెల్లారేవరకూ కృషిచేశాను''

"చాలా దుర్మార్గంగా వుంది పోలీసుల విషయం చూస్తుంటే..." అని డాక్టర్ దగ్గర సెలవు తీసుకుని బృందం వాళ్ళు కదిలారు.

నిరంజన్, అతని మిత్రులు కూడా హక్కుల బృందంవాళ్ళతో కలిశారు. అందరూ పోలీస్‌స్టేషన్‌కి వచ్చారు.

కిషోర్ బయట నిలబడి వున్నాడు. వీళ్ళని చూసిన అతనికి అరికాలిమంట నెత్తికి ఎక్కింది. అసలే తను పుండుపడి బాధపడుతుంటే వీళ్ళరాక ఆ పుండు మీద కారం రాసినట్లుంది.

వాళ్ళలో కళాధర్‌ని చూసి 'రేస్కల్‌ని లాకప్‌లో తోసి నాలుగు వుతికితే బాగుణ్ణు!' అనుకున్నాడు కిషోర్.

లోపల డిఎస్పీ వుంటే బృందంలోని వాళ్ళు అందరూ లోపలికి వచ్చారు.

"ఏం కావాలి మీకు?" డిఎస్పీ అడిగాడు.

"మేము హక్కుల సంఘం వాళ్లమి. అర్జునుడి మృతి విషయంలో మా సందేహాలు తీర్చుకుందామని''

"అయితే అందరూ లోపలికి తోసుకుని రావడమేనా? ఇదేమైనా పోలీస్ స్టేషన్ అనుకున్నారా, పబ్లిక్ లేవట్రీ అనుకున్నారా?"

"అలా ఎందుకు అనుకుంటామండీ?"

"మరి ఏమిటి? వచ్చి మాట్లాడటానికి ఒక పద్ధతీ, ప్రాసెస్ వుంటుంది. మీ అంతట మీరు లోపలకి నెట్టుకుని రావడమేనా? పర్మిషన్ తీసుకునే పనిలేదా?" డిఎస్పీ హుంకరించాడు.

అర్జునుడి ప్రస్తావన రాకముందే వాళ్ళని బెదరగొట్టాలనుకున్నాడు. వాళ్ళకి ఎక్కువ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా వీలైనంత జాగ్రత్తగా తప్పించుకోవాలనుకున్నాడు. దబాయించడం తప్ప, వాళ్ళ ప్రశ్నల బాణాల నించి తేలికగా బయటపడే మరోమార్గం ఆయనకి కనబడలేదు.

"సారీ సార్..." అన్నారు బృందంలోని ఇద్దరు ఒకేసారి.

"సారీలేదూ, ఏం లేదూ! అందరూ బయటకువెళ్ళండి. మీకు సంబంధించిన వాళ్ళు ఎవరో ఇద్దరు వుండి మాట్లాడండి. అంతే కానీ, పదిమంది వుంటే అందరూ చుట్టుముట్టడమేనా?"

"ఐదు నిముషాలు సార్..."

"ఐదు నిముషాలు లేదూ, అరనిమిషం లేదూ! అందరూ బైటకు వెళ్ళి ఇద్దరు ముఖ్యులు వుండండి''

అడ్వకేట్, డాక్టర్ మాత్రం వున్నారు. కళాధర్, నిరంజన్ మిగిలినవాళ్ళూ బయటకు వచ్చి చెట్టుకింద నిలబడ్డారు.

"అర్జునుడిని మీ పోలీసులు అరెస్ట్‌చేశారా? ఏ నేరం కింద అరెస్ట్ చేశారు?"

"అసలు అతనిని అరెస్ట్‌చేయలేదు. తాగి బజారులో న్యూసెన్స్ చేస్తూ పడిపోయి వుంటే అతన్ని తీసుకుపోయి హాస్పిటల్‌లో అడ్మిట్ చేశాం"

"అతని వంటిమీద దెబ్బలు ఎందుకు వున్నాయి?"

"ఏమో... అతని వంటిమీద దెబ్బలు వుండే అవకాశం లేదు''

"భయంకరమైన దెబ్బలు కొట్టారని డాక్టరు కూడా అంటున్నారు''

డిఎస్పీ ఏం జవాబు చెప్పలేదు.

"మీ పోలీసులు అతన్ని బజారులో కొట్టి, స్టేషనుకు తీసుకువచ్చినట్లు మాకు ఆధారాలు కూడా వున్నాయి, సాక్ష్యాలు వున్నాయి''

"పోలీసులంటే గిట్టనివాళ్ళు సృష్టించిన సాక్ష్యాలు అవి. వాటితో మాకు సంబంధంలేదు''

"అలా కాదు, సామాన్య జనమే పోలీసులు అతన్ని కొట్టడం చూశారు. కొట్టడాన్ని వారించారు. అయినా మీ పోలీసులు వినలేదు. బహిరంగంగానే కొట్టారు. కొట్టి, స్టేషన్‌కు తీసుకువచ్చి ఇక్కడ కూడా కొట్టారు. అతను మీ దెబ్బలకు ఆస్పత్రిలో మరణించడంతో, ఈ విషయాన్ని కప్పిపుచ్చడానికి, రాజీ అని చెప్పి అతని కుటుంబానికి ఎనిమిది వేలు ఇచ్చారు'' అడ్వకేటు అన్నాడు.

"మీరు అలా భావిస్తే మేం చెప్పేది ఏమీ లేదు''

"అర్జునుడి మృతికి బాధ్యులైన వారిపై చర్యలు తీసుకోవాలి''

"అది డిపార్ట్‌మెంటుకి సంబంధించిన విషయం. ఇంతకంటే మీతో మాట్లాడేది ఏమీ లేదు'' అన్నాడు డిఎస్పీ.

"అతనిమీద యాక్షన్ తీసుకోరా?" మళ్ళీ అడిగాడు డాక్టర్.

డిఎస్పీ ఏం మాట్లాడకుండా మౌనంగా వున్నాడు.

ఇక వుపయోగంలేదని ఇద్దరూ బయటకు వచ్చారు.

బయట వున్న వాళ్ళతో లోపల జరిగిన విషయం చెప్పారు.

"పోలీసులు ఎలాంటి యాక్షనూ తీసుకోరండీ. ఏదయినా మనం ప్రత్యక్షంగా ఆందోళనకు దిగితేనే కనీసంగానైనా గవర్నమెంటు స్పందిస్తుంది'' అన్నాడు హక్కుల సంఘం కార్యదర్శి.

"అవును... అందుకే ఇవ్వాళ సాయంత్రం ప్రదర్శనా, సభా ఏర్పాటు చేశాం. రేపు వుదయం ఒక గంట రాస్తారోకో, స్టేషన్ ముందు ధర్నా చేయాలనుకుంటున్నాము'' చెప్పాడు నిరంజన్.

ఆరోజు సాయంత్రం నిరంజన్ పార్టీ వాళ్ళూ, వామపక్షాలూ కలిసి పోలీసులకి వ్యతిరేకంగా ప్రదర్శన చేశారు.

గంగన్నపాలెం హరిజనులు కూడా చాలా మంది వచ్చి ప్రదర్శనలో పాల్గొన్నారు. సాయంత్రం బహిరంగసభ జరిగింది.




ఆ సభలో ప్రధానంగా హక్కుల సంఘం వాళ్ళే మాట్లాడారు.

సభ అయిన తరువాత హక్కుల సంఘం వాళ్ళు వెళ్ళిపోయారు.

జిల్లా కేంద్రానికి వెళ్ళి నిజనిర్ధారణ బృందం నివేదికను రూపొందించింది. అక్కడ విలేఖరుల సమావేశం ఏర్పాటు చేసి, అర్జునుడి మృతికి సంబంధించిన వివరాలు చెప్పింది.

అర్జునుడు లాకప్‌లో కొట్టిన దెబ్బలకే మృతిచెందాడనీ, అతని మరణానికి పోలీసులే పూర్తి బాధ్యత వహించాలని చెప్పారు. హంతకులైన ఎస్ఐనీ, పోలీసుల్ని తక్షణం సస్పెండ్ చేసి అరెస్ట్ చేయాలని డిమాండ్ చేశారు. ఈ లాకప్ మృతి మీద హైకోర్టు న్యాయమూర్తితో విచారణ జరిపించాలనీ, మృతుడి కుటుంబానికి లక్ష రూపాయల పరిహారం చెల్లించాలనీ వాళ్ళు విజ్ఞప్తి చేశారు.

★ ★ ★

మరుసటి రోజు వుదయం నిరంజన్ పార్టీ వాళ్ళు పోలీసులమీద చర్య తీసుకోవాలని కోరుతూ గంటసేపు రాస్తారోకో జరిపారు. రాస్తారోకో వలన ఆ రహదారిమీద ఎక్కడ వాహనాలు అక్కడ ఆగిపోయాయి.

రాస్తారోకో అయిన తరువాత ధర్నా కార్యక్రమాన్ని ఏర్పాటుచేశారు. నేరస్తులైన పోలీసుల్ని సస్పెండ్ చేయాలని కోరుతూ స్టేషన్ ముందు బైఠాయించారు. శాంతియుతంగా, ఎలాంటి కవ్వింపు చర్యలూ, ఉద్రిక్త పరిస్థితులూ సృష్టించకుండా క్రమశిక్షణగా కూర్చుని నినాదాలు ఇస్తున్నారు.

వాళ్ళలో చాలామంది స్త్రీలూ, వృద్ధులూ, పిల్లలూ కూడా వున్నారు.

హోరెత్తే నినాదాలు ఆకాశాన్నంటుతున్నాయి! స్టేషన్‌లో వున్న పోలీసుల చెవులు చిల్లులుపడుతున్నాయి. వాళ్ళా గుంపుని చెదరగొట్టాలనుకున్నారు.

తమకు వ్యతిరేకంగా కాకుల మాదిరి గోలచేస్తున్న ఆ జనంలో కొందర్ని కాల్చి చంపి, తమ ప్రతాపం చూపెడితే బాగుంటుందనుకున్నారు కానీ పైనించి వచ్చిన ఆదేశాలమేరకు కాల్పులు జరపడం సాధ్యం కాదని తెలిసి నిరుత్సాహపడ్డారు.

లాఠీలకు మాత్రం పని వుందని తెలిసి కాస్త కుదుటపడ్డాయి వాళ్ళ మనసులు. మూకుమ్మడిగా లాఠీలకి పని తగిలి కూడా చాలా రోజులు అవుతోంది.

లాఠీలు విజృంభించాయి.

జనంలో కేకలూ, అరుపులూ, ఏడుపులూ హాహాకారాలూ, గందరగోళం, పరుగులూ!

చాలామందికి తలలు పగిలాయి. చేతులు కాళ్ళు విరిగాయి.

సింధూరం చల్లినట్లుగా ఆ ప్రాంతం నెత్తురు మరకలతో నిండిపోయింది.

పోలీసుల ధాటికి నిలవలేని జనం పరుగులు తీశారు.

పైనించి వచ్చిన ఆదేశాలమేరకు డిఎస్పీ లాఠీలకే పని పురమాయించాడు కానీ తుపాకుల జోలికి వెళ్ళలేదు.

లాకప్ మరణాల సందర్భంగా నిరసన తెలిపే ప్రజానీకం మీద లాఠీల కరాళనృత్యమే కాదు, తుపాకులు కూడా పేలి ఎంతో మందిని బలితీసుకున్న సందర్భాలు వున్నాయి. ఎన్నో ప్రాణత్యాగాలు జరిగాయి.

లాకప్ హత్యల్ని నిరసించిన నేరానికి ఈ రాష్ట్రంలో ఈ దశాబ్దంలో ఎంతోమంది పోలీస్ కాల్పులకు ఆహుతైపోయారు.

అనంతపురం జిల్లా ధర్మవరం పోలీసులు మొండి వెంకటేష్ అనే వ్యక్తిని లాకప్‌లో కొట్టి చంపివేశారు.

"అయ్యో, ఏమిటీ అన్యాయం? నా భర్తని ఎందుకు చంపేశారు? నా పసుపు కుంకుములు ఎందుకు తీశారు? ఏమిటి మా ఆయన చేసిన నేరం?" అని ప్రశ్నించిన ఫలితంగా,

పోలీసుల్ని నిలేసిన నేరానికి శిక్షగా ఆ వెంకటేష్ భార్యనీ, మరో ఇద్దర్నీ కూడా పోలీసులు కాల్చిచంపారు.

నల్గొండ జిల్లా కోదాడ పోలీస్‌స్టేషన్‌లో బూధారపు పద్మనాభం అనే వ్యక్తిని పోలీసులు పొట్టనబెట్టుకున్నారు. యువకుడూ, ఆరోగ్యవంతుడైన పద్మనాభం పోలీస్‌స్టేషన్‌కి ఫిర్యాదు చేయడానికి వెళ్ళాడు. అతనిని వెనుక గదిలోనికి తీసుకుపోయి అరగంటలోనే కొట్టిచంపేశారు. ఈ విషయమై ఆందోళన చేయడానికి సిద్ధమైన జనంమీద కాల్పులు జరిపి మరి ఇద్దరి ప్రాణాలు తీశారు.

విజయనగరంజిల్లా శృంగవరపుకోట పోలీసులు తమ లాకప్ నరకకూపంలో సాధు అనే వ్యక్తిని హింసించి పైకి సాగనంపారు. ఇందుకు నిరసన తెలిపిన ప్రజానీకం మీద కాల్పులు జరిపి ఒకరి నిండు ప్రాణాన్ని బలిగొన్నారు.

పైనించి వచ్చిన ఆదేశాలూ, డిఎస్పీ సాధు స్వభావం కారణంగా ఇక్కడ అలాంటి పరిస్థితి వుత్పన్నం కాలేదు.

ఆ నెలలో అప్రతిహతంగా సాగిన లాకప్ మరణాలమీద పత్రికలు ఘాటుగా సంపాదకీయాలు రాశాయి.

హక్కుల సంఘం వాళ్ళతో పాటు ఇతరులు కూడా చాలామంది స్పందించి ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించారు.

ప్రజల నిరసనని గమనించిన ప్రభుత్వం పోలీసుల్ని బదిలీచేసి న్యాయవిచారణకు ఆదేశించింది.

ప్రభుత్వం ఎస్ఐనీ, కానిస్టేబుళ్ళనీ బదిలీ మాత్రం చేసింది కానీ సస్పెండ్ చేయడానికి నిరాకరించింది.

సస్పెండ్ చేసినందువలన పోలీసుల ఆత్మస్థయిర్యం దెబ్బతింటుందనీ వాళ్ళలో నైతికబలం సన్నగిల్లిపోతుందని వృత్తి పట్ల అంకితభావం తగ్గిపోతుందనీ చెప్పి ప్రభుత్వం వాళ్ళని బదిలీ మాత్రం చేసి చేతులు దులుపుకుంది.

పదవీ విరమణ చేసిన న్యాయమూర్తితో ఏకసభ్య విచారణా కమీషన్‌ని నియమించి నివేదిక ఇవ్వడానికి గడువుకూడా నిర్దేశించింది.

ఎస్ఐ కిషోర్ బదిలీమీద జిల్లా కేంద్రానికి వచ్చిపడ్డాడు.

★ ★ ★

కిషోర్ బదిలీమీద పట్టణానికి వచ్చిన కొద్దిరోజులకి ఎన్నికలు వచ్చాయి.

ఎన్నికల్లో గూండా గుర్నాధం, రౌడీ రంగడు చెరొక పార్టీ తరపున తలపడ్డారు. ఇద్దరూ సమవుజ్జీలే!

అంగబలం, అర్ధబలం, కండబలం, గుండెబలం, గూండాబలం వగైరా అన్ని బలాల్లో ఇద్దరూ సమంగానే వున్నారు.

భవిష్యత్‌మీద ఆశతో ఇద్దరూ ఎన్నికల్ని ప్రతిష్ఠాత్మకంగా, పోటాపోటీగా తీసుకుని హెూరాహెూరీగా పోరాడుతున్నారు.

ప్రజలకు కంటిమీద కునుకులేదు. ఏక్షణంలో ఎవరి తల తెగి అవతల పడుతుందో అని ఆందోళన పడిపోతున్నారు. ఏ మారుమూలనో, ఏ పబ్లిక్ స్థలంలోనో బాంబులు పేలి ఎన్ని ప్రాణాలు హరీమంటాయో, ఎంతమందికి అంగవైకల్యం ప్రాప్తిస్తుందో అంతుబట్టకుండా వుంది.

మురుగు కాల్వల్లో నీరు పారినట్లు నాటుసారాయి జోరుగా ప్రవహిస్తోంది. ఇద్దరూ ఒకర్ని మించి ఒకరు దొంగచాటుగాకాదు, పబ్లిక్‌గానే సారాయి తయారుచేయించి జనాల్ని మత్తులో ముంచెత్తుతున్నారు.

గుర్నాధం, రంగడు నిజానికి ఆ పట్టణానికి పరిమితమైన గూండాలు మాత్రమే. ఎన్నికల పుణ్యమా అని వాళ్ళు ఇప్పుడు నియోజకవర్గం గూండాలు అయిపోయారు.

"గుర్నాధం గారికే- మీ పవిత్రమైన ఓటు ముద్ర"

"రంగన్నగారికే- మీ పరమ పవిత్రమైన ఓటు''

ఎవరి కయ్యా మీ ఓటు- గుర్నాధానికే'

"ఎవరికమ్మా మీ ఓటు- రంగన్నకే'

మెటాడోర్ వ్యానుల్లో కూర్చుని హెూరెత్తి పోయేలా నినాదాలు ఇస్తున్నారు. ఒకరిద్దరు వ్యానులమీద నిలబడి ఎగురుతూ, నృత్యం చేస్తూ ఉత్సాహంగా ఈలలు వేస్తున్నారు. కేరింతలు కొడుతున్నారు.

అలా నినాదాలు ఇచ్చుకుంటూ వస్తున్న ఉభయపక్షాల వ్యానులూ ఒక వీధిలో ఎదురెదురుపడ్డాయి.

అసలే అది ఇరుకు వీధి. ఆ సందు వీధిలో ఒక వ్యాను పోవడమే అంతంతమాత్రం. ఆ వీధికి వ్యానో, కారో వస్తే ఎదురుగా మనిషి వచ్చినా తప్పుకోవాలంటే కష్టమే!

అలాంటి వీధిలో వ్యానులు ఎదురుపడ్డాయి. ఒక వ్యాను వెనక్కి వస్తేగానీ రెండో వ్యాను ముందుకి పోదు.

ఎదురుపడినవాళ్లు ఒకర్ని చూసి ఒకరు రెచ్చిపోయి తమ అభ్యర్థికే ఓటు వేయమని మైకులు పగిలిపోయేలా గొంతు చించుకున్నారు.

"రేయ్... వేన్ని వెనక్కి రివర్స్ చేసుకోండిరా. మేం పోవాల్రా!"

"మేం ఎందుకు రివర్స్ చేసుకుంటాంరా? మీరే రివర్స్ చేసుకుని మర్యాదగా పొండిరా''

"ఇది మీ బాబుగాడు వేయించిన రోడ్డా ఏందిరా మమ్మల్ని వెనక్కి వెళ్లమని అడగటానికి? ముందు మీరు రివర్స్ చేసుకోండిరా!"

"రండ్రా తేల్చుకుందాం... ఎవ్వరు మొగోళ్లు అయితే వాళ్లం ముందుకి పోదాం"

మాటా మాటా పెరిగింది. తొడలు చరిచారు. మీసాలు మెలేసారు. సవాళ్లు విసురుకున్నారు. తిట్టుకున్నారు. అవి శృతిమించి ఒకర్ని ఒకరు నెట్టుకున్నారు. చివరికి చేయీ చేయీ కలిసింది.

జనం ఇళ్లలోనికి దూరి తలుపు గడి పెట్టుకున్నారు.

జండా కర్రలు గాలిలో లేచాయి. రెండు ముఠాలూ తలపడి తలలు పగలకొట్టుకునే సమయంలోనే పోలీసులు రంగప్రవేశం చేశారు.

రెండు ముఠాలవాళ్లనీ అరెస్ట్ చేసి స్టేషన్‌కు పట్టుకుపోయారు. వాళ్లని స్టేషన్‌కు తీసుకుపోయిన తరువాత ఎస్.ఐ. కిషోర్‌కి గుర్నాధంనించి ఫోన్ వచ్చింది.

"ఏమయ్యా కిషోరూ... ఏమిటీ మనవాళ్లని పట్టుకుని పోయావట? ప్రచారం చేసుకోవడానికి కూడా ఇంక రెండు రోజులే టైం ఉంది. ఈ టైంలో వాళ్లని లోపల పడేస్తే మా గతేం కావాలి?"

"అమ్మమ్మమ్మ... ఎవరు సార్ వాళ్లని లోపల పడేశామని మీకు చెప్పింది? వాళ్లు బైట చెట్లుకింద కూర్చుని ఉన్నారు. వాళ్లతో ఫోన్‌లో మాట్లాడతారా? మీరు నాకు ఫోన్ చేయడం ఏమిటి సార్? నేను బయటి మనిషినా? రెండు పార్టీలవాళ్లనీ తీసుకురావాల్సి వచ్చింది సార్ స్టేషన్‌కి! స్పాట్ అలాంటిది. మనవాళ్లని వదిలిపెట్టేపనిలోనే ఉన్నాను. కొంత లేట్ కావచ్చు సార్!"

"సరే, ఆ పనేదో త్వరగా కానివ్వు. మనవాళ్లు ఇంకా చుట్టుపక్కల పల్లెలకి కూడా తిరగాల్సిన పనివుంది''

"ఓకే సార్... కంగ్రాచ్యులేషన్స్ సార్. విన్నింగ్ మనవైపే ఉంది సార్. జనం ఎక్కడ చూసినా, ఎవర్ని కదిలించినా తమరే గెలుస్తారని చెప్పుకుంటున్నారు''

"మనం గెలవక... వెధవ... ఆ రంగడు గెలుస్తాడూ? వాడికి జనం ఎవరు ఓట్లు వేస్తారు? వాడిమీద ఎన్ని మర్డర్ కేసులు ఫైల్ అయివున్నాయి? మూడు... మరి మన మీద? నాలుగు! వాడికంటే ఒక ఆకు ఎక్కువే చదివానుకానీ తక్కువ చదివానా? జనం

మనకి ఓట్లు వేస్తారు కానీ వాడికి వేస్తారా? అసలు మొదట్లో వాడి పొజిషన్ ఏమిటీ, వాడి చరిత్ర ఏమిటీ? బస్టాండులో జేబులు కొట్టేవాడు కాదా? వాణ్ని ఎన్నోసార్లు బస్టాండులో ప్యాసింజర్లు పట్టుకుని తన్నేరు! వాడి గత చరిత్రనీ, వాడు జేబులు కొట్టడాన్నీ జనం అంత తేలిగ్గా మర్చిపోతారా?"

"నిజంగానా సార్?" కిషోర్‌కి విషయం తెల్సు. అయినా మళ్లీ గుర్నాధం నోటితో ఆ మాటలు చెప్పించి, ఆయన సంతోషపడేలా చేయాలి.

"అబద్ధం అనుకుంటున్నావా ఏంటయ్యా? కొత్తగా వచ్చావు స్టేషన్‌కి, నీకు ఇంకా పూర్తిగా తెల్సినట్లు లేదు. వెనకటి ఫైల్స్ తిరగేసి చూడు. వాడి జాతకం బయటపడిద్ది. వాడు చేసిన చిల్లర దొంగతనాలు తెలుస్తాయి''

"భలేవాళ్లు సార్ మీరు. సరే సార్... మన కులం పెద్దలు ఉన్నారు చూశారూ... రాత్రి వాళ్లందరితో ప్రయివేటుగా మాట్లాడానుసార్. అసలు ఈ కాన్స్టిట్యుయెన్సీలో మన కులంవాళ్లందరూ ఒక ఓటు కూడా చీలిపోకుండా తమరికే వేయాలనుకుంటున్నారట సార్. అందరూ ఒక మాటమీద ఉండాలని కట్టుబాటు కూడా చేసుకున్నారంట!"

"మరి కులంవాణ్ని పోగొట్టుకుంటారా? అసలు కులం ఉన్నది ఎందుకు? ఇలాంటి సమయాల్లో మంచికీ, చెడ్డకీ ఆదుకుంటుందనే కదా? అవసరమైనప్పుడు అక్కరకు రాని కులం ఎందుకు? మన కులపోళ్లే కాదు, పడమర గ్రామాల్లో మనకి బాగా అనుకూలంగా ఉంది. అసలు అటువైపు వాడికి పది ఓట్లు పడటం కూడా కష్టమే! ఏ ఊరు పోయినా జనం మనకి బ్రహ్మరధం పడుతున్నారంటే నమ్ము. అటువైపు మనకి మంచి మెజార్టీ వస్తుంది''

"అటువైపే కాదు, ఇటువైపు గ్రామాల్లో కూడా మనకే రావచ్చు సార్ మెజార్టీ! గాలి కూడా మనవైపే ఉంది''

"బాగ చెప్పావు. సరే, మొన్నటి రాత్రి మాట్లాడుకున్నట్లు చేస్తావుకదా? మరచిపోయావా? మనం అనుకున్నట్లు చేస్తే నీ మేలు మరచిపోనులే!"

"మీరు ఇన్నిసార్లు చెప్పాలా నాకు? నేను మీ తమ్ముడ్నే అనుకోండి. మీరు గెలవడం నాకు కావాలి. నాకు వీలున్నంతవరకూ అనుమానం లేకుండా చేస్తాను సార్'

"వీలున్నంతవరకూ అంటే..."

"నియోజకవర్గం అంతా చేయడం కుదరదు కదండీ. టౌన్ ముఖ్యంకదా! టౌన్‌లో ఎవరికి మెజార్టీ వస్తే వాళ్లదే గెలుపు. నా లిమిట్స్ వరకూ నేను చేస్తాను సార్. మనవాళ్లు అనుకున్న స్టాఫ్‌కి కూడా గట్టిగా చెప్పి చేయిస్తాను''

"సరే, ఉంటానుమరి. నువ్వుమాత్రం మరచిపోవద్దు. తొందరగా మనవాళ్లని వదిలిపెట్టు'' అని ఆదేశించాడు గుర్నాధం.

"అలాగే సార్' వినయంగా అన్నాడు ఎస్.ఐ. కిషోర్.

కిషోర్ ఫోన్‌లో మాట్లాడుతున్న సమయంలో రూంలోకి కానిస్టేబుల్ కనకారావు వచ్చాడు. కిషోర్ అతనిని బయటకు వెళ్లమని చేత్తో సైగచేశాడు. అతను బయటకు వెళ్లి కిషోర్ మాట్లాడిన తరువాత వచ్చాడు.

"సార్... నిన్న సాయంత్రం వచ్చాను సార్ డ్యూటీకి. ఇంటికి వెళ్లి మళ్లీ వస్తాను సార్'

"వెళ్దువులే వుండవయ్యా. ఈ గవర్నమెంట్ నా కొడుకులేమో మనకి సరిపడినంత స్టాఫ్ ఇవ్వరు. ఉన్న స్టాఫ్ అంతా ఆ నా కొడుకులకి బందోబస్తుకీ, వాళ్లకి కాపలాలు కాయడానికే చాలకపోతండే!"

"నర్సిమ్మూల్నీ, కిట్టయ్యనీ ఎం.ఎల్.ఏ. ఇంటికి పంపించారు కదా సార్?"

"అదే నేను చెప్పేది. మన ఎం.ఎల్.ఏ.కి ఎలక్షన్స్‌లో పార్టీ టిక్కెట్టు కూడా తెచ్చుకోను






చేతకాలేదు! అలాంటివాడి చుట్టూ కూడా పదిమంది కానిస్టేబుళ్లు కాపలా ఉండాలి! రేపు పవర్‌పోయిన తరువాత ఏం చేస్తాడు వీడు?"

"అవును సార్. చేతిలో మంది బలం, డబ్బు బలం ఉందని ఎగస్పార్టీ వాళ్ల తలలు తీస్తారు. మళ్లీ వాళ్లు వీళ్లని లేపకుండా వాళ్లచుట్టూ, వాళ్ల ఇళ్లచుట్టూ, వాళ్ల పడగ్గదుల చుట్టూ మనం కాపలాలు కాయాలి!"

"అలాగే ఉంది!"

"సరే సార్... మీరు డైరెక్ట్‌గానే ఎలక్షన్లలో గుర్నాధానికి సపోర్ట్ చేస్తున్నారు. పై ఆఫీసర్ల కి తెలిస్తే డేంజరుగదా సార్!"

"భలేవాడివయ్యా... పై ఆఫీసర్లు కూడా వాళ్లకి నచ్చినవాళ్లకి సపోర్ట్ చేయడంలేదా డైరెక్ట్‌గానే! మనకి పై అధికారి ఎవరు?"

"ఎస్పీ''

"జిల్లాలో కాదయ్యా! రాష్ట్రంలో మనకి పై అధికారి ఎవరు?"

"డీజీపి''

"అలాంటి డీజీపినే డైరెక్టుగా ఒక పార్టీని సపోర్ట్ చేస్తాడు. నేను రెండు ఎలక్షన్స్‌లో చూశా. ఏ డీజీపి ఉన్నా అధికారంలో ఉన్న పార్టీని సపోర్ట్ చేయాల్సిందే! అనుమానం కూడా లేకుండా పబ్లిక్‌గానే పబ్లిసిటీ దగ్గ ర్నించి ప్రచారం వరకూ అన్నీ చేస్తారు. అసలు మొన్న సీట్లు ఇచ్చేటప్పుడు డీజీపి సిఫార్స్‌తో మూడు నాలుగు సీట్లు కూడా ఇచ్చారు''

"నిజంగానా సార్?"

"మరేమిటనుకున్నావయ్యా? మనం మా త్రం ఓటర్స్‌మి కాదా? మనకిమాత్రం పార్టీ లూ, అభిప్రాయాలూ ఉండవా?"

"మరి ఎలక్షన్స్‌లో ఒక అభ్యర్థిని సపోర్ట్ చేస్తున్నాడని కలికిరి ఎస్.ఐ.ని సస్పెండ్ చేశారు కదా సార్?"

"అతను ఎవరికి సపోర్ట్ చేస్తున్నాడనుకున్నావు? అపోజిషన్ కేండిడేటుకి సపోర్ట్ చేస్తున్నాడు. పవర్ పార్టీ కేండిడేటొకి సపోర్ట్ చేస్తే సమస్యలేదు. కానీ అపోజిషన్‌వాడివైపు తిరిగితే సస్పెండ్‌చేయక ముద్దెట్టుకుంటారా?"

"అయితే మనకి ప్రాబ్లం ఏం లేనట్టేనా సార్?"

"ఏం ఉండదు. నీకెందుకు నువ్వూ, మన స్టాఫ్‌లో మిగతావాళ్లూ గుర్నాధానికి సపోర్ట్ చేయండి. వాళ్ల మనుషులు దొంగ ఓట్లు వేస్తున్నా, రిగ్గింగ్ చేస్తున్నా, ఇంకేం చేసినా చూసీ చూడనట్లు ఉండండి... చాలు. చేసిన పనికి ప్రతిఫలం తప్పకుండా ఉంటుంది''

"ఉంటుందంటారా సార్?" నసుగుతూ అడిగాడు కనకారావు.

"నీకు హెడ్‌గా ప్రమోషన్ వచ్చేమార్గం చూద్దాం"

"నిజంగానా సార్? పిల్లలు కలవాణ్ణి. మీరు ఆ పని చేశారా మీ మేలు మరచిపోను సార్. మీకు రుణపడి ఉంటాను సార్'

"చూద్దాం అన్నానుకదా! నీకు ప్రమోషన్ వచ్చేలా చేసే పూచీ నాది. మిగతావాళ్లకి కూడా నచ్చచెప్పి ఈ పని పూర్తిచేయి''

"అదెంతసేపు సార్. మిగతావాళ్లు కూడా గుర్నాధానికే సపోర్ట్ చేయాలని ఉన్నారు సార్'

"మనం గుర్నాధానికి సపోర్ట్ చేస్తున్నట్టు ఎవరికీ తెలియకూడదు. మనం ఎవరికీ గుర్నాధానికి ఓట్లు వేయమని కూడా చెప్పకూడదు. ఎలక్షన్లరోజు మనపని మనం చేయడమే!"

"అలాగే సార్... వస్తాను సార్ మరి నేను'' అని కనకారావు వెళ్లిపోయాడు.

★ ★ ★

ఎన్నికల శుభదినం రానేవచ్చింది.

ఒక పార్టీ గూండాకీ, మరోపార్టీ రౌడీకి సీట్లు ఇచ్చిందనీ, అభ్యర్థులు ఇద్దరూ ఇద్దరే అనీ మొదట్లో జనం కొంత అసంతృప్తి చెందారుగానీ చివరికి ఎన్నికలరోజు వచ్చేసరికి ఆ అసంతృప్తి కాస్తా ఆవిరైపోయింది.

కొన్ని పోలింగ్ బూతుల్లోమాత్రం సక్రమంగా ఎన్నికలు జరిగాయి. మిగతాచోట్ల ఎవరికి ఎక్కువ బలం ఉంటే వాళ్లు దౌర్జన్యంచేసీ, ప్రత్యర్థుల్ని ఆ సమీపంలోనికి రానివ్వకుండా స్వేచ్ఛగా ఓట్లు గుద్దుకున్నారు.

ఇద్దరికీ సమవుజ్జీ ఉన్న గ్రామాల్లో మాత్రం బాంబుల యుద్ధం జరిగింది.

పోలీసులుమాత్రం శక్తివంచన లేకుండా గుర్నాధానికి సహాయపడ్డారు.

ఒక ఊళ్లో రంగడి ముఠా తక్కువగా ఉంటే ఆ ఊళ్లో పోలీసులే రిగ్గింగ్ చేశారు. గుర్నాధం గుర్తుకి ఓట్లు హుషారుగా గుద్దారు.

బాంబుదాడుల్లో ఆ సాయంత్రానికి నియోజకవర్గంలో ఇద్దరు ప్రాణాలు విడిచారు.

ఆ నియోజకవర్గంలో మొత్తం ఒక లక్షా 65 వేలమంది ఓటర్లున్నారు. అందులో రెండు ప్రాణాలు అంటే పెద్ద లెక్కలోనివి కావుగదా!

ఈ జనస్వామ్యంలో ఎన్నికలు జరగడం ఎంత సహజమో జనం ప్రాణాలు పోవడం కూడా అంతే సహజం.

ఎన్నికల్లో గుర్నాధం 423 ఓట్ల మెజారిటీతో ఎట్టకేలకు బతికి బయటపడ్డాడు.

విజయోత్సాహాన్ని గుర్నాధం అనుచరులతోపాటు పోలీసులు కూడా పార్టీ చేసుకుని అనుభవించారు.

బహిరంగసభలో...

"ఎన్నికల్లో గెలవడానికి ఎదుటిపక్షమోళ్లు బాంబులు యిసిరారు.... రిగ్గింగ్ చేశారు.... ఓట్లు కొన్నారు... సారాయిలు తాపించారు... నానా రకాల చెడ్డపనులూ చేశారు. అయినా





జనం మనపక్కన ఉన్నారు. మనం గెలిచాము. వాళ్లు అక్రమాలు చేస్తుంటే పోలీస్‌వాళ్లు సక్రమంగా ఎదుర్కొన్నారు. ఇందుకు పోలీసుల్ని కూడా,నేను అభినందిస్తున్నాను. వాళ్లకి కూడా దండాలు చెప్తున్నాను'' అని విజయోత్సవ బహిరంగ సభలో ఎం.ఎల్.ఏ. గుర్నాధం పోలీసుల్ని ప్రశంసించాడు.

★ ★ ★

అర్జునుడి మృతిమీద ప్రభుత్వం నియమించిన న్యాయ విచారణా సంఘం తాపీగా తన పని ప్రారంభించింది. జిల్లా కేంద్రంలో ఉన్న ప్రభుత్వ అతిధి గృహంలో తన కార్యాలయం ప్రారంభించింది.

ఫలానా తేదీన విచారణ జరుపుతున్నామనీ, సాక్షులు తమ సాక్ష్యాల్ని కమీషన్ ముందు వినిపించవచ్చని పత్రికల్లో ప్రకటనలు ఇచ్చింది.

ఫణిగిరిలోనూ, గంగన్నపాలెంలోనూ ప్రజానీకానికి తెలియడానికి దండోరా వేయించింది.

కమీషన్‌ముందు అర్జునుడి తరపున సాక్ష్యం చెప్పడానికి హక్కుల సంఘం నాయకులూ, విలేఖరి కళాధర్ మాత్రమే హాజరయ్యారు.

ఆ కార్యాలయం చుట్టూ పోలీసులు భారీ ఎత్తున మొహరించి ఉన్నారు.

ఫణిగిరిలో నిరంజన్‌కానీ, ఆయనవర్గంకానీ ఎవరూ సాక్ష్యం చెప్పడానికి కమీషన్ ఎదుటకు రాలేదు. నిరంజన్ ఎం.ఎల్.ఏ.గా ఎన్నికయ్యాడు.

నిజానికి కిషోర్ ఫణిగిరిలో ఉండటమే నిరంజన్ వాళ్లకి సమస్య. కిషోర్ బదిలీ అయిపోయాడు. వాళ్ల సమస్య పరిష్కారమై పోయింది. ఆయన పని తీరింది.

గంగన్నపాలెం హరిజనులు కమీషన్ ముందు సాక్ష్యం చెప్పడానికి సిద్ధమయ్యారు. మరుసటిరోజు జరిగే విచారణకు వెళ్దాం అనుకుంటుండగా ఆరోజు రాత్రి వ్యానులో పోలీసులు గంగన్నపాలెంలో దిగారు.

హరిజనవాడలో ఉన్న అందర్నీ ఒకచోట సమావేశపరిచారు.

"అర్జునుడి చావుమీద రేపు జరిగే విచారణకు మీ పల్లెలో జనం పోవాలనుకుంటున్నట్లు తెలిసింది. ఇది మంచిపని కాదు. రేపు అక్కడ కాల్పులు కూడా జరగవచ్చు. మీ ఇష్టం. తరువాత మీరు లబోదిబోమని ఏడ్చి ప్రయోజనం లేదు. మా మాటని కాదని రేపు ఎవరైనా అక్కడికి వచ్చారో అర్జునుడికి ఏ గతి పట్టిందో వాళ్లకీ అదే గతి పడుతుంది''

"ఏందండీ మీరు మాట్లాడేది? మమ్మల్ని కూడా చంపుతారా ఏంది?" అని ఒక కుర్రవాడు పోలీసుల్ని అడిగాడు.

అంతే... ఆ కుర్రవాణ్ణి అందరిముందే పోలీసులు చితక్కొట్టారు.

"భాడ్కోవ్... మాకు ఎదురు చెపుతావురా నువ్వు? అసలు నువ్వు చూడబోతే నక్సలైటు మాదిరిగా ఉన్నావు. నిన్ను ఇప్పుడు కాల్చి చంపుతాం. మమ్మల్ని ఎవడు ఏం చేస్తాడు? పోలీసులతో పెట్టుకుంటావురా నువ్వు? పిల్లకాకికి ఏం తెల్సురా ఉండేలు దెబ్బ? పోలీసులు అంటే ఏం అనుకున్నావురా? మాకు ఎదురు చెపుతావు?" అని ఐదారుగురు కానిస్టేబుళ్లు అతనిని విపరీతంగా కొట్టారు.

"ఊరుకోండి సారూ... ఊరుకోండి. వాడికి తెలీదు. పసోడు... ఇంకా మీసాలూ గడ్డాలూ కూడా రాలేదు వాడికి, తెలియదు'' అని కొంతమంది పెద్దవాళ్లు పోలీసుల కాళ్లావేళ్లా పడి అతనిని విడిపించారు.

"మళ్లీ చెపుతన్నాం. ఎవరైనా సాక్ష్యం చెప్పడానికి వచ్చారో వాళ్లకి చావు దగ్గరకి వచ్చినట్లే'' అని పోలీసులు ఆ హరిజనుల్ని బెదిరించారు.

సాక్ష్యం చెప్పటానికి వెళ్లాలి అనుకున్నవాళ్లు కూడా పోలీసుల బెదిరింపుకి భయపడి

మానుకున్నారు.

"చచ్చిపోయినోడు ఎలాగూ రాడు! మనం పోయి సాక్ష్యం చెబితే ఏం వొరిగింది? పోయినవాణ్ణి తీసుకొస్తామా? వాడితోపాటు మనం కూడా ఎందుకు చావాలి?" అనుకున్నారు ఆ హరిజనులూ, అర్జునుడి కుటుంబంలోని వాళ్లూ!

విచారణాసంఘం న్యాయాధికారి హక్కుల సంఘం నాయకులనించి సాక్ష్యాల్ని సేకరించాడు. విలేకరి కళాధర్ సాక్ష్యం కూడా విన్నాడు. వీళ్లని రకరకాలుగా క్రాస్ ఎగ్జామిన్ చేశాడు. ఎదురు ప్రశ్నలు వేశాడు.

కమీషన్ముందు పోలీసులు కూడా సాక్ష్యాలు చెప్పారు. పోలీసులు సాక్ష్యం చెపుతుంటే ఎలాంటి ఎదురు ప్రశ్నలూ వేయకుండా శ్రద్ధగా విన్నాడు.

ఇన్నేళ్లూ నెలనెలా కొన్ని వేల రూపాయల జీతం ప్రభుత్వంనుంచి పుచ్చుకున్న సదరు మాజీ న్యాయమూర్తి చాలామంది సాక్షుల నుంచి సమాచారం సేకరించిన అనంతరం నిష్పాక్షికమైన తన నూట అరవైమూడు పేజీల నివేదికలో అర్జునుడి మృతిలో పోలీసుల ప్రమేయం ఏమీ లేదని వెల్లడించారు. అర్జునుడు మాదకద్రవ్యం ఎక్కువగా సేవించిన ఫలితంగానే మృతి చెందాడని నిర్ధారించారు. పోలీసులు నిర్దోషులని తెలిపారు.

పోలీసులు ఒక పొరపాటు పని చేశారని కూడా ఆయన తన నివేదికలో వేలెత్తి చూపెట్టారు. అర్జునుడు తాగి బజారులో న్యూసెన్స్ చేసినమాట వాస్తవమేనని ధృవీకరిస్తూ, పోలీసులు అతనిని స్టేషన్కు తీసుకుపోవడం పొరపాటు అనీ, సంఘటనా స్థలంనుంచి నేరుగా హాస్పిటల్కు తీసుకుపోయినట్లయితే బాగుండేదనీ ఆయన అభిప్రాయపడ్డారు. అప్పుడు పోలీసులమీద ఇలాంటి ఆరోపణ కూడా వచ్చి ఉండేది కాదని ఆయన తెలిపారు.

"నిజానికి న్యాయ విచారణా సంఘాలు అన్నీ దాదాపు అన్యాయ విచారణా సంఘాలే! ఈ సంఘాలూ, ఈ కమీషన్లూ ఇవి అన్నీ అన్యాయం తరఫునే వకాల్తా పుచ్చుకుని తమ నివేదికల్ని రూపొందిస్తాయి. నేతిబీరకాయలో నేయి ఎంత ఉంటుందో ఈ న్యాయ విచారణా సంఘాల్లో న్యాయం అంతే ఉంటుంది!" సాక్ష్యం చెప్పడానికి వచ్చినరోజే కళాధర్తో హక్కుల సంఘం జిల్లా శాఖ అధ్యక్షుడు ఆ మాటలు అన్నాడు.

"మరి ఎందుకు సార్ మీ హక్కుల సంఘంవాళ్లు న్యాయ విచారణకోసం డిమాండ్ చేయడం, మీరు ఇప్పుడు సాక్ష్యం చెప్పడం?" అని కళాధర్ ప్రశ్నించాడు.

"పోలీసుల దుర్మార్గాల్ని ప్రజల దృష్టికి తీసుకెళ్లడానికీ, పోలీస్ వ్యవస్థ నగ్న స్వరూపాన్ని బట్టబయలు చేయడానికీ న్యాయవిచారణకోసం డిమాండ్ చేస్తాం. అంతేకానీ ఈ సంఘంవలన న్యాయం జరుగుతుందనీ, ఈ సంఘం ఏదో ఉద్ధరిస్తుందనీ మాకు ఏమాత్రం భ్రమలు లేవు'' అన్నాడు ఆయన.

కమీషన్ నివేదిక వచ్చిన తరువాత అది చదివిన కళాధర్ ఆశ్చర్యపోయాడు. హక్కుల సంఘం నాయకుడు చెప్పినట్లే నివేదిక వుండటంతో దిగ్భ్రమ చెందాడు.

తాము చేసిన ప్రయత్నం, తాము చేసిన కృషీ, తాము చేసిన ఉద్యమం, తాము చేసిన చాకిరీ అంతా వ్యర్థం అయిపోయినందుకు నిరుత్సాహపడిపోయాడు. హంతకుడు కిషోర్ నిర్దోషిగా క్లీన్ షీట్ పొందడమేగాక ప్రమోషన్కోసం కూడా ప్రయత్నిస్తున్నాడని తెలుసుకుని బాధపడ్డాడు.

"ప్రమోషన్ వచ్చి సి.ఐ. అయితే ఇంకెన్ని ఘోరాలూ, దౌర్జన్యాలూ చేస్తాడో! ఇంకెంత దుర్మార్గంగా ప్రవర్తిస్తాడో!" అనుకున్నాడు కళాధర్.

ఈ కమీషన్ పుణ్యమా అని ఎస్.ఐ. కిషోర్కి చాలా డబ్బు వదిలింది. కమీషన్నీ, తన పై అధికారుల్నీ తృప్తిపరచడానికి చాలా





మూల్యం చెల్లించాల్సి వచ్చింది.

పట్టణంలో ఉన్న రెండు ఖరీదైన ఇళ్ల స్థలాల్ని అమ్ముకున్నాడు. భార్య వనజ వంటిమీద ఉన్న బంగారం కూడా అమ్ముకోవాల్సి వచ్చింది.

"మీరు చేయించిన నగలు తీసుకొండి. అంతేకానీ మా అమ్మానాన్నా చేయించిన బంగారం ఇవ్వను. అవి వాళ్లు ఎంతో కష్టపడి, సరిగా తిండి కూడా తినకుండా మిగిల్చి నాకోసం చేయించిన సొమ్ములు. ఇవి తీసుకుపోయి ఎవడికో లంచం ఇస్తానంటే ఎలాగ?"

"మీ అమ్మా నాన్నా చేయిస్తే చేయించార్లే. ముందు మనకి జాబ్ నిలబడాలి. ఈ కేసు పోయి ప్రమోషన్ వస్తే ఇంతకు నాలుగు రెట్లుకాదు, నలభై రెట్లు సంపాదించుకోవచ్చు"

"మీరు సంపాయించనూవద్దూ, నా బంగారం తీసుకోనూవద్దూ! జీతంమీద సంపాయించాలికానీ, ఎవరి నోరో కొట్టి సంపాయించాలనుకోవడం గౌరవప్రదమా?"

"పిచ్చిపిచ్చిగా మాట్లాడవాకు. ముందు నువ్వు కాపురం చేయాలనుకుంటే నోర్మూసుకుని ఆ బంగారం అంతా ఇవ్వు. అసలు జాబ్ పోయిన తరువాత నేను ఎందుకు పనికివస్తాను? నాకు గౌరవం ఏం ఉంటుందీ, విలువ ఏం ఉంటుందీ? రిపోర్టు మనకి వ్యతిరేకంగా వస్తే గవర్నమెంట్ కోర్టులో కేసు వేస్తుంది. మన ఖర్మ కాలి తిక్క జడ్జి వస్తే కటకటాలు కూడా లెక్కపెట్టుకోవాలి! అంతపని ఎందుకు? మొక్క సమయంలోనే కొట్టిపారేస్తే ఏ బాధా ఉండదు. మానైపోయిన తరువాత కొట్టాలంటే చాలా కష్టం అవుతుంది. ఇప్పుడు కమీషన్ రిపోర్ట్ సమయంలోనే జాగ్రత్తపడితే ఎంతో మేలు! తరువాత ఏ సమస్యా ఉండదు!" అన్నాడు కిషోర్.

"రెండు ప్లాట్లు లక్షన్నరకి అమ్మేరుకదండీ! మీరు చేయించిన 10 సవర్ల బంగారం కూడా అమ్ముకోడానికి తీసుకున్నారు. ఇంకా ఎంతకావాలి ఏమిటి?"

"ముసలి జడ్జిగాడు పీకుడుగాడు. ఎంత తీసుకుపోయినా ఇంకా తీసుకురా అనేమాటే నంట! ఇదంతా మాట్లాడటం మధ్యవర్తిగా ఉన్న ఎం.ఎల్.ఏ. గుర్నాధం! మధ్యలో వీడు ఏమైనా తింటున్నాడేమో మనకేం తెలుసు? వాడు అడిగినంత, వీడు చెప్పినంత ఇవ్వాలి కదా!"

"మరి మీ పై ఆఫీసర్లకి ఎందుకు లంచాలు?"

"డిపార్ట్‌మెంట్ సైడ్‌నించి మనకి సపోర్ట్ ఉండాలంటే వాళ్ల మేత వాళ్లకి పడాలి. డిపార్ట్‌మెంట్ అండ లేకపోతే చాలా కష్టం. జడ్జి కూడా లెక్కచేయడు. చచ్చినవాడి తరపు వాళ్లు సాక్ష్యం చెప్పడానికి రాకుండా చేయడానికికానీ, డిపార్ట్‌మెంట్ సైడ్‌నుంచి మనకి గట్టి సాక్ష్యం చెప్పడానికి కానీ పై అధికార్ల అండ ఉండాలి. లంచంగా కాకపోయినా, ఏదో ప్రజంటేషన్స్ రూపంలో వాళ్లకి ఇవ్వాలి ఇప్పుడు'' అన్నాడు కిషోర్.

"మీ దగ్గర ఉన్న డబ్బు ఇచ్చి, ఇంకా నా దగ్గర లేవు అని చెప్పండి. ఎం.ఎల్.ఏ. గుర్నాధమే ఎలాగోలా తంటాలు పడి నచ్చ చెపుతాడు''

"ఆ గుర్నాధమే ఇప్పుడు డబ్బు తీసుకురమ్మని కూర్చుంది. వాళ్లకి సగం ఇచ్చి వీడే సగం తింటున్నాడని నా అనుమానం. సరే, ఈసారికి నీ బంగారం ఇవ్వు. ఎంత... రెండు నెలల్లో నా ప్రతాపం చూపెట్టనూ? ఇంతకు ఇంత సంపాయించనా? మన వంటి మీద డ్రెస్ ఉన్నంతకాలం దిగులూ, విచారమూ ఎందుకు?"

మొదట్లో ఇవ్వడానికి నిరాకరించిన వనజకి చివరికి వంటిమీద ఉన్న బంగారం వలిచి ఇవ్వక తప్పలేదు.

గట్టిగా ఇవ్వనంటే కొట్లాట! తగాదా!

మీదపడి బాధగలడు! పిల్లల ముందూ, చుట్టు పక్కల ఇళ్లవాళ్లముందూ ఎంత అసహ్యాం! అలిగి, మూడు నెలలకో మారు పుట్టింటికి పోవడం, మళ్లీ తను వచ్చి బతిమలాడి, భంగపడి తెచ్చుకోవడం!

ఛీ... ఏం కాపురం... ఏం సంసారం... సంస్కారం లేని మనిషితో సంసారం చేయడమంటే ఇలాగే ఉంటుంది కాబోలు!

వనజ మనసులో బాగా చీదరించుకుంది. చిరాకుపడిపోయింది. పోనీ... వెధవ బంగారం... ఉండి ఏం ఉద్ధరించింది! ఎలా గోలా చావనీ... అనుకుని బంగారం ఇచ్చింది.

"నువ్వేం ఏడవకు. నీ బంగారం నెలరోజుల్లో నీది నీకు తెచ్చిస్తా!" వనజ బాధతో బంగారం ఇస్తుండగా పరుషంగా అన్నాడు కిషోర్.

"నాకేం అవసరం ఏడవడానికి? ఆ ఏడ్చేదేదో నువ్వే ఏడువ్, ఉద్యోగం ఉంటుందో, ఊడుతుందో అని భయంతో..." సీరియస్‌గా అంది వనజ.

ఆ మాటతో పౌరుషం ముంచుకువచ్చిన కిషోర్ ఆమెని కొట్టడానికి లేచాడు కానీ, మళ్లీ ఎందుకో సందేహించి ఆగిపోయాడు.

ఈ న్యాయవిచారణ కారణంగా కిషోర్‌కి కూడబెట్టుకున్న డబ్బూ, ఇండ్ల ప్లాట్లూ, ఉన్న బంగారం అన్నీ రుణం తీరిపోయాయి. అవి ఎలా వచ్చాయో అలానే, వచ్చిన దారినేపోయాయి.

★ ★ ★

వనజ ఊళ్లో లేదు. వాళ్ల బాబాయి కూతురు పెళ్లి అయితే పిల్లల్ని తీసుకుని స్వంత ఊరుకి వెళ్లింది.

కిషోర్ పెందలాడే ఇంటికి వచ్చాడు. ఆరోజు పెద్దగా కేసులు లేవు. స్నానం చేశాడు. ఎం.ఎల్.ఏ. గుర్నాథం ఇంటికి వెళ్లాల్సిన విషయం గుర్తొచ్చింది... బయల్దేరాడు.

"రావోయ్ రా... కూర్చో... మొత్తానికి నీకు అనుకూలంగా నివేదిక ధ్రాయించుకున్నావు. ఘటికుడివేనయ్యా నువ్వు!" అని కిషోర్‌ని ఆహ్వానించాడు ఎం.ఎల్.ఏ. గుర్నాథం.

"ఏం నివేదికో సార్... నిజానికి మాకు ఏం తెలియదు. అయినాసరే గవర్నమెంట్ కమీషన్‌ని వేసింది. ఇరుక్కున్న తరువాత బయట పడక తప్పదుగదా? కోర్టుకి వెళ్లి ఓడిపోయి ఒకడు ఏడిస్తే గెలిచి మరొకడు ఏడ్చాడంట! అలా వుంది నా పని!"

"డబ్బు వదిల్తే వదిలిందిలే. ఉజ్జోగం నిలబడిందికదా! నెమ్మదిగా సంపాయించుకోవచ్చు లేవయ్యా!"

"సంపాదనది ఏముంది సార్... సరేకానీ, నా పని ఏం చేశారు?"

"ఏం పనీ... ఓ... అదా... నీ ప్రమోషన్ విషయమా? మొన్న నేను వెళ్లినప్పుడు హోం మినిస్టర్ హైద్రాబాద్‌లో లేడయ్యా! నక్సలైట్ల సమస్యమీద చర్చించడానికి నాలుగు రాష్ట్రాల హోం మంత్రుల సమావేశానికి భోపాల్ వెళ్లాడు. అటునుంచి అటు ఢిల్లీ ట్రిప్పు పెట్టుకున్నాడట! ఫ్యామిలీతో వెళ్లాడులే అన్నీ చూసి రావడానికి కాబోలు! నేను మళ్లీ రెండు రోజుల్లో హైదరాబాద్ వెళతాగదా! అప్పటికి వస్తాడు. మాట్లాడదాంలే..." అన్నాడు గుర్నాథం.

"మీరు గట్టిగా చెయ్యాలి సార్. ఎప్పుడో రావాల్సిన ప్రమోషన్. అసలు అన్ని విషయాల్లో మన కులపోళ్లని అణగదొక్కుతున్నారు. సీనియారిటీ లిస్ట్‌లో నాకంటే వెనుక ఉన్నవాడిక్కూడా ప్రమోషన్ వచ్చే, నాకేమో రాకపోయే!"

"ఈసారి వెళ్తే నీ పని గట్టిగా చేస్తానోయ్. సరేకానీ ఆ మర్రిదిన్నె కేసు విషయం ఏం చేశావు?"

"ఆ రేప్ కేసా సార్... మీరు చెప్పారు కదా సార్! మీరు చెప్పినట్లే ఇద్దరికీ రాజీ చేసి




వాణ్ణి వదిలిపెట్టాను సార్'

"మంచిపని చేశావు. అయితే రాజీకి వాళ్లు అంత తేలిగ్గా ఒప్పుకున్నారా అని?"

"కాదూ కూడదన్నారు సార్. కేసు పెట్టాల్సిందే, వాణ్ణి జెయిల్లో వేయించాల్సిందే అని కొందరు మొండిపట్టు పట్టారు. కేసు అంటే సామాన్యం అనుకున్నారా, పోలీసులూ, కోర్టులూ, ప్లీడర్లూ, సాక్ష్యాలూ... చాలా తుప్పు వదిలిద్దీ. వాడు ఎన్నిసార్లు తిరుగుతాడో, వాడితోపాటు మీరు కూడా అన్నిసార్లు తిరగాల్రా అని బెదిరించా సార్. కేసు పెడితే రేప్ చేసినప్పటికంటే ఎక్కువ సిగ్గుపోయేలా గుచ్చి గుచ్చి ప్రశ్నలు అడుగుతార్రా నాయనా! అది పెద్ద రేప్ అవుతుంది అన్నాను సార్. అదీగాక ఏళ్ల తరబడీ కేసు ఎటూ తెగదు అని వాళ్లని నయానా భయానా ఒప్పించేసరికి తలకాయ వాచిపోయిందంటే నమ్మండి సార్!"

"తెలిసీ తెలియనివాడు... కుర్రవెధవ... ఏదో ఆవేశంలో చేశాడు. దానికి పెద్ద రభస చేశారు. ప్రతిదానికీ రాజకీయాలు ఒకటి ఏడ్చాయికదా పల్లెల్లో కూడా! వీడు మన గ్రూపువాడు. రేప్ చేసింది ఎగస్పార్టీవాళ్ళ పిల్లని. ఇక ఎక్కడికక్కడ గ్రూపులు బయలు దేరటం, ముఠాలు కట్టుకోవటం! మన ముఠా వాళ్లు నా దగ్గరికి వచ్చి రాజీచెయ్యమన్నారు. ఎగస్పార్టీ ముఠా దగ్గరకి నేను రాజీకి ఎందుకుపోతానూ, ఏమని పోతాను? వాడ్ని పట్టుకుని మీకు అప్పగిస్తిరి. ఎటోకటు తప్పించుకుని పోరా నాయనా, కేసు విషయం నేను చూసుకుంటాను అని వాడికి చెప్పటానికి వాడు ముందే చిక్కి కూర్చున్నాడాయె!" అన్నాడు గుర్నాథం.

"గాడిదకొడుకు... బాగా పొగురుమీద వున్నాడు సార్. మా పోలీసుల్ని కూడా లెక్క చేసేటట్టు లేడు. లాకప్‌లో పడేసి నాలుగు తన్నేసరికి దారికి వచ్చాడు''

"ఆ వూళ్ళో మనకి గట్టి మనుషులు వీళ్లే. మనం అంటే ప్రాణం ఇచ్చేటంత వెర్రి వాళ్ళకి''

"ఎంఎల్ఏ మా మనిషి. నా వంటిమీద దెబ్బపడితే మీ వుద్యోగాలు వూడపీకిస్తాడు. ఏమనుకున్నారో అని మా కానిస్టేబుళ్లని బెదిరించాడంట సార్. మీ ఎంఎల్ఏ అయితే నిన్ను రేప్ చేయమన్నాడ్రా అని వాళ్లూ నాలుగు తగిలించారు''

"సరే ఎలాగోలా సర్దిపుచ్చారుకదా! కేసూ, అరెస్ట్ చేయడం, బెయిల్ తీసుకోవడం, వాళ్లు నా చుట్టూ తిరగడం ఈ తిప్పలేమీ లేకుండా సమసిపోయేటట్లు చేశారు చాలు. అసలు వీడు రేప్ చేసింది పతివ్రతనేం కాదు, పెళ్ళయి మొగుడు విడిచిపెడితే మూలన పడివున్న దాన్ని ఈ వెధవ గోల చేశాడు. దానికి వాళ్ళ రగడ! ఊళ్లో ఏమైనా గొడవ జరుగుతుందేమొ... వాడ్ని కొట్టడం కానీ''

"అదేం జరగదు సార్. ఊళ్ళో ఏమైనా గొడవ జరిగితే అందర్నీ లాకప్‌లో తోసి వారంరోజులు కూడూ, నీళ్ళూ ఇవ్వకుండా మాడుస్తానని వార్నింగ్ ఇచ్చా''

"ఉండదగ్గవాడివేనయ్యా నువ్వు..." అని కిషోర్ భుజంమీద మెచ్చుకోలుగా తట్టి "సరే పద. టైం అయింది. పోదాం" అని గుర్నాథం లేచాడు.

గుర్నాథం, ఆయన అనుచరుడూ, ఎంఎల్ఏతో పనిమీద వచ్చిన కంట్రాక్టరూ, కిషోరూ కలిసి కారులో బయలుదేరారు.

కారు బార్ అండ్ రెస్టారెంట్ ముందు ఆగింది.

అది ఆ పట్టణం మొత్తంమీద ఖరీదైన బారు. పెద్దలూ, గౌరవనీయులూ, మర్యాదస్తులూ ఆ బార్‌కే వస్తూంటారు.

ముందు గుర్నాథం కారుదిగి లోనికి దారితీశాడు. ముగ్గురూ అనుసరించారు.

అందరూ ఒక టేబుల్ చుట్టూ కూర్చున్నారు. తాగడం మొదలుపెట్టారు. రాత్రి 11

గంటలవరకూ అదేపని. తాగారు. తిన్నారు. మహాసరదాగా, సంతోషంగా, గొప్పగా మాట్లాడుకున్నారు, నవ్వుకున్నారు, పొగుడుకున్నారు. లేచారు.

"వస్తామోయ్ కిషోర్... చాలా టైం అయిపోయింది. నువ్వు రిక్షాలో వెళ్లు. అవతల అర్జంట్ పని వుంది'' అని గుర్నాధం, ఆయన అనుచరుడూ, కంట్రాక్టరూ కారులో వెళ్ళిపోయారు.

కిషోర్ తూలుతూ బయటకు వచ్చాడు. అక్కడ రెండు మూడు రిక్షాలు నిలబెట్టి వున్నాయి. కిషోర్‌ని చూసి ఆ రిక్షా వ్యక్తులు గతుక్కుమన్నారు.

"ఇదేంట్రా బాబూ, వీడు దాపురించాడు. ఇప్పుడు వీడ్ని ఇంటి దగ్గర తగలేసి రావాలి. ఈ సెంటర్‌కి రాకపోయినా బాగుండేది'' అనుకున్నారు ఆ రిక్షావాళ్లు.

"రేయ్... ఇలా రండ్రా... ఈ టైంలో ఇక్కడ ఏం చేస్తున్నార్రా మీరు..." అన్నాడు. తూలుకుంటూ వచ్చి ఒక రిక్షాలో కూర్చున్నాడు. "పోనీయరా..."

ఆ రిక్షా అతను మనసులో విసుక్కుంటూ రిక్షా లాగాడు.

ఇంటి దగ్గిర వనజ లేదు. ఇప్పుడు ఇంటికి వెళ్ళడం అనవసరం.

"రేయ్... సుబ్బమ్మ కంపెనీకి పోనీయరా'' కొంత దూరం వచ్చిన తరవాత అన్నాడు.

"అదిగో... అటువైపు సందు వుందికదా... ఆ సందులోనికి పోనిస్తే వస్తుందిరా దాని మేడ"

ఆ సందులోనికి కొంత దూరం పోయిన తరవాత ఒక చిన్న మేడముందు ఆపమన్నాడు రిక్షాని.

కిషోర్ రిక్షా దిగి లోనికి వెళ్ళాడు.

చిన్నహాలు. ఆ హాలులో ఉయ్యాల బల్ల మీద కూర్చుని ఒకామె తమలపాకులూ, పొగాకూ, వక్కా కలిపి పెనవేసుకుని నములుతూ వుంది.

ఆమె సుబ్బమ్మ. 58 ఏళ్ళుంటాయి.

"బాగున్నావా ముసిల్దానా?"

"మీరూ..."

"నేను ఎస్ఐ కిషోర్‌ని. గుర్తు పట్టలా? ఇంతకుముందు కూడా ఒకసారి వచ్చానుకదా? ఈ నెల మామూలు స్టేషన్‌కి పంపించావా?"

"అయ్యో... పంపించాను నాయనా. మామూలు పంపించి వారంరోజులు అయింది''

"అయితే బిజినెస్సు బాగనడుస్తున్నదా?"

"ఏం నడవడం నాయనా? పెద్ద రాబడి ఏం వుండటంలేదు. నెలనెలా మీ పోలీస్ వాళ్ళకి మామూలూ, పండగ మామూలూ, పైకర్చులూ ఇవన్నీ పోతే చివరకి ఉత్త విస్తరీ, మంచినీళ్ళ మాదిరిగా వుంది మా పని''

"సరే... ఇంటి దగ్గర నా పెళ్ళాం లేదు. ఏం తోచుబాటుకాక ఇటుపడి వచ్చా. మంచి పిల్లలున్నారా?"

"లేకేం నాయనా... బంగారంలాంటి పిల్లలున్నారు. పిలవమంటావా?"

"పిలువు''

"ఒసేయ్... స్వప్నా, మంజూ, జలజా ఇలా రండే!"

ఒక గదిలోనించి ముగ్గురూ వచ్చారు. కిషోర్ వాళ్లని పరిశీలనగా చూశాడు.

"ప్చ్'' అని పెదవి విరిచాడు.

"వీళ్లు వద్దుకానీ, మొన్న నేను వచ్చినప్పుడు పంపించావు గుర్తుందా? శాంతి. దాన్ని పంపించు. వీళ్ళని చూస్తే ముసలివాళ్ళకి మేకప్ వేసినట్టు వుంది. అందమా చందమా? ఆ శాంతిని పిలువు. అది డిస్కో శాంతి, సిల్కుస్మితలను మించిపోతుంది. ఆ రాత్రి బాగా రంజుగా వుందనుకో..." అని




కిషోర్ ఇంకా తన బూతుపైత్యాన్ని వెళ్ళగక్కాడు.

"అయ్యో నాయనా... దానికి రోగం వచ్చి మంచం పాలయ్యింది"

"రోగమా? ఏం మాయరోగం వచ్చింది? కొంపతీసి ఎయిడ్స్‌లాంటి అంటురోగం ఏం తగులుకోలేదుకదా?"

"అయ్యో నాయనా... ఆ పసిదానికి ఎయిడ్స్‌లాంటి రోగమని ఎందుకు ఆశీర్వదిస్తావు నాయనా? వృత్తిలో వున్నవాళ్ళకి ఎప్పుడో ఒకప్పుడు అలాంటి రోగాలు వచ్చినా విచిత్రం ఏముంటుంది?"

"మరి ఏం రోగమే ముసిల్దానా దానికి?"

"ఎన్నిరకాల రోగాలు నాయనా... ఒకటా, అరా... ఆడవాళ్ళకి అరవైఆరు రకాల జబ్బులంట! దానికి నాలుగోనెల కడుపు. అయితే నిన్న పొద్దున పోయిందయ్యా! పాపం ఒకటే బాధతో మూలుగుతోందయ్యా"

"అలాగా... ఎక్కడుంది? చూసి వస్తా"

"ఎందుకులే నాయనా చూడటం? నిన్న అంతా ఆస్పత్రిలోనే వుంది. ఇయ్యాలే ఇంటికి తీసుకువచ్చింది. అసలు పెద్ద ప్రాణానికే ప్రమాదం వచ్చింది. చివరికి ఎలాగో గండం గడిచి గట్టెక్కిందనుకో"

"బాగా దెబ్బతిందన్నమాట! ఏ గదిలో వుంది. చూస్తా"

"వెనక షెడ్డులో వుంది. అక్కడ అంతా రోతరోతగా వుంటుంది. ఎందుకులే నాయనా నువ్వు అక్కడికి?"

"కాదు. చూడాలి" అని కిషోర్ రెండు అడుగులు వేశాడు.

"జలజా... అయ్యగారిని దాని దగ్గరకి తీసుకుపో"

డాబా వెనుకవైపున కొద్దిగా ఖాళీ స్థలం. అది దాటితే రేకులషెడ్డు. జలజ ముందూ, కిషోర్ వెనకా వెళ్ళారు.

కుక్కి మంచం. ఆ మంచంమీద శాంతి పడుకుని నిద్రలో మూలుగుతూ వుంది. ఆ గదిలో పనికిరాని తుక్కుసామాన్లు అన్నీ వేశారు. ఆ సామాన్లమధ్య కాస్తంత ఖాళీ జాగాలో చిన్న మంచంమీద పడుకుని వుంది.

శాంతికి 22 సంవత్సరాల వయస్సు. అయితే మనిషిలో వయసుని మించిన పెరుగుదల వుంది. ఆజానుబాహు విగ్రహం.

తెల్లటి తెలుపూ, పెద్ద పెద్ద కళ్ళూ, చక్కటి పలువరుసా, ఎప్పుడూ బాధల్లో కూడా చెదరని ఆకర్షించే చిరునవ్వూ!

బాగా పొడవైన వెంట్రుకలు. మోకాళ్లు తగలకపోయినా నడుము కిందకు వచ్చే వెంట్రుకలు. శాంతి కొబ్బరినూనె రాసుకునే సమయంలో సుబ్బమ్మ చూస్తే ఓర్వలేక అంటుంది.

"ఓసేయ్ శాంతీ... నీ సంపాదన నీ తలనూనెకి రాదే! ఎందుకే అంత పొడుగ్గా వెంట్రుకలు, కత్తిరించుకుంటే పోయేదానికి?" ఆ మాటలకు శాంతి నవ్వి మౌనంగా వుండేది.

డాక్టర్ ఇచ్చిన బిళ్ళలూ, గొట్టాలూ మింగి మగతగా పడుకుని గాఢనిద్రలోనికి జారుకునుంది శాంతి.

"పాపం నిద్రపోతున్నదండీ" అంది జలజ.

"అయితేం లేవగొట్టు"

"బాగాలేని మనిషి. పాపం నిద్రపోనివ్వండి"

"ఏయ్... నోర్మూసుకుని చెప్పినపని చేయి. లేకపోతే నువ్వుపో, నేను లేపుతా!" హుంకరిస్తూ అన్నాడు కిషోర్.

"శాంతీ... శాంతీ... లే... నిన్ను అయ్యగారు పిలుస్తున్నారు" అంటూ జలజ నిద్రపోతున్న శాంతిని తట్టి పిలిచింది.

ఎంతసేపు పిలిచినా శాంతికి మెలకువ రాలేదు. "ఆ... ఊ..." అని అటూ ఇటూ

కదలాడింది కానీ మెలకువ తెచ్చుకోలేదు.

"మంచి నిద్రలో వున్నదండీ... లేచేటట్లు లేదు''

అంతే. జలజ చెంపమీద చెళ్ళుమని కొట్టాడు.

"ఏమే... గట్టిగా తట్టి లేపితే లేవదా? నిద్రపోయేవాళ్లు ఇక లేవరా? చచ్చిపోయిందా ఇంక లేవకుండా వుండటానికి?" అని కిషోర్ ఆ కుక్కి మంచంమీద పడుకుని వున్న శాంతిని ఆనుకుని కూర్చున్నాడు.

"ఏయ్... నిన్నే... లేవే..." అన్నాడు గొంతు పెంచి.

శాంతి ఉలిక్కిపడి లేచి కూర్చుంది. నిద్రలో అర్థం కాలేదు. అయోమయంగా చూసింది.

మంచంమీద కూర్చున్న కిషోర్‌ని చూసి పామునో, పులినో చూసి భయపడిపోయినట్లు ఉలిక్కిపడింది. మంచంమీదనించి లేవడానికి ప్రయత్నించింది.

"పర్లేదు, పడుకో. లేచేది ఎందుకు?" అని లేవబోతున్న శాంతిని చేత్తో అదిమిపెట్టాడు

"ఎలా వుందే నీకు?" అడిగాడు.

శాంతికి ఏం చెప్పాలో అర్థం కాలేదు.

"నిన్నేనే... ఎలా వుంది ఇప్పుడు? హుషారుగా వుందా?" కిషోర్ నోటినించి వస్తున్న తాగుడు వాసనకి శాంతికి డోకు వచ్చినంత పనయింది.

"బాగలేదు. పొట్టలో నెప్పిగా వుంది''

"నువ్వెందుకే ఇంక ఇక్కడ. పో అవతలకి. ఆ తలుపు వేసిపో!" అని గదమాయించాడు.

జలజ వెళ్లి గోడ పక్కగా చాటున నిలబడింది.

"ఆరోజు రాత్రి స్వర్గం చూపెట్టావే! నా సర్వీసులో నేను ఏ వందమందితోనో కలిశా! అయితే నీ అంత సెక్సీగర్ల్‌ని ఇంతవరకూ చూళ్ళా!"

శాంతికి ఆరోజు రాత్రి గుర్తొచ్చింది. అసహ్యంతో శరీరం గగుర్పొడిచింది.

వృత్తిలో వున్నది తను! రకరకాల వ్యక్తులు వస్తుంటారు. విభిన్న మనస్తత్వాలు కలిగిన వాళ్లుంటారు. ఒక్కొక్కరు ఒక్కొరకంగా ప్రవర్తిస్తుంటారు. తను సర్దుకుపోతుంది.

ఆరోజు కిషోర్ వందరూపాయల కాగితం ఇచ్చాడు. డబ్బు ఇచ్చి వచ్చినవాళ్లకి వీలైనంత న్యాయం చేకూర్చాలనే తను చూస్తుంది. వాళ్లు అసంతృప్తితో వెళ్ళడం తనకి ఇష్టం వుండదు. వాళ్లు చెప్పినట్లు నడుచుకుంటేనే తృప్తిపడతారు. రెండోసారి వస్తారు. వృత్తిలో రాణించగలుగుతుంది. నాలుగు డబ్బులు వస్తాయి.

ఆ ఉద్దేశంతోనే అయిష్టంగానైనా కిషోర్ చెప్పినట్లే తను చేసింది. చాలా అసహ్యంగా, రాక్షసంగా ప్రవర్తించాడు. అవి తలుచుకుంటేనే చీదర కలుగుతోంది.

"ఇవ్వాళ చాలా ఆశతో వచ్చానే... నా సర్వస్వం నీకు ధారపోస్తా! నిన్ను నేను పెర్మనెంట్‌గా అట్టిపెట్టుకుంటా... ఇవ్వాళ ఒక్కరోజుకి నా కోర్కె తీర్చు... ప్లీజ్..."

"ఏమిటి మీరు మాట్లాడేది? నాకు అసలే రోగం వచ్చి ఏడుస్తుంటే! ఇక్కడనుంచి వెళ్ళిపొండి''

"ఇదిగో ఈ వంద రూపాయలూ తీసుకో. నీక్కావలసినవి కొనుక్కో... వంద చాలవా? ఇంకో వంద, ఇవిగో తీసుకో. నీకు ఎంత కావాలంటే అంత తీసుకో. ఒక్కసారి నా కోరిక తీర్చు. అసలు నిన్ను మరచిపోలేకపోతున్నానే... నా మనసంతా నీ మీదనే వుందే''

పడుకున్న శాంతిమీద పడి రెండు చేతుల్లో బంధించాడు.

శాంతికి భయం వేసింది.

"పెద్దమ్మా... పెద్దమ్మా... ఈయన చూ





డవే!" అని కిషోర్‌ని బలవంతంగా నెడుతూ పెద్దగా కేకలు వేసింది.

అప్పటికే జలజ వెళ్లి అందర్నీ పిలుచుకు వచ్చింది.

వాళ్లని చూసి కిషోర్ లేచి నిలబడ్డాడు.

"ఎందుకు వచ్చారు మీరు ఇక్కడికి? ఇక్కడనించి వెళ్లిపొండి''

"నువ్వు కూడా రా నాయనా... అమ్మాయికి బాగలేదు... బాగున్నప్పుడు నిన్ను కాదన్నదీ?"

"ముందు మీరు ఇక్కడనించి వెళ్లిపొండి. ఇవ్వాళ దానితో పోవాల్సిందే!"

"మీరు పెద్దవాళ్లు. పోలీసు అధికార్లు. మీరు ఇలా చేయడం బాగుంటుందా నాయనా? దానికి ఆరోగ్యం సరిగాలేదు. చావు బతుకుల్లో వున్న పిల్లని మీరు బలవంతం చేయడం ధర్మమా చెప్పండి'' సుబ్బమ్మ సౌమ్యంగా అంది.

"ఏందే ముసిల్దానా పేట్రేగి పోతున్నావు? నేను తలుచుకుంటే తెల్లారేపాటికి నువ్వూ వుండవు, నీ కంపెనీ వుండదు. అందర్నీ బొక్కలో తోసి ఏడు చెరువులనీళ్లు తాపిస్తా. ఏమనుకున్నావో!"

"పేదవాళ్లమి, కూటికి గతిలేని వాళ్లమి. పొట్ట జరగకనేకదా మేము ఈ నీచానికి పాల్పడటం! మీరు మా మీద కత్తిగడితే మేం ఏం చేస్తాం? వీళ్లలో నీకు కావాల్సిన దానితో వెళ్లమని చెప్పానుకదా! నీకు పుణ్యం వుంటుంది, బయటకు రా నాయనా... నీ కాళ్లకు దణ్ణం పెడతా..." వేడుకోలుగా కిషోర్ కాళ్లు పట్టుకోబోతూ, బతిమిలాడుతూ అంది సుబ్బమ్మ.

"ముందు మీరు బయటకు పొండి నేను వస్తా!"

"మాకు పెట్టి పోషిస్తున్నట్లు ఏందయ్యా నీ పెత్తనం? మాకు జరగక ఈ వృత్తికి దిగాం. మేం మా వళ్లు అమ్ముకుంటూ నెలనెలా మామూలు పేరుతో మా నెత్తురు కూడు మీ మొకాన పోస్తున్నాం. మీ పోలీసులు వచ్చినప్పుడు కాదనకుండా వళ్లప్పగిస్తన్నాం. పక్కన ఆ అమ్మాయికి బాగులేదంటే వినకపోతే యట్టా? మీరు మనుషులా, దున్నపోతులా?" కిషోర్ ప్రవర్తనకి బాగా కోపం వచ్చిన జలజ అంది.

"ఏందే మళ్లీ మాట్లాడు'' అని కిషోర్ విసురుగా వచ్చి జలజ చెంపమీద కొట్టాడు.

"ఏందయ్యో పోనీయిలే పోనీయిలే అని వూరుకుంటుంటే మీదికొచ్చి కొడతన్నావు. ఇందాక ఒకసారి కొట్టావు. మేమేమయినా నీ పెళ్లాలం అనుకున్నావా? అసేయ్ ఒసేయ్ అంటన్నావూ, కొడతన్నావూ! మర్యాద దక్కదు. నువ్వు పోలీసువి అయితే అయ్యావు. ఎంతవరకు వుండాలో అంతవరకూ వుంటే గౌరవంగా వుండిద్ది''

"గౌరవంగా వుండేదేందే? ఏం చేస్తావు. అహా, ఏం చేస్తావంట?"

"నువ్వేం చేస్తావు? మీకు గవర్నమెంట్ వుజ్జోగాలిచ్చింది దొంగలనించి జనాల్ని కాపాడమనికానీ, మీరే ఇట్ట తాగి ముండల దగ్గరకొచ్చి యదవ పనులు చేయమని కాదు''

"నేను యదవపనులు చేస్తన్నానా, అంటే యదవనా!" అని కిషోర్ కొట్టడానికి మళ్లీ దగ్గరకు వచ్చాడు.

"కొట్టు... ఎంతమాత్రం కొడతావో'' అని జలజ కాలిచెప్పు వూడతీసి సిద్ధమైంది, తనూ తిరగబడి కొట్టడానికి.

"ఏమే ముసిల్దానా... నువ్వు కంపెనీ వుంచదలుచుకున్నావా! ఎత్తేయదలుచుకున్నావా? ఆ లంజల్ని నామీద వుసిగొల్పుతావు! మీ అంతు చూడకపోతే నా పేరు కిషోరే కాదు! ఏమే నాకు చెప్పు చూపెడతావు'' అని కిషోర్ బూతులు తిట్టడం మొదలు పెట్టాడు.

"చెప్పు చూపెట్టడం కాదు. నువ్వు ఇంక

మాటలు మీరితే కొట్టి చూపెడతాం. పద్ధతిగా రానీయి మాటలు''

"ఏమిటీ.. నేను పద్ధతిగా మాట్లాడాలా? నాకు పద్ధతిని గురించి, నువ్వు చెప్పేదాని వంటే?" అని కిషోర్ వెళ్లి జలజ జుట్టు పట్టుకుని వంగతీశాడు.

జలజ అతని చేతిలోనించి జుట్టు వూడపీక్కుంటూ చేతిలోవున్న చెప్పుతీసుకుని చెంప మీద పొంగివచ్చేలా ఒక్కటిచ్చుకుంది.

కిషోర్ పట్టుకున్న జుట్టు వదలకపోవడంతో మిగిలినవాళ్లు కూడా చుట్టుముట్టారు.

మంజు అనే ఆమె నెత్తురు వచ్చేలా కిషోర్ చేయి కొరికింది. స్వప్న అనే ఆమె కూడా కిషోర్ వీపుమీద రెండు గుద్దులు గుద్దింది.

అతను లోపలికి వెళ్లాలని ప్రయత్నిస్తుంటే అందరూ కలిసి బలవంతంగా నెట్టుకుంటూ వీధిలోనికి తీసుకువచ్చారు.

వీళ్ల అరుపులకీ, తగాదాకీ అప్పటికే ఇళ్లలోనించి చాలామంది జనం వీధిలోనికి చేరారు.

"చూడండయ్యా... ఈ పోలీసు ఇన్స్పెక్టరు ఎంత గొడవ చేస్తున్నాడో! తాగి వచ్చి ఇంటిమీదపడి రభస చేస్తున్నాడు. కడుపుకి కూడు తింటన్నాడో, గడ్డి తింటన్నాడో చావు బతుకుల్లో వున్న పిల్ల కావాలని కూర్చున్నాడు. నోటికి ఎంతమాట వస్తే అంతమాట అంటన్నాడు. గవర్నమెంటు వీళ్లకి వుజ్జోగాలిచ్చింది ఇందుకేనా? అదేమంటే ఆడ ముండలమీద పడి కొట్టాడు. మీరైనా కాస్త బుద్ధి చెప్పి గడ్డిపెట్టండయ్యా!" బయట చేరిన జనంతో జలజ పెద్దగా ఏడుస్తూ చెప్పింది.

"ఏమయ్యా సిగ్గులేదూ... వ్యభిచారం నిర్మూలించాల్సిన మీ పోలీసులే వ్యభిచారం చేస్తున్నారు. ఈ సందులో వున్న నాలుగయిదు వ్యభిచారపు కొంపల్ని తీసేయించడయ్యా అంటే మా మాటని ఎవరు వింటారు? మీకు నెలనెలా గవర్నమెంటు జీతాలు ఇచ్చినట్లు, వీళ్లు కూడా జీతాలు ఇచ్చి పోషిస్తున్నారాయె!" అన్నాడు అక్కడ చేరిన జనంలో ఒక గృహస్తు.

"తిండికి జరిగో, జరక్కో ఏదో వాళ్ల తంటాలు వాళ్లు గుట్టుగా పడుతున్నారు. వాళ్లని కనీసం అలాగైనా బతకనివ్వండయ్యా! అమ్మ పెట్టగూ, అడుక్కు తిననివ్వదూ అని వాళ్లని సంస్కరించి, ఉపాధి చూపెట్టాల్సిందిపోయి, వాళ్లమీద దాడులు చేసి వాళ్లని అల్లరిపాలూ, నవ్వుల పాలూ చేస్తే ఎలా?" అన్నాడు కాస్తంత సంస్కర్త భావాలు కలిగిన ఒక కుర్రవాడు.

వీళ్లు ఎవరు ఏం మాట్లాడుతున్నా కిషోర్ వీళ్ల మాటలు వినకుండా మళ్ళీ లోపలికి వెళ్ళడానికే ప్రయత్నిస్తూ అడ్డంగా నిలబడిన వాళ్లని తోస్తున్నాడు.

"మళ్ళీ లోపలికి వెళ్తాడా ఏమిటీ? మీరు అడ్డు తొలగండి అమ్మాయి, లోపలికి వచ్చి ఏం చేస్తాడో చూద్దాం"

"వీడ్ని కట్టిపడెయ్యండ్రా. కట్టిపడేసి ఎస్పీసారుకి ఫోన్ చేద్దాం, మీ ఎస్ఐ గొడవ చేస్తున్నాడని! ఫోన్ చేద్దాం. డిపార్ట్‌మెంట్‌వాళ్ళే యాక్షన్ తీసుకుంటారు'' అన్నాడు ఒక వ్యక్తి.

లోపలకి వెళ్ళాలని అడ్డంగా నిలబడినవాళ్లని నెడుతున్న కిషోర్‌ని ఆ ఆడవాళ్లు అందరూ కలిసి బలవంతంగా ఒక్కతోపు తోయడంతో వెళ్ళి మురికి కాలువలో పడిపోయాడు.

కిందపడిన కిషోర్‌ని ఒకరిద్దరు లేపారు. బట్టలకి మురికి కాలువలోని మురుగు అంటుకుపోయింది. శరీరం అంతా కూడా మురుగు అయింది.

"నన్ను ఇంత ఇన్సల్ట్ చేస్తారా? మీ అంతు చూస్తా. మిమ్మల్ని లేపెయ్యకపోతే నేను పోలీసోడ్నే కాదు. నా పేరు కిషోరే కాదు. రేపు ఈపాటికి మిమ్మల్ని చమ్డాలూడతీయక




పోతే నేను మొగోడ్నే కాదు'' అని కిషోర్ శపథాలు చేస్తూ, అరుస్తూ మెయిన్‌రోడ్‌మీదకు వచ్చాడు.

ఆలోచిస్తూ, ప్రతీకారేచ్ఛతో రగిలిపోతున్న కిషోర్ రిక్షాకోసం చూశాడు. ఎక్కడా కనపడకపోవడంతో కాలినడకనే దారిపట్టాడు. కొంత దూరం వెళ్ళేసరికి ఖాళీరిక్షా వస్తూ కనిపించింది. అది ఆపి, ఎక్కి ఇంటికి చేరుకున్నాడు.

★ ★ ★

ఫణిగిరి మండలంలో వెనుకబడిన ఎస్టీ ప్రజానీకం ఆర్థిక స్థితిగతుల్ని మెరుగుపరచడానికి ప్రభుత్వం 5 లక్షల రూపాయల గ్రాంటు మంజూరు చేసింది. బాతుల పెంపకం ప్రోత్సహించడానికి ఈ నిధుల్ని వెచ్చించమని ప్రభుత్వం కోరింది.

అర్హులైన 200 మంది వెనుకబడిన ఎస్టీలను గుర్తించి, జీవనోపాధి పథకంకింద, ఒక్కో యూనిట్‌కీ 2 వేలా 500 రూపాయల చొప్పున కేటాయించి వారికి బాతులు కొనిపెట్టమనేది ప్రభుత్వ ఆదేశం.

ప్రభుత్వం డబ్బు పంపిణీ చేయదు. డబ్బు చేతికి ఇచ్చినందువలన దుర్వినియోగం చేసుకునే అవకాశం వుంటుందనే ఉద్దేశంతో ప్రభుత్వం మంజూరు చేసినవి అధికారులు వాళ్లకి కొనిపెడతారు.

అర్హులైన 2 వందలమంది ఎస్టీలనూ గుర్తించినట్లు అధికారులు రికార్డులు తయారుచేశారు. 2 వందలూ బీనామీ పేర్లతోనే రికార్డులు సృష్టించారు.

ప్రభుత్వం గ్రాంటు విడుదల చేసింది. చివరకి ఆ 5 లక్షల రూపాయలూ గుట్టుచప్పుడు కాకుండా అధికారులు వాటాలు వేసుకుని తినేశారు.

ఎవరికీ తెలియకుండా చక్కగా ప్రజల సొమ్ము మింగేశాం అని అధికారులు ఆనంద పడిపోతున్న సమయంలో గుప్పుమంది. అలా గుప్పుమనేలా చేసింది కళాధర్.

"బాతుల నిధుల్ గోల్‌మాల్

5 లక్షలు అమాంతంగా మింగిన అధికారుల్'

అనే పేరుతో పత్రికలో పతాక శీర్షికలో ఈ వార్త వచ్చింది. కుంభకోణం జరిగిన 20 రోజులకు వార్తని ప్రచురించారు.

లబ్ధి పొందిన వ్యక్తి వూరూ, పేరూ- అసలు ఆ పేరు కలిగిన వ్యక్తి ఆ వూళ్ళో వున్నదీ, లేనిదీ కూడా కళాధర్ కొన్ని పేర్లు ఉదహరించి రాశాడు.

రాజకీయవర్గాల్లోనూ, అధికారవర్గాల్లోనూ కలవరం, కలకలం బయలుదేరింది. జిల్లా అధికారులు కదిలారు. వెంటనే ఈ విషయంలో నిజానిజాలు నిగ్గుతేల్చి రిపోర్ట్ ఇవ్వమని కలెక్టర్ ఎంక్వయిరీని వేశారు.

ప్రభుత్వంనించి సహాయం పొందిన ఆ వ్యక్తులు ఎవరూ కూడా మండలంలో లేరనీ, అన్నీ కల్పిత పేర్లూ, దొంగపేర్లూ అని స్పష్టమైన సాక్ష్యాధారాలతోసహా కళాధర్ ఆ వార్తలో వివరంగా రాశాడు.

ఇతర పత్రికల జర్నలిస్టులు ఆశ్చర్యపోయారు. అసలు కళాధర్‌కి ఆ విషయం ఎలా తెలిసిందో అర్థం కాలేదు.

ఎవరికీ తెలియని విషయాన్ని కళాధర్ ఎలా పట్టుకోగలిగాడా, ఆ వార్తని ఎలా సేకరించగలిగాడా, ఎవరి ద్వారా అతనికి ఆ కుంభకోణం తెలిసిందా? అని వాళ్లు విపరీతంగా చర్చించుకున్నారు.

ఈ వార్త అబద్ధం అయితే బాగుంటుందని వాళ్ళు కోరుకున్నారు. అయితే వార్తలో ఎలాంటి లొసుగులూ లేకుండా, స్పష్టమైన ఆధారాలతోసహా వార్త అంతా వివరంగానూ, సమగ్రంగానూ, తిరుగులేని రీతిలో వుందాయె!

బాతుల కుంభకోణాన్ని వెలికి తీసి, ప్రభుత్వం దృష్టికీ, ప్రజల దృష్టికీ తీసుకుపోవడంతో కళాధర్ పేరు మండలంలో మారు

మ్రోగి పోయింది.

బాతుల వేడి చల్లారీ చల్లారకముందే కళాధర్ మరో బాంబు పేల్చాడు.

ఇది వ్యవసాయశాఖలో జరిగిన పవర్ స్ప్రేయర్ల కుంభకోణం! జిల్లాస్థాయిలో జరిగిన భారీ కుంభకోణం!

రైతులకు పురుగు మందులు చల్లుకోవడానికి పవర్ స్ప్రేయర్లు సబ్సిడీ ధరకు ఇవ్వాలని ప్రభుత్వం నిర్ణయించింది. రైతులు సగం ధర చెల్లిస్తే మిగతా సగం సబ్సిడీ వుంటుంది.

ఫణిగిరి మండలంలో 14 గ్రామాలు వున్నాయి. ఒక్కో గ్రామంలో ఐదుగురు రైతుల్ని ఎంపిక చేసి వారికి పవర్ స్ప్రేయర్లు పంపిణీ చేయాలనేది ప్రభుత్వ లక్ష్యం. రైతుల్ని ఎంపిక చేసి వారినించి డబ్బు వసూలు చేయమని ప్రభుత్వం ఆదేశించింది.

ఆ వస్తువు ఖరీదు మూడు వేల రూపాయలు. అందులో పదిహేను వందలు సబ్సిడీ. రైతుల వద్దనుంచి 750 రూపాయలు వసూలుచేశారు. ఇక మిగిలిన 750 స్ప్రేయర్లు తీసుకున్నప్పుడు చెల్లించాలి.

వ్యవసాయ విస్తరణాధికారులు రైతులవద్ద అడ్వాన్స్ డబ్బు వసూలుచేశారు. ఇక వస్తువు ఎంతకీ ఇవ్వకపోవడంతో రైతులు ఆ అధికారుల్ని నిలదీయడం మొదలుపెట్టారు.

"ఇస్తాం కదా. తొందరపడితే ఎలా? అవి జిల్లా ఆఫీసునించి రావాలి'' అని వాళ్ళు అన్నారు.

"అదును పోయిన తరువాత పురుగు మా పంటలు తిని పోయిన తరువాత ఇస్తే మేం ఏం చేసుకుంటాం? ఇంట్లో పెట్టి పూజచేసుకోవడానికా అవి?" అన్నారు రైతులు.

ఇలాగే మూడు నెలలు కాలం గడచిపోయింది. "గవర్నమెంటు ఈ స్కీం ఎత్తివేసింది. సబ్సిడీలు అన్నీ రద్దుచేసింది'' అని రైతుల వద్దనుంచి తీసుకున్న డబ్బు తిరిగి ఇచ్చివేశారు.

జిల్లాలో ఫణిగిరి మండలంలో మాత్రమే రైతులవద్దనుంచి డబ్బు వసూలుచేశారు.

అదుగో అంటే ఆరు నెలలు జాప్యంచేసే మన ప్రభుత్వసిబ్బంది మిగతా మండలాల్లో వసూలు కూడా ప్రారంభించలేదు. ఇంతలోనే జిల్లా అధికారులు ప్రణాళిక రూపొందించారు.

ఒక మహానగరంలో ఒక మహాసంస్థ వద్దనుంచి పవర్ స్ప్రేయర్లు కొన్నట్లు బిల్లులు సృష్టించారు. అవి రైతులకు పంపిణీ చేసినట్లు రికార్డులు కూడా తయారుచేశారు. బిల్లులూ, రికార్డులూ అన్నీ వున్నతాధికారులకి కూడా పంపించారు.

అంతా గడచిపోయిన రెండు నెలలకు కళాధర్‌కి ఒక వ్యక్తిద్వారా ఈ విషయం తెలిసింది. ఆ వ్యక్తి మండల వ్యవసాయశాఖలో పనిచేసే ఒక యు.డి.సి. ఆయనకు విషయం అంతా తెలుసు.

వాటాల పంపకంలో తమకు చాలా అన్యాయం జరిగిపోయిందని భావించాడు. జిల్లా అధికారులు లక్షలు తిని, తమకు కనీసం వేలు కాదుగదా, వందలు కూడా పంపకం చేయకపోవడంతో అతను రగిలిపోయాడు.

వాటా పంచకుండా వేరుశనగ విత్తనాలు, మినుములు, పెసలు లాంటి మినీకిట్లు ఇచ్చి, అవి తమ ఇష్టం వచ్చినట్లు చేసుకోమని చెప్పారు. ప్రతి ఏడూ ఇస్తున్నవే అవి.

ప్రతి ఏడూ తాము అవి విత్తనాల షాపుల వాళ్ళకీ, కొంతమంది రైతులకీ చాటుమాటుగా అమ్ముకుంటూనే వున్నారు. ఇక కొత్తగా వాళ్ళు ఇచ్చిందేంవుంది?

వాళ్ళు చేసిన మోసం, గోల్‌మాల్ విషయం అంతా అతనికి తెలిసినా ఏంచేయాలో అర్థంకాలేదు. ఎవరికి చెప్పుకోవాలో తోచలేదు. జిల్లాస్థాయి అధికారులే అవినీతికి పాల్పడినపుడు ఎవరికి చెప్పుకుని ఏం ప్రయోజనం?




అతను ఏం చేయాలా అని ఆలోచించి, ఏమీ తోచక ఇక ఆ విషయం మరచిపోతున్న సమయంలోనే బాతుల కుంభకోణం అతనికి స్ఫురించింది. ఈ విషయం రట్టు చేయాలంటే పత్రికల ద్వారా మాత్రమే సాధ్యమవుతుందని గ్రహించాడు.

అమెరికాలో వాటర్‌గేట్ కుంభకోణంనించీ జపాన్‌లో లాక్‌హీడ్ కుంభకోణం, భారతదేశంలో ఇందిరా ప్రతిభాప్రతిష్ఠాన్ పేరుతో 'అంతులేని కోట్ల రూపాయల డబ్బులు వసూలు చేసిన కుంభకోణాల వరకూ ప్రపంచంలోనూ, దేశంలోనూ వెలుగులోనికి తీసుకువచ్చింది పత్రికలే.

బోఫోర్స్ కుంభకోణం నించీ సెక్యూరిటీల కుంభకోణం వరకూ బహుళ ప్రచారం కల్పించిందీ, విస్తృతంగా ప్రజల దృష్టికి తీసుకువచ్చిందీ పత్రికలే!

జిల్లా అధికారుల్ని ఉతికిపారేయడానికి పత్రికలే సరైన ఆయుధంగా ఆయనకి తోచింది.

సమర్థవంతంగా ఈ కుంభకోణం బట్టబయలు చేయడానికి కళాధర్‌లాంటి మంచి జర్నలిస్టూ, ఘటికుడూ అయితేనే బాగుంటుందనుకున్నాడు.

కార్యసాధనకు ఉపక్రమించి కళాధర్‌ని కలుసుకున్నాడు. విషయం వివరంగా చెప్పాడు. తనవద్ద భద్రంగా వున్న ప్రభుత్వ ఉత్తర్వూ, ఫైలూ చూపెట్టాడు.

"ఇదీ సంగతి. జిల్లాలో ఈ ఏడాది ఎనిమిది మండలాల రైతులకి సబ్సిడీతో పవర్ స్ప్రేయర్లు ఇవ్వమంది ప్రభుత్వం. ఒక్కో మండలంలో రైతుల జనాభానిబట్టి దాదాపు 60, 65 స్ప్రేయర్లు వస్తాయి. ఎనిమిది మండలాలకీ కలిపి 500 పవర్ స్ప్రేయర్లు అన్న మాట! ఒక్కో దానికీ 15 వందలు సబ్సిడీ! చూడు ఎన్ని లక్షలు మింగేసారో!"

"అంటే దాదాపు ఏడు లక్షల రూపాయలన్నమాట!" కళాధర్ అన్నాడు.

"అవును... కంపెనీ డిస్ట్రిబ్యూటర్ దగ్గర స్ప్రేయర్లు కొన్నట్లు వాడికి ఒక లక్షో రెండు లక్షలో, ఎంతో మొత్తానికి లంచం ఇస్తామని బిల్లులు తెచ్చారు. కంపెనీ డిస్ట్రిబ్యూటర్ పేరుతోనే గవర్నమెంట్ చెక్ ఇచ్చింది. ఆ చెక్ కేష్‌గా మార్చుకుని ఎవరి వాటాలు వాళ్ళు పంచుకున్నారు"

"రైతులు మొదలుకొని గవర్నమెంట్ వరకూ అందర్నీ మోసం చేసారన్నమాట"

"మన మండలంలో రైతుల వద్దనే మేము డబ్బు వసూలు చేశాము. మిగతా మండలాల్లో అసలు వసూలు కూడా మొదలుపెట్టలేదు. రైతుల పేర్లూ, కాగితాలూ అన్నీ తీసుకుని తరువాత గవర్నమెంట్ సబ్సిడీలు రద్దు చేసింది. స్ప్రేయర్లు ఇవ్వం అని చెప్పారు"

"పవర్ స్ప్రేయర్లకి ఏజన్సీ వాళ్ళు ఇచ్చిన బిల్లూ, బిల్లు లేకపోయినా ఆ బిల్లు నంబరూ, ఆ ఏజన్సీ పేరూ దొరికితే బాగుంటుంది. వార్త సమగ్రంగా వుంటుంది"

"నిజమే... అవి నా దగ్గరలేవు. జిల్లా ఆఫీసులో అయితే వుంటాయి. నేను మీకు ఈ ఇన్ఫర్మేషన్ ఇచ్చినట్లు ఎవరితో అనవద్దు"

"నేను మీ విషయం ఎవరికీ చెప్పను. మీరు నాకు ఈ వార్త చెప్పినట్లు మీ పేరు ఇప్పుడే మర్చిపోతాను. అయితే ఫణిగిరి నించే వార్త పోతుంది కాబట్టి మీరు లీక్‌చేసి వుంటారని మీ మీద అనుమానం వస్తే?"

"వస్తే రానివ్వండి. మా ఆఫీసులో ఇక్కడ నలుగురం వున్నాం. మా నలుగురి మీదా అనుమానం వుంటుంది. ముఖ్యంగా నామీద ఎక్కువగా వుంటుంది. అయినా నన్ను ఏం చేస్తారు? ఈ కుట్ర బయటపడితే వాళ్లకి వాళ్ళే పీక్కోలేకా, లాక్కోలేకా చస్తారు? ఈ గోతిలోనించి బయటపడితే చాలు. ఇక నా విషయం ఏం పట్టించుకుంటారు?"

అన్నాడు అతను.

మరుసటి రోజు వుదయమే కళాధర్ బయలుదేరి జిల్లా కేంద్రానికి వెళ్ళాడు. అది నమ్మకమైన వార్తో కాదో ముందు ధృవీకరించుకోవాలి. జిల్లా వ్యవసాయశాఖ కార్యాలయంలో ప్రయత్నిస్తే ఇంకా ఏమైనా విషయాలూ, వివరాలూ తెలిసినా తెలియవచ్చు! జిల్లా అధికారిని వివరణ కూడా అడగాలి, లేకుంటే ఏకపక్షంగా వుంటుంది. అన్ని రకాలుగా ఆలోచించి కళాధర్ జిల్లా వ్యవసాయ శాఖ కార్యాలయానికి వెళ్ళాడు.

అక్కడ కళాధర్ తననితాను పరిచయం చేసుకుని, పవర్ స్ప్రేయర్ల విషయం ప్రస్తావించాడు.

"గవర్నమెంటు ఈ ఏడు సబ్సిడీల్ని రద్దుచేసి, ఆ ఆర్డర్‌ని క్యాన్సిల్ చేసింది. అదంతా అయిపోయికూడా రెండు మూడు నెలలు అయింది. ఇప్పుడు ఎందుకు ఆ విషయం?"

"పవర్ స్ప్రేయర్లు మీరు కొనుగోలు చేసి రైతులకు పంపిణీ చేసినట్లు రికార్డులు తయారుచేసి అధికారులకు పంచారని కొందరు అంటున్నారు. మీరు పెద్ద ఎత్తున అవినీతికి పాల్పడినట్లు ప్రచారం జరుగుతోంది. అది నిజమా, అబద్ధమా అని తెలుసుకుని ప్రజలకు తెలియచెప్పటం మా బాధ్యత. నిజంగా కపోతే మీరు నింద ఎందుకు పడాలి? అబద్ధం అయితే అవి అన్నీ పుకార్లు అనీ, ప్రభుత్వమే ఆ ఆర్డర్‌ని క్యాన్సిల్ చేసిందని ఒక వార్త రాస్తాను'' అన్నాడు కళాధర్.

కళాధర్‌ని క్యాంటీన్‌కు తీసుకుపోయారు ఇద్దరు వుద్యోగులు. ఆరోజు సాయంత్రంవరకూ కళాధర్‌తో ఆ విషయాలూ, ఈ విషయాలూ మాట్లాడారు. అంతలో ఆఫీసు వదిలిపెట్టారు. జిల్లా వ్యవసాయ అధికారి కళాధర్‌ని తన రూంలోనికి పిలిపించాడు.

స్వీటూ, కూల్‌డ్రింకులూ వచ్చాయి. కళాధర్ మౌనంగా తిరస్కరించాడు.

"పర్లేదు... తీసుకోవయ్యా. తింటే ఏం కాదులే! తిను, తీరిగ్గా మాట్లాడుకుందాం"

"ఎందుకు సార్ ఇవన్నీ? నాకు అవసరమైన ఇన్ఫర్‌మేషన్ ఇస్తే వెళ్ళిపోతాను. నాకు చాలా పనివుంది''

"భలేవాడివోయ్ నువ్వు! ఫణిగిరినించి ఇంత చిన్నవార్తకోసం ఇంత దూరం రావాలా? ఈ వార్త రాస్తే నీకు మీ పేపర్‌వాళ్ళు ఎంత ఇస్తారు చెప్పు?"

"ఎంతో ఇస్తారు. వాళ్ళు ఎంత ఇచ్చినా చేసే పని బాధ్యతగా చెయ్యాలికదా?"

"చెయ్యాలి... ఈ పట్టణంలో ఎన్నో చిన్నాచితకా పత్రికలు వున్నాయి. పెద్దపత్రికలకి ఎంతోమంది విలేకరులు వున్నారు. వాళ్ళకి ఎవరికీ లేని బాధ నీకెందుకు? ఎంతో దూరంనించి కష్టపడి వచ్చావు. నిన్ను నిరాశతో పంపించడం ఇష్టంలేదు. నీకు సంబంధంలేని అనవసర విషయాల్లో జోక్యం చేసుకోకుండా ఇవి తీసుకుని వెళ్ళిపో!" అని ఆ అధికారి డ్రాయర్ సొరుగులోనించి డబ్బు వున్న కవరు తీసి కళాధర్ ముందు పెట్టాడు.

"ఏమిటి ఇది?"

"తీసుకొని చూడు''

"మీరు డబ్బుతో నన్ను కొనుక్కోవాలని చూస్తున్నారు. నేను డబ్బుకి కక్కుర్తిపడతాననుకుంటున్నారా?"

"తప్పు ఏముందోయ్ ఇందులో? చిన్నవాడివి. ఇంకా లోకం పోకడ నీకు పూర్తిగా తెలిసినట్లులేదు. డబ్బు తీసుకుంటే తప్పేం వుంటుంది?"

"న్యాయంగా రావాల్సిన డబ్బు తీసుకుంటే తప్పు వుండదు కానీ ఇలాంటి అక్రమ సొమ్మూ, అవినీతి డబ్బూ తీసుకోవడం తప్పే! చాలా పెద్ద తప్పు!"

"ఈ పట్టణంలో కొంతమంది విలేకరులు లక్షాధికార్లు అయ్యారు. పెద్దపెద్ద స్థలాలూ, వ్యాపారాలూ, షేర్లూ, బ్యాంక్ బాలెన్స్‌లూ






అబ్బో బోలెడు సంపాదించారు. వాళ్ళంతా వార్తలు రాయడంలేదా?"

"వాళ్ళతో పోల్చకండి. అన్ని రంగాల్లోనూ అవినీతి పెద్ద వ్యాధిలా వ్యాపించి ప్రబలిపోయింది. ఇందుకు పత్రికారంగం ఏం మినహాయింపు కాదు. అయితే చాలా మంది అధికారులు నీతీ నిజాయితీలతో వుంటారు. ఎలాంటి కక్కుర్తికీ పాల్పడరు. అడ్డమైన గడ్డీ తినరు. దీనికేమంటారు మీరు?" సీరియస్‌గా అన్నాడు కళాధర్.

కళాధర్ మాటలు ఆ అధికారికి కొరడాలా తగిలాయి. ముఖాన నెత్తురు చుక్కలేదు "నువ్వు అనేదేమిటి?"

"కామెర్ల రోగికి లోకమంతా పచ్చగానే కనిపిస్తుందట! అందరూ అవినీతికి పాల్పడతారనీ, అందరూ గడ్డి తింటారనీ భావించకండి!" ఆ మాటలు అని, కళాధర్ విసురుగా వచ్చేశాడు.

మరుసటిరోజే పత్రిక మొదటి పేజీలోనే పవర్ స్ప్రేయర్ల కుంభకోణం వెలుగుచూసింది. జిల్లా వ్యవసాయశాఖ కార్యాలయంలో తనకు కలిగిన అనుభవాన్ని కూడా కళాధర్ వివరించాడు.

ఈ సంఘటనతో కళాధర్ పేరు జిల్లాలో మారుమ్రోగి పోయింది. అతను సంచలనాత్మక విలేకరిగా గుర్తింపు పొందాడు.

ఇంతలో 'హెచ్చరిక దినపత్రిక జిల్లా విలేకరి వుద్యోగం ఖాళీ అయింది. ఆ విలేకరి వేరే మంచి అవకాశం వస్తే వెళ్ళిపోయాడు.

ఆ ఉద్యోగం కళాధర్‌ని వెతుక్కుంటూ వచ్చి వరించింది.

కళాధర్ జిల్లాకేంద్రంలో హెచ్చరిక పత్రిక జిల్లా ప్రతినిధిగా ఉద్యోగ బాధ్యతలు స్వీకరించాడు.

★ ★ ★

బాబాయి కూతురు పెళ్ళికి అని చెప్పి వెళ్ళిన వనజ ఇంకా రాలేదు. కిషోర్‌కి

రాత్రిపూట ఇంటిదగ్గర ఒక్కడే ఒంటరిగా వుండాలంటే విసుగ్గా వుంటోంది.

సుబ్బమ్మ కంపెనీ దగ్గర జరిగిన పరాభవంతో ఆ ప్రాంతాలకు వెళ్ళడానికి మనస్సు అంగీకరించడం లేదు.

కనీసం 4, 5 వందలు అయినా దొరుకుతాయనే వుద్దేశ్యంతో ఆ రోజు రాత్రి వాహనాల చెకింగ్‌కి ఇద్దరు కానిస్టేబుల్స్‌ని వెంటపెట్టుకుని ప్రధాన రహదారి మీదకు వెళ్ళాడు. వాహనాల చెకింగ్‌కి వెళ్ళినరోజు ఒక్కోసారి వెయ్యి రూపాయలు కూడా దొరికిన రోజులు వున్నాయి.

ఒక కానిస్టేబుల్ వచ్చేపోయే వాహనాల్ని ఆపుతున్నాడు. మరో కానిస్టేబుల్ వాటిని చెక్ చేస్తున్నాడు. చాలా లారీల డ్రైవర్లు అలవాటుగానే ప్యాసింజెర్లని ఎక్కించుకుని వున్నారు. ఆ డ్రైవర్లు అందరి దగ్గరా బాగా డబ్బు గుంజారు. మరో మాట మాట్లాడితే కేసు ఫైల్ చేస్తామన్నారు. కొన్ని లారీల వాళ్ళ దగ్గర సి బుక్ లేదు. వాళ్ళ దగ్గర కూడా బాగానే వసూలుచేశారు.

రాత్రి మూడు గంటలకి దాదాపు 800 రూపాయలు వసూలు అయ్యాయి. ఇక ఇంటికి వెళ్దాం అనుకుంటుండగా ఒక అంబాసిడర్ కారు వచ్చింది. దానిని ఆపారు.

"ఈ టైంలో ఎక్కడికి వెళ్తున్నారు? సి బుక్కూ, డ్రైవింగ్ లైసెన్సూ తీయండి!" అన్నాడు కానిస్టేబుల్.

"ఎవరనుకుంటున్నారు ఆయన? మినిస్టర్ బావమరిది!" అన్నాడు కారు డ్రైవరు, వెనుకసీట్లో కూర్చుని వున్న వ్యక్తిని చూపించి.

మార్కెటింగ్ చెక్‌పోస్ట్‌నించి తెచ్చిన కుర్చీలో కూర్చున్న కిషోర్ వెంటనే లేచి కారు దగ్గరకు వచ్చాడు. "ఏ మినిస్టరూ?" అడిగాడు.

"హెూం మినిస్టర్' ఎస్ఐని చూసి ముందు కొద్దిగా జంకినా తరువాత బింకంగానే అన్నాడు డ్రైవర్.

"అయితే ఈ టైంలో ఎక్కడికి వెళ్తున్నారు?"

"వాళ్ళ ఫాదర్‌కి సీరియస్‌గా వుంటేనూ..." డ్రైవర్ అన్నాడు.

వెనుక సీట్లో కూర్చున్న వ్యక్తి మన్ను తిన్నపాములా హుందాగా, మౌనంగా వున్నాడు. నోరు మెదపలేదు.

"ఈ రూట్లో ఆయుధాల స్మగ్లింగ్ జరుగుతున్నట్లు మాకు ఇన్‌ఫర్మేషన్ వచ్చింది. చెకింగ్ చేయడం మా డ్యూటీ!" వాళ్ళతో అని, "డిక్కీ చూడండి'' అని కానిస్టేబుళ్ళకి చెప్పాడు కిషోర్.

వాళ్ళు వెనక్కి వెళ్లారు.

"అది లాక్ చేసి వుంది'' అన్నాడు డ్రైవర్.

"తాళం ఇవ్వు'' కిషోర్ అడిగాడు.

డ్రైవర్ సందేహించి, కొద్దిసేపు తాళం కోసం తారట్లాడి చివరికి ఏం మాట్లాడకుండా తాళం ఇచ్చాడు.

ఒక కానిస్టేబుల్ వెళ్ళి డిక్కీ తెరిచాడు. "ఏవో రెండు మూటలు వున్నాయి సార్!" అన్నాడు చూసి.

"ఏం మూటలు అవి?" ఎస్ఐ అడిగాడు డ్రైవర్ని.

"అవి బట్టల మూటలు సార్' అన్నాడు అతను.

బట్టలు అయితే సూట్‌కేసుల్లో పెట్టుకుంటారు. బ్యాగుల్లో పెట్టుకుంటారు! మూటలు కట్టుకుంటారా? అందులో కారుల్లో తిరిగేవాళ్ళు! పైగా మినిస్టర్ బామ్మర్దినని చెపుతున్నాడు.

కిషోర్‌కి వాళ్ళ ప్రవర్తనా, మాటతీరూ అనుమానం కలిగేలా చేశాయి.

"మూటలు విప్పి చూపెట్టండి'' కిషోర్ డ్రైవర్‌ని ఆజ్ఞాపించాడు.

"ఏమిటీ? హెూం మినిస్టర్ బామ్మర్దిని.




నన్నే సస్పెక్ట్ చేస్తావా? జాబ్ చేయదలుచుకో లేదా?" వెనుకసీట్లో కూర్చున్న వ్యక్తి ఆగ్ర హంగా ప్రశ్నించాడు.

"మా డ్యూటీ మేం చేయాలి కదా?" అన్నాడు కిషోర్ శాంతంగా.

డ్రైవర్ సందేహిస్తూనే వెనుక డిక్కీ దగ్గ రకు వచ్చాడు.

ఒక కానిస్టేబుల్ టార్చిలైటు ఫోకస్ చేశా డు.

వీళ్ళు ఇలా కారు డిక్కీ వద్దకు రాగానే హెూం మినిస్టర్ బామ్మర్ది కారుడోరు తెరుచు కుని యూరినల్స్ చేస్తున్నట్లు నటించి, చీక ట్లో పరుగు లంకించుకున్నాడు.

ఒక కానిస్టేబుల్ వెంటపడ్డాడు కానీ, అత ను చాలా వేగంగా పరిగెత్తుతూ చీకట్లో కలిసిపోయాడు.

"ఏమిట్రా, వాడు హెూంమినిస్టర్ బా మ్మర్దా? నువ్వు ఎవడి బామ్మర్దివిరా భా డ్కావ్?" అని కిషోర్ డ్రైవర్ని నాలుగు తగిలించాడు.

కారు వెనక్కి వెళ్లిన వెంటనే కిషోర్ ఆ మూటల్లోని సరుకు పసిగట్టేశాడు.

అది గంజాయి.

రెండు పెద్ద మూటలుగా కట్టారు. దా దాపు 4 లక్షల రూపాయల ఖరీదు చేసే గంజాయి అది.

దెబ్బలు పడిన వెంటనే డ్రైవర్ ఏడుస్తూ కిషోర్ కాళ్ళు పట్టుకున్నాడు.

"నాకేం తెళియదుసార్. వాడు చెబితే నేను చెప్పాసార్. నన్ను కొట్టొద్దు సార్' అన్నాడు.

"ఎన్నోసారి ఇది రవాణాచేయడం?" ప్ర శ్నించాడు కిషోర్. అతను తీవ్రంగా ఆలోచి స్తున్నాడు.

"ఇవ్వాళ్టికి చాలు. ఇక మీరు ఇళ్ళకి వెళ్ళిపోండి. ఈ డబ్బు తీసుకోండి. ఈ విషయం రేపు మాట్లాడుకుందాం. మన స్టాఫ్‌లో ఎవరికీ మీరు ఈ విషయం చెప్ప కండి'' అని కానిస్టేబుళ్ళకి చెరి రెండు వందలూ ఇచ్చాడు కిషోర్.

వాళ్ళు ఆ డబ్బు తీసుకుని వెళ్ళిపోయా రు

ఒక కానిస్టేబుల్ కారు నంబరు గుర్తుపె ట్టుకున్నాడు. దానినే మననం చేసుకుంటూ, ఇంటికి వెళ్ళిన తరువాత ఆ నంబర్ డైరీలో నోట్‌చేసి పెట్టుకున్నాడు.

కిషోర్ కారు వెనుక సీట్లో కూర్చుని పోనిమ్మన్నాడు. కారు కొంతదూరం పోయిన తరువాత అన్నాడు.

"కేసు ఫైల్‌చేస్తే కస్టడీకి పంపించి, కనీసం బెయిల్ కూడా ఇవ్వకుండా నిన్నూ, నీ పెళ్ళాం బిడ్డల్ని అల్లాడిస్తారు. కారుని కూడా స్వాధీనం చేసుకుంటారు. చివరకి నీకు శిక్ష కూడా పడుతుంది''

"నన్ను కాపాడండి సార్. నాకేం తెలియ దు. మీ మేలు మరచి పోను సార్!" అన్నాడు డ్రైవర్.

"చూడబోతే నువ్వు చాలా అమాయకుడి మాదిరిగా కనబడుతున్నావు. చూస్తూ చూ స్తూ నీ మీధ కేసుపెట్టడం, నిన్ను లాకప్‌లో వేసి నాలుగు తన్నడం నాకూ ఇష్టంలేదు. మరి ఏం చేయమంటావు?" సౌమ్యంగా అడిగాడు కిషోర్.

"ఏదైనా మీరే చేయండి సార్. నన్ను కాపాడండి సార్'

"నిన్ను ఎలా కాపాడాలా అని నేనూ ఆలోచిస్తున్నా. నేను చాలా మంచివాడ్ని, అమాయకుల్ని కానీ, నిరపరాధుల్ని కానీ శిక్షించడానికి నా మనసు అసలు వప్పుకో దు. ఈ గంజాయి నీది కాదుగదా?"

"నాది కాదుసార్'

"నీకు తెలిసే కదా ఈ స్మగ్లింగ్ జరగడం! నిజం చెప్పు. ఇప్పుడు తప్పించుకున్నవాడు కూడా నీకు తెలుసుకదా?"

"తెలుసు కానీ, బాగా పరిచయం లేదు సార్. ఇది నేను రెండవసారి నా కారులో తీసుకుపోవడం. నాకు బాడుగ మాత్రం డబల్ రేటు ఇస్తాడు సార్. ఆ కిరాయి కోసం ఆశపడి నేను ఈ పాడుపని చేశాను. అంతేత ప్ప నాకు ఏంతెలియదు సార్'

"వాడి అడ్రస్ నీకు తెలుసు కదా?"

"నాకు తెలియదు. వాడు ఏ వూరివాడో కూడా నాకు తెలియదు సార్. వాడే టాక్సీ స్టాండుకొచ్చి కిరాయి మాట్లాడుకున్నాడు''

"నిజం చెప్పు. అబద్ధం చెప్పావో చంపు తా, నేనంటే ఏమనుకున్నావో? మంచివాళ్ళ కి మంచివాడ్నీ, చెడ్డవాళ్ళకి మహాచెడ్డవా ణ్ణీ!"

"నిజం సార్. నాకు తెలియదు. నన్ను వదిలిపెట్టండి సార్!"

"నిన్ను వదిలిపెట్టాలనే నాకూ అని పిస్తోందిరా! నిన్ను కష్టడీకి తీసుకోవాలని నాకూ లేదు. సరే... రేయ్ నేను చెప్పినట్లు చేయి. నేను చెప్పిన దగ్గర ఆ మూటలు దింపేసి నువ్వు వెళ్ళిపో. 100 మైళ్ళ స్పీడు తోటి తెల్లారేసరికి మీ టౌనుకి వెళ్ళిపోవాలి. ఈ విషయం ఇంకొకడికి తెలియకూడదు''

"అలాగే, మీరు చెప్పినట్లే చేస్తాను సార్!"

"గంజాయి కేసు చాలా పెద్దకేసురా. నీ కారూ పోతుంది, నువ్వూ కటకటాలు లెక్కబె ట్టుకోవాలి! నీ మీద కేసుపెట్టడం, నీ పెళ్ళాం బిడ్డల్ని అనాథల్ని చేయడం నాకు ఇష్టం లేదురా!"

"మీరు నిజంగా దేవుడులాంటి వాళ్ళు సార్' అన్నాడు డ్రైవరు.

కారు కిషోర్ వాళ్ళ ఇంటిముందు ఆగింది. కిషోరూ, డ్రైవరూ కలిసి రెండు మూటల్ని ఎత్తుకుని తెచ్చి కిషోర్ వాళ్ల లెట్రిన్ గదిలో పడేశారు. ఆ ఇంటికి రెండు లెట్రిన్లు వున్నాయి.

కిషోర్‌కి దణ్ణంబెట్టి డ్రైవర్ బ్రతుకుజీవు డా అనుకుంటూ కారు రివర్స్ చేసుకుని వేగంగా వెళ్ళిపోయాడు.



బాలయ్య ఎంఎల్‌ఏ గుర్నాథానికి కుడిభు జంలాంటివాడు. గుర్నాథం ఎంఎల్ఏ కావ డానికి బాలయ్య సహాయసహకారాలు చాలా వున్నాయి.

బాలయ్యకు అనేక చీకటి వ్యాపారాలూ, చాటుమాటు వ్యాపారాలూ వున్నాయి. ఆ వ్యాపారాలకు రౌడీలూ, గూండాల సహాయం చాలా అవసరం. వాళ్ళ అండలేనిదే బాల య్య ఒక్కరోజు కూడా తన వ్యాపారాలు చేసుకోలేడు.

బాలయ్య చేసే వ్యాపారాలకు ఎంఎల్ఏగా కముందు గుర్నాథం చాలా సపోర్ట్‌గా వుండే వాడు.

అందుకే గుర్నాథం ఎంఎల్ఏ కావడానికి బాలయ్య ఎంతో కృషి చేశాడు. లక్షల సారాయి పోయించాడు. డబ్బు వెదజల్లాడు.

గుర్నాథం ఎంఎల్ఏ కావడంతో బయటి అండేగాకుండా రాజకీయమైన అండ కూడా బాలయ్యకి లభించినట్లయింది. దాంతో విజృంభించాడు. అడ్డూ అదుపూ లేకుండా యథేచ్ఛగా తన వ్యాపారాల్ని కొనసాగిస్తు న్నాడు.

ఎక్కడో దూరప్రాంతంనించి వట్టిచేతు




లతో, కట్టుబట్టలతో ఆ పట్టణానికి వచ్చాడు బాలయ్య. అలాంటివాడు రహస్య వ్యాపారాలతోనే లక్షలు సంపాయించాడు.

బాలయ్య చేసే అనేక అక్రమ వ్యాపారాల్లో గంజాయి హెూల్‌సేల్ వ్యాపారం కూడా ఒకటి.

గంజాయిని ఎక్కువరోజులు ఇంట్లో అట్టి పెట్టడం ఏమంత శ్రేయస్కరమైన పని కాదనుకున్నాడు కిషోర్. తను చేసిన పని బయట పడితే చాలా ప్రమాదం. ముందు జీవితాంతం తిండిపెట్టే ఉద్యోగం వూడిపోతుంది. తరువాత చాలా సమస్యలు కూడా వస్తాయి.

ఈ గంజాయిని ఎంత తొందరగా అమ్ముకుని వదిలించుకుంటే అంత మంచిది. డబ్బుకి డబ్బూ వస్తుందీ, ఈ పీడా వదుల్తుంది!

గంజాయిని చిల్లరగా అమ్మడం సాధ్యంకాదు. చిల్లరగా అమ్మాలంటే తను దుకాణం తెరిచి కూర్చోవాలి. అప్పుడు మొదటికే మోసం వస్తుంది.

చిల్లరగా గంజాయి అమ్మే అనేకమంది వ్యాపారులు కిషోర్‌కి తెలుసు. వాళ్లు నెలనెలా కొద్దీగొప్పో మామూళ్లు ఇస్తుంటారు.

వాళ్లు ఎవరూ కూడా ఒక్కసారిగా కనీసం పాతిక వేలు పెట్టుబడి పెట్టగలిగిన శక్తి ఉన్నవాళ్లు కాదు.

తన దగ్గర ఉన్న గంజాయిని మొత్తంగా ఒక్కసారే వదిలించుకోవాలనుకున్నాడు. అది మొత్తంగా ఒక్కసారే, ఒక్కరే కొనాలంటే అది బాలయ్యకి తప్ప మరెవరికీ సాధ్యంకాదు.

వాడు పెద్ద బద్మాషూ, దొంగా! నీకు ఎక్కడిదీ గంజాయీ, ఎలా సంపాయించావూ, ఎక్కడ కొన్నావూ, ఎలా కొన్నావూ, ఎందుకు కొన్నావూ, ఎంతకి కొన్నావూలాంటి సవాలక్ష చచ్చుప్రశ్నలు వేసి చంపుతాడు. వాడు చేసేది దొంగ వ్యాపారం, దొంగపనీ! నిద్రలేస్తే వాడికి దొంగ ఆలోచనలు తప్ప మంచి ఆలోచనలు రావు! అలాంటివాడు దొంగ అని అందరికీ తెలిసినా, వాడు దొంగమాదిరిగా ఉండడు! పెద్ద దొరగా, గొప్పవాడిగా, పెద్దమనిషిగా ఫోజులు ఇస్తుంటాడు! జనం కూడా వాణ్ణి అలానే గౌరవిస్తుంటారు ఎదురుగా, చాటుగా తిట్టుకున్నా!

ఇప్పుడు తను వాడి దగ్గరకి వెళ్లి, వాడు వేసే చచ్చు ప్రశ్నలకి సమాధానాలు ఇచ్చుకుని వాడికి తన దగ్గర ఉన్న గంజాయి అమ్మాలి!

వాడు ఇప్పుడు ఎస్ఐల్నీ, సిఐల్నీ లెక్కచేసే పరిస్థితి లేదు. వాడి వ్యాపారాల్ని అరికట్టడం ఇప్పుడు ఎస్పీలాంటివాళ్లకే సాధ్యంకాదు! ఇక వాడు తమని ఏం పట్టించుకుంటాడు?

అయినా తప్పదు! వాడికి తప్ప మరొకరికి అమ్మే అవకాశం లేదు. ఆ బాలయ్యకే అమ్మాలని నిశ్చయించుకుని వాళ్ల ఇంటికి వెళ్లాడు కిషోర్.

విశాలమైన కాంపౌండ్, పెద్ద బిల్డింగ్, ఇంటిముందు పూల మొక్కలూ, కొబ్బరిచెట్లూ! రాజభవనాన్ని మరపించేరీతిలో ఉంది బాలయ్య నివాసగృహం.

ఇంటిముందు ఆవరణలో కూర్చుని ఆరోజు పేపరు చూస్తున్నాడు. బాలయ్య వెంట ఎప్పుడూ ఐదారుగురు ఉంటారు. ఉదయం అయితే ఎవరూ ఉండరనే ఉద్దేశంతో ఉదయమే వెళ్లాడు కిషోర్.

"ఏమోయ్ పోలీసూ... పొద్దున్నే ఏమిటీ ఇటుపడి వచ్చావు? అందరూ బాగున్నారుకదా?"

"బాగానే ఉన్నారు సార్... మీతో కొద్దిగా పనివుండివచ్చాను సార్' నసుగుతూ అన్నాడు కిషోర్.

"నాతో పనా? ఏమిటో చెప్పు?"

"కొంచెం సీక్రెట్ సార్'

"ఇక్కడ ఎవరూ లేరు. నువ్వేం భయప డాల్సిన పని లేదు. మూడోవాడికి నీ సీక్రెట్ తెలియనివ్వను. భయంలేదు కానీ చెప్పు!"

"నాదగ్గర గంజాయి ఉంది సార్. దాన్ని మీరు అమ్మిపెట్టాలి'' నంగినంగిగా అన్నాడు కిషోర్.

"ఏమిటీ? గంజాయా? అది నీకెక్కడి దోయ్? ఈమధ్య నేనా వ్యాపారం కూడా చేయటంలేదుకదా! గంజాయి వ్యాపారం పెద్దగా గిట్టుబాటు కావడంలేదోయ్!"

"అలా అనకండి సార్! ఎలాగైనా మీరు అమ్మిపెట్టాలి''

"సరే... ఎంత ఉందేమిటీ నీదగ్గర?"

"ఎంతోనా... కొద్దిగానే ఉంది సార్. మీరు వస్తే చూపెడతాను'' అన్నాడు కిషోర్.

"ఎక్కడ ఉంది? చెబితే వస్తా సాయంత్రం"

"ఒక రహస్య స్థలంలో పెట్టాను. మీరు సాయంత్రం వస్తే అక్కడికి తీసుకుపోయి చూపెడతాను''

"సరే... చీకటి పడిన తరువాత రాత్రికి వస్తాలే. మీ ఇల్లు ఎక్కడా?"

"కిషోర్ తన ఇంటి అడ్రస్ చెప్పి భయంగా అన్నాడు, "ఎవరికీ ఈ సీక్రెట్ చెప్పకండి సార్"

"నేను ఎవరికైనా ఎందుకు చెపుతాను? అలా చెబితే నేను ఈ వ్యాపారాలు ఎలా చేస్తాను? రాత్రికి నేనే కారు వేసుకుని వస్తాను పో!" అన్నాడు బాలయ్య.

అన్నట్లుగానే ఆ రోజు రాత్రి బాలయ్య కారు వేసుకుని కిషోర్ వాళ్ల ఇంటికి వెళ్లాడు.

బాలయ్యకోసం ఎదురుచూస్తూ కిషోర్ ఇంటివద్దే ఉన్నాడు.

వనజ అంతకుముందురోజే ఊరినుంచి వచ్చింది. బాలయ్య వచ్చినవెంటనే వనజ గౌరవంగా టిఫినూ, కాఫీ ఇచ్చింది.





"ఇవన్నీ ఎందుకోయ్ ఇప్పుడు?" కిషోర్‌తో అంటూనే తిన్నాడు.

"ఇంక మనం వెళ్దామా? ఎక్కడికో తీసుకుపోతాను అన్నావుకదా?" బాలయ్య అడిగాడు కిషోర్‌ని.

"ఇక్కడే ఉన్నాయి సార్ మూటలు'' అని బాలయ్యని లెట్రిన్‌వద్దకు తీసుకుపోయి, దాని తాళం తీసి లోపల మూటలు చూపెట్టాడు.

బాలయ్య రెండు మూటల్లోనుంచి కొద్దిగా గంజాయి తీసుకుని నాణ్యతని పరీక్షించాడు. ఒక మూటని బరువు ఎంత ఉంటుందోనని రెండు చేతుల్తో పట్టుకుని కదిలించాడు. చాలా బరువుంది.

కనీసం 4 లక్షలు చేసే గంజాయి అనుకున్నాడు. దానిని వాడే సామాన్యుడు వద్దకు పోతే మధ్యలో చేతులు మారి ఆ రెండు మూటలు 6, 7 లక్షల రూపాయలు వసూలు చేస్తాయి.

కిషోర్ మళ్లీ లెట్రిన్ తాళం వేశాడు. ఇద్దరూ కారు దగ్గరకు వచ్చారు.

"కూర్చో... మాట్లాడుకుందాం" అని కారు డోర్ తీసి కిషోర్‌కి చెప్పాడు బాలయ్య. కిషోర్ కూర్చున్నాడు.

కారు నేరుగా బాలయ్య ఇంటికి వెళ్లింది. ఇద్దరూ బాలయ్య రూంలో కూర్చున్నారు.

"చెప్పు... రెండు మూటలూ ఎంతకిస్తావు?"

"మీరు చెప్పండి సార్. న్యాయంగా పోదాం. నా సొమ్ము మీకూ వద్దూ, మీ సొమ్ము నాకూ వద్దు! కరెక్టు రేటుకి తీసుకోండి''

"అది నీకు ఊరికే వచ్చిందికదా? ఎంతకు ఇచ్చినా నీకు దండగేముంటుంది?"

"దానికోసం చాలా కష్టపడ్డాను. అది సంపాయించడానికి నాకు చాలా డబ్బు వదిలింది సార్!" అన్నాడు కిషోర్.

"నాకు చెప్పకోయ్ పోలీసూ... నా సర్వీసంత ఉండదు నీ వయస్సు. నేను నీలాంటి

వాళ్లని ఎంతమందిని చూళ్లేదూ! నువ్వు ఆ సరుక్కి డబ్బు పెట్టావా? ఉత్తమాటలు చెప్పవాకు. సరేకానీ, లక్ష రూపాయలు ఇస్తా. ఆ సరుకు మొత్తం ఇవ్వు''

"భలేవాళ్లు సార్ మీరు? తేలిగ్గా అనుకున్నా 4 లక్షల సరుకు, లక్ష రూపాయలకు ఎలా ఇవ్వమంటారు? నేను మీదగ్గరకు కావాలని వస్తే అంత తక్కువకి అడగడం భావ్యంకాదు'' అన్నాడు కిషోర్.

ఇద్దరిమధ్య గంటసేపు బేరసారాలు సాగాయి. వాదోపవాదాలు చేసుకున్నారు. ఇద్దరూ ఎవరికి వారే ఒక్కోసారి ప్రాధేయపడ్డారు. మరోసారి దబాయించారు

చివరికి 2 లక్షలా 50 వేలు ఇవ్వడానికి బాలయ్య అంగీకరించాడు. మరుసటిరోజు 50 వేలూ, 15వ రోజు ఒక లక్షా, నెలాఖర్లో ఒక లక్షా మూడు వాయిదాలలో మొత్తం డబ్బు ఇవ్వడానికి అంగీకారం కుదిరింది.

ఆరోజు రాత్రి కిషోర్ ఇంటినుంచి సరుకు బాలయ్య గోడవున్‌కు చేరుకుంది.

కిషోర్ చాలా నిరుత్సాహపడిపోయాడు. చూస్తూ చూస్తూ తన సొమ్ము లక్షా యాభైవేలు పోగొట్టుకున్నట్లు బాధపడ్డాడు.

ఆ సరుకుని బాలయ్య వేరేవాళ్ల దగ్గర అయితే 4 లక్షలకు కొంటాడు. అదే ధర తనకి ఇవ్వవచ్చుకదా?

పోలీస్ అధికారి అని కూడా గౌరవం లేకుండా తనని నిస్సహాయుణ్ని చేసి ఇంత తక్కువ ధరకీ, చౌక ధరకీ తన సరుకుని కొట్టేస్తాడా? ఆ సరుకుని బాలయ్య 5 లక్షలకు తక్కువకాకుండా అమ్ముకుంటాడు. ఎంత మోసం! మనసులో బాలయ్యాని తిట్టుకున్నాడు కిషోర్.

"సార్... ఆరోజు కారులో సరుకుని ఏం చేశారు సార్?" తరువాత 4 రోజులకు ఒక కానిస్టేబుల్ ధైర్యంచేసి కిషోర్‌ని అడిగాడు. ఏమీ జరగనట్లు కిషోర్ ఆ ప్రస్తావన తీసుకురాకపోవడంతో ఆ కానిస్టేబుల్‌కి అడగక తప్పలేదు.

"అవా... ఏం మూటలు అనుకున్నారు అవి? బట్టల మూటలే అవి! అయితే అవి దొంగతనం బట్టలు. అయినా అసలువాడు పారిపోయిన తరువాత ఆ డ్రైవర్‌మాత్రం ఏంచేస్తాడు? వాణ్ణి నాలుగు తన్ని వదిలిపెట్టా. వాడిదగ్గర ఉన్న డబ్బు ఇచ్చాడనుకో మీ వాటా తీసుకోండి'' అని కిషోర్ ఆ కానిస్టేబుళ్లు ఇద్దరికీ చెరొక వెయ్యి రూపాయలూ ఇచ్చాడు.

కిషోర్ చెప్పేది పచ్చి అబద్ధం అని ఆ పీసీకి స్పష్టంగా అర్థమైపోయింది. ఆ మూటల్లోని సరుకు ఏమిటో కిషోర్‌కంటే ముందే ఆ పీసీకి తెలుసు. అతనికి ఎంతో సర్వీస్ ఉంది.

"అదేంటి సార్? వాణ్ణి ఎందుకు వదిలిపెట్టారు? బట్టలైనా స్వాధీనం చేసుకుంటే బాగుండేదికదా?" అన్నాడు అతను.

"ఆ డ్రైవర్ చూస్తే మరీ అమాయకుడు మాదిరిగా కనపడుతున్నాడు. వాణ్ణి స్టేషన్‌కు తీసుకువచ్చి, తన్ని తగలేయడం వేస్ట్ అనిపించి వదిలిపెట్టా! వాడిదగ్గర జేబులో కొద్దిగా డబ్బు ఉంటే అది లాగాలే! మీ వాటా మీకు ఇచ్చానుకదా!" అన్నాడు కిషోర్.

"అతని దగ్గర ఎంత వుందో, మీరు ఎంతలాగారో! ఈ వెయ్యి రూపాయలు కూడా మాకు ఎందుకులే సార్? మీరే ఉంచుకోండి'' అని కానిస్టేబుళ్లు ఇద్దరూ డబ్బుని తిరిగి ఇచ్చివేశారు.

"రేపు ఇంకొక వెయ్యి రూపాయలు ఇస్తాలే'

"మాకు వద్దులే సార్! మాకు ఎందుకు డబ్బు? మా జీవితంలో మేం ఎప్పుడైనా వెయ్యి రూపాయలు చూశామా?" అన్నారు వాళ్లు.

చివరికి ఆ కానిస్టేబుళ్లకి ఒక్కొక్కరికి 5 వేలు ఇస్తానన్నాడు కిషోర్. ఆ మాటకి వాళ్లు అసంతృప్తిగానే తల ఊపారు.



కొంతమంది అధికారులు లంచాలకు పాల్పడినా వాళ్ల జేబులు నింపుకోవడమే కాకుండా, కిందిస్థాయి ఉద్యోగులకు కూడా అందులో వాళ్ల వాటా ఇస్తారు. కిషోర్‌లాంటి అరుదైన వ్యక్తులు లంచగొండి విషయంలో కూడా వాళ్ల స్వార్థమే చూసుకుంటారు కానీ కిందిస్థాయి ఉద్యోగుల విషయం పట్టించుకోరు. వాళ్లకి అసలు ఇవ్వవలసిన అవసరమే లేదనుకుంటారు.

★ ★ ★

కళాధర్ జిల్లా కేంద్రంలో ఉద్యోగ బాధ్యతల్ని స్వీకరించిన వెంటనే మొదటగా చేసిన పని పరిచయాల్ని వృద్ధిచేసుకోవడం! ప్రభుత్వ కార్యాలయాల్లోని ఉద్యోగులతో మంచి స్నేహ సంబంధాల్ని ఏర్పరచుకున్నాడు.

కళాధర్ సహజంగానే స్నేహశీలి. కలివిడి స్వభావం కలిగినవాడు. అతనికి చాలా ఆఫీసుల్లో మంచి మిత్రులు దొరికారు.

పత్రికా రచయితలు అంటే ఉండే క్రేజ్‌తో కూడా కొందరు కళాధర్ అంటే అభిమానం పెంచుకుని స్నేహితులైపోయారు.

ప్రభుత్వ కార్యాలయాలు అంటేనే అవినీతికి పుట్టిళ్లు. అక్రమ కార్యకలాపాలకీ, నీతిబాహ్య చర్యలకీ, కుంభకోణాలకీ అవి నిలయాలు.

ఏ కుంభకోణం అయినా వెలికి తీయాలంటే అది ఆకాశంనుంచి ఊడి పడదుకదా! దానికి సంబంధించిన వ్యక్తులనుంచీ, దానితో పరిచయమో, ప్రమేయమో ఉన్నవారి నుంచీ అది వెల్లడి కావాలి.

'ఎవ్రి స్కూప్ ఈజ్ సమ్ వన్స్ లీక్' అనే విషయాన్ని కళాధర్ బాగా అవగాహన చేసుకున్నాడు. అందుకే ఉద్యోగులతో మంచి పరిచయాల్ని పెంచుకున్నాడు.

రెండు నెలల్లో బ్రహ్మాండమైన కుంభకోణాన్ని వెలికితీశాడు. అది విద్యుత్ శాఖలో జరిగిన కుంభకోణం.

ఎం.ఎల్.ఏ., విద్యుత్ శాఖాధికారులూ కలిసి చేసిన కుంభకోణం. ఒక కోటి రూపాయల కుంభకోణం.

జిల్లాలో పాతవి వెయ్యి విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్లు ఉన్నాయి. వాటి చుట్టూ రక్షణగా గ్రిల్స్ ఏర్పాటు చేయాలని విద్యుత్ డివిజనల్ అధికారులు నిర్ణయించారు.

ఇలాంటివాటికి ప్రత్యేక బడ్జెట్ ఉంటుంది. అయితే బడ్జెట్‌తో నిమిత్తం లేకుండా ఈ గ్రిల్స్ నిర్మాణాన్ని నామినేషన్ పద్ధతిమీద చేయించాలని నిర్ణయించారు.

ఒక ట్రాన్స్‌ఫార్మర్ చుట్టూ గ్రిల్ ఏర్పాటుకు 10 వేల రూపాయల వంతున కేటాయించారు. నిజానికి ట్రాన్స్‌ఫార్మర్ చుట్టూ గ్రిల్ ఏర్పాటుకు వెయ్యి రూపాయలకు మించి ఎలాంటి పరిస్థితిలో కూడా ఎక్కువ వ్యయం కాదు.

ఈ వెయ్యి ట్రాన్స్‌ఫార్మర్ల చుట్టూ గ్రిల్స్ ఏర్పాటు చేసే పనిని టెండర్ లేకుండా, మరో మనిషికి తెలియకుండా ఎం.ఎల్.ఏ. గుర్నాధానికి అప్పగించారు.

గుర్నాధం ట్రాన్స్‌ఫార్మర్ల చుట్టూ గ్రిల్స్ ఏర్పాటు చేయించాడు. ఆ ఏర్పాటులో కూడా విద్యుత్‌శాఖ అధికారులు నిర్ణయించిన కనీస నిబంధనలు కూడా ఏమీ పాటించలేదు. పని చేయించాడు. అంతే...

అధికారులు తూతూమంత్రంగా తనిఖీ చేసి, ఆమోదం తెలిపి కోటి రూపాయలకు బిల్లులు తయారుచేసి విద్యుత్‌బోర్డుకు పంపించారు. ఆ బిల్లులు వారంరోజుల్లో చెల్లిస్తారు అనుకునే సమయంలోనే పత్రికలో 'విద్యుత్' వార్త వచ్చేసింది.

గ్రిల్స్ ఏర్పాటులో జరిగిన అవకతవకలూ, అవినీతీ సమగ్రంగా, సవివరంగా పాఠకుల దృష్టికి తీసుకువచ్చిందా వార్త. దాంతో బిల్లుల చెల్లింపు నిలిచిపోయింది.

ఎవరి వాటాలు వాళ్లకి ఇచ్చినా ఈ గ్రిల్స్ ఏర్పాటులో 70, 80 లక్షలు మిగులుతాయని గుర్నాధం భావించాడు. ఇంతలోనే పత్రికలో







వార్త రావడంతో విద్యుత్ బోర్డులోని అత్యున్నతాధికారులు చెల్లింపులు నిలిపివేయడమే గాక, దీనిమీద విచారణకు కూడా ఆదేశించారు.

★ ★ ★

కిషోర్ వెళ్లి గొడవ చేసినప్పటినుంచీ సుబ్బమ్మ కంపెనీ వ్యాపారాన్ని తాత్కాలికంగా మానుకుంది. పోలీస్‌వాళ్లతో సమస్య వస్తుందనే భయంతోనే ఆమె విటులు ఎవర్నీ రానివ్వడంలేదు.

కిషోర్‌తో రాజీకి ఆమె మధ్యవర్తుల్ని పంపి ప్రయత్నిస్తోంది. అయితే రాజీకి కిషోర్ ససేమిరా కాదంటున్నాడు.

సుబ్బమ్మ దగ్గర ఉన్న అమ్మాయిలు మరో దారి చూసుకున్నారు. వాళ్లకి వృత్తి చేస్తేనే పొట్ట గడుస్తుంది. నాలుగు రోజులు వృత్తి చేయకపోతే పస్తుపడుకోవాలి. భయంతో ఎన్నిరోజులు వృత్తి మానుకుని పస్తులు పడుకుంటారు?

పోలీసులు ఏం చేయగలరు? అంతగా అయితే పట్టుకుని కేసు పెడతారు. మామూళ్లకి ఆశపడరు. అంతేగదా! కేసు పెడితే జడ్జి జరిమానా వేస్తాడు, లేకపోతే వారం రోజులో, పదిరోజులో జైలుశిక్ష వేస్తాడు!

మానం దగ్గర్నించీ ఆత్మాభిమానం వరకూ అన్నీ పోగొట్టుకున్నవాళ్లు! ఇక పోవడానికి ఏమున్నాయి, ప్రాణాలు తప్ప! ఏదయితే అదే అవుతుందనే ధైర్యంతో జైలుశిక్షకి కూడా సిద్ధపడి, ఆ అమ్మాయిలు హోటళ్లకీ, లాడ్జీలకీ వెళ్లడం మొదలుపెట్టారు.

సుబ్బమ్మ కంపెనీలోని అమ్మాయిల మీద కిషోర్ బాగా కక్ష పెంచుకుని ఉన్నాడు. వాళ్లని దెబ్బకి దెబ్బ గింగిరాలు తిరిగే దెబ్బ తీయాలని గట్టి నిశ్చయంతో ఉన్నాడు.

ఆ అమ్మాయిల కదలికల్ని కనిపెట్టడానికి ప్రత్యేకంగా ఒక ఇన్‌ఫార్మర్‌ని నియమించా

డు.

పోలీస్‌శాఖలో ఉండే అనధికార ఉద్యోగులు ఈ ఇన్‌ఫార్మరులు. ఎలాంటి పనీ పాటా లేనివాళ్లు.

వీళ్లకి జీతాలు ఇవ్వమని గవర్నమెంట్ కొంత సీక్రెట్ ఫండ్‌ని ఇస్తుందిగానీ ఆ ఫండ్ ఉన్నతాధికారులే మింగుతారు.

ఆత్మహత్యా, హత్యా, ప్రమాదాలూ జరిగినప్పుడు మృతుల పంచనామా, శవపరీక్ష వద్దకు ఒకరూ, ఇద్దరూ పోలీసులతోపాటు ఈ ఇన్‌ఫార్మర్లు కూడా వెళ్తారు. ఇక బాధల్లో ఉన్న ఆ మృతుల బంధువుల్ని రాబందుల్లా పీక్కుతిని, వాళ్లవద్ద కాజేసిన డబ్బుతోనే ఈ ఇన్ఫార్మర్లు బతుకుతుంటారు.

దొంగలనుంచీ, ఇతర నేరస్తుల దగ్గర నుంచీ వసూలు చేసిన మామూళ్లలో అప్పుడప్పుడూ ఇన్ఫార్మర్లకి కూడా కొంత విదిలిస్తుంటారు పోలీసులు.

ఆరోజు కిషోర్ నియమించిన ఇన్ఫార్మర్ ఉత్సాహంగా, ఆనందంలో తేలిపోతూ వచ్చి విష్‌చేశాడు.

"ఈరోజు పట్టుకోవచ్చు సార్ వాళ్లని. మనం రెయిడ్ చేస్తే సుబ్బమ్మ కంపెనీలో పనిచేసిన నలుగురూ దొరుకుతారు సార్' అన్నాడు.

"ఎక్కడ దొరుకుతారు, ఎక్కడ రెయిడ్ చేయాలి?" లేచాడు కిషోర్.

"ఇద్దరు నేషనల్ లాడ్జిలోనూ, ఇద్దరు క్రిష్ణా హెూటల్‌లోనూ ఇవ్వాళ ఎరేంజ్ చేసుకున్నారు సార్. ఈ టయానికి వాళ్లు అక్కడికి వచ్చి కూడా ఉంటారుసార్'

"మనం పోయి పడితే చిక్కుతారంటావా, తప్పించుకుపోతారా?"

"తప్పించుకోవడమా, వాళ్ల ముకమా! గేరంటీగా దొరుకుతారు సార్!"

"ఇంతకుముందు కూడా ఒకసారి ఒకచోటుకి ఇలాగే తీసుకుపోయి ఉత్త చేతుల్తో తీసుకువచ్చావు. నీ ఇష్టం... రెయిడ్‌లోకానీ వాళ్లు దొరక్కపోయారో... వాళ్ల బదులు నిన్ను కష్టడీకి తీసుకుని బుద్ధి చెపుతా! గట్టి ఇన్ఫర్మేషనేగదా?"

"షూర్ సార్... డవుట్ లేదుసార్!" అన్నాడు అతను.

ఒకచోటికి దాడికి వెళ్లాలనీ డ్రైవర్‌ని ఉండమనీ, జీప్ రెడీచేయమనీ ఆదేశించాడు కిషోర్. మిగతా పీసీలకి కూడా ఒక ప్రదేశానికి వెళ్లి రెయిడ్ చేయాల్సిన పని ఉంది ఉండమని చెప్పాడు.

కిషోరూ, ఇన్ఫార్మరూ మాట్లాడుకునేటప్పుడు మిగతా పీసీలు ఎవరూ లేరు. ఎస్.ఐ. గదిలోనే ఆ ఇన్ఫార్మర్ మాట్లాడాడు.

పీసీలకి ఒక్కరికి కూడా ఎక్కడికి వెళ్లాలో, ఎవరిమీద దాడి చేయాలో తెలియలేదు. కావాలనే కిషోర్ ఒక్క పీసీకి కూడా విషయం తెలియపరచలేదు.

ఒకవేళ ఫలానా ఏరియాలో, ఫలానా ప్రదేశంలో, ఫలానా గోడవున్‌మీదకో, ఫలానా ఇంటిమీదకో, ఫలానా షాపుమీదకో దాడికి పోతున్నట్లు కొందరు పీసీలకి తెలిస్తే ఇక్కడ ఇలా మాట్లాడుకుంటూ ఉండగానే అక్కడ ఆ ఫలానా ప్రదేశంలో ఆ నేరస్తులకి విషయం తెలిసిపోతుంది.

అంటే నేరస్తులకీ, చట్ట వ్యతిరేక పనులు చేసేవారికి కూడా కొందరు పోలీసులు ఇన్ఫార్మర్లుగా పనిచేస్తుంటారు.

ఆ స్టేషన్‌లో కిషోర్‌కంటే ముందు పనిచేసిన సబ్ ఇనస్పెక్టర్ ఒక రోజు లైసెన్సు లేని ఒక క్లబ్‌మీద దాడి చేయాలనుకున్నాడు. పెద్ద మనుషులు రోజూ వేలల్లో డబ్బు తగలేస్తూ పేకాట ఆడే క్లబ్ అది.

బయల్దేరడానికి ఐదంటే ఐదు నిముషాల ముందు పీసీలకి ఫలానా క్లబ్‌మీద దాడికి పోతున్నాం, సర్దుకుని రెడీగా ఉండమని చెప్పాడు. ఎస్.ఐ. అలా చెప్పాడో లేదో క్లబ్ యజమానికి ఫోన్‌మీదనే విషయం తెలిసిపో




యింది. ఈ పోలీసులు అక్కడికి వెళ్లక ముందే ఆ పేకాట పెద్దలు శుభ్రంగా సర్దుకుని జాగ్రత్తపడ్డారు.

పాపం అట్టహాసంగా వెళ్లిన పోలీసులకి చివరకి పేకాటరాయుళ్లు వదిలిపెట్టే చెప్పులు కూడా దొరకలేదు. కొంతమంది కానిస్టేబుళ్లకి ఒక్కొక్కరికి 10, 15 జతల చెప్పులు ఉంటాయి. వాళ్లు డ్యూటీలో లేనప్పుడు వెరైటీగా, బడాయిగా రోజుకో జత చెప్పులు వేసుకుని తిరుగుతుంటారు. ఆ చెప్పులు అన్నీ కూడా పేకాట ప్రియుల పుణ్యమే.

ఆ స్టేషన్ ఎస్.ఐ. బదిలీమీద వెళ్లిపోతూ చార్జి తీసుకున్న కిషోర్‌కి ఇలాంటి అనుభవాలు వివరించి చెప్పాడు. అందుకే కిషోర్ చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తున్నాడు.

రాత్రి 11 గంటలు దాటిన తరువాత కిషోర్ ఆధ్వర్యంలో పోలీసులు నేషనల్ లాడ్జిమీద దాడిచేశారు. ప్రతి గదీ వెతికారు. ఆ లాడ్జిలో ముగ్గురు యువతులు దొరికారు. సుబ్బమ్మ కంపెనీలో పనిచేసిన ఇద్దరితోపాటు మరో యువతి కూడా దొరికింది.

తరువాత క్రిష్ణా హెూటల్‌మీద వెళ్లిపడ్డారు. అక్కడ ఐదుగురు యువతుల్ని పట్టుకున్నారు. వాళ్లలో ఇద్దరు సుబ్బమ్మ కంపెనీలో పనిచేసినవాళ్లే!

ఆ అర్ధరాత్రి ఆ అమ్మాయిల్ని పోలీసులు కొట్టుకుంటూ, జుట్టుపట్టుకుని ఈడ్చుకుంటూ తీసుకువచ్చి జీపులో ఎత్తి పడేశారు.

ఆడవాళ్లని రాత్రి సమయంలో అరెస్ట్ చేయకూడదు.

పగలు అరెస్ట్ చేసినా స్త్రీ కానిస్టేబుల్ ఉండాలి.

స్త్రీలను విచారణ జరుపుతున్నప్పుడు స్త్రీ కానిస్టేబుల్ సమక్షంలోనే విచారణ జరపాలి.

ఆడవాళ్లని రాత్రిపూట అరెస్ట్ చేయడం చట్టంప్రకారం నేరం, అది శిక్షార్హం!

అయినా మన పోలీసులు పురుషులవద్ద డబ్బు తీసుకొని వదిలిపెట్టి, ఎనిమిదిమంది యువతుల్నీ తీసుకుపోయి లాకప్‌లో పడేశారు.

ఆ యువతులతో పోలీసులు పరమ నీచంగా ప్రవర్తించడం మొదలుపెట్టారు. ఆ స్త్రీలతో అసహ్యకరమైన మాటలూ, బూతులూ మాట్లాడి మనసులో అణిగిమణిగిపోయి ఉన్న కామకోర్కెల్ని నోటిమాటలద్వారా తీర్చుకునేందుకు సిద్ధమయ్యారు.

ఎస్.ఐ. కిషోర్ జలజని స్టేషన్ వెనుకవైపున ఉన్న గదిలోకి తీసుకుపోయాడు. అక్కడ ఆమెని వివస్త్రని చేశాడు.

"ఏమే... ఆరోజు నన్ను చెప్పుతో కొడతావా? అంతగా నీకు వళ్లు బలిసిందంటే... నిన్ను ఇప్పుడు పదిమంది కానిస్టేబుళ్లతో రేప్ చేయిస్తానే! నీ మొరని ఇప్పుడు ఎవడు వింటాడే! నిన్ను ఇప్పుడు ఎవడు వచ్చి కాపాడతాడే? నీకు ఎవడు అడ్డం వస్తాడే?" అంటూ బెల్టుతోనూ, సైకిల్ ట్యూబ్‌తోనూ, చైన్‌తోనూ విపరీతంగా కొట్టాడు.

కోర్టులోనూ, బయటా కూడా ఎవరికీ చూపెట్టుకోడానికీ, చెప్పుకోడానికీ వీలులేని ప్రాంతాల్లో వాతలు తేలేలా కొట్టాడు.

ఆరోజు తనని గొడవ చేసిన కసి అంతా తీర్చుకోడానికి ఆమెని భయంకరాతి భయంకరంగా హింసించాడు.

"నారాయణా... తెల్ల చీర కట్టుకుని, మల్లెపూలు పెట్టుకుంది చూడు, కొత్త పెళ్లికూతురిలా! ఆ పతివ్రతని జుట్టు పట్టుకుని ఇటు ఈడ్చుకురా. అది బాగా కొవ్వు పట్టివుంది. దాన్ని ఆ గదిలోకి తీసుకుపోయి దానికి న్యూసెన్స్ ట్రీట్‌మెంట్ ఇవ్వు. దానికి పట్టిన కొవ్వు దెబ్బకి కరిగిపోవాలి!" ఆదేశించాడు కిషోర్.

నారాయణ అనే కానిస్టేబుల్ లాకప్ రూంనుంచి ఒక యువతిని బయటకు తీసుకువచ్చాడు.

"నీ పేరేమిటే?"

"మంజు"

"మంజునా? మంజు ఏం పేరే లం... మాదిరిగా! లం... అని పెట్టుకోకపోయావూ బాగుండేది? మిమ్మల్ని ముక్కలు ముక్కలు గా కోసి కాకులకీ, గద్దలకీ వేసినా పాపంలేదే! నారాయణా... దీనికి బాగా ఇవ్వు న్యూసెన్స్ ట్రీట్‌మెంట్..." అన్నాడు కిషోర్, ఆరోజు తన చేతిని కొరికిన విషయం మదిలో మెదులుతుండగా.

ఆ పీసీ మంజుని వెనుక గదిలోకి తీసుకుపోయాడు న్యూసెన్స్ ట్రీట్‌మెంట్ ఇవ్వడానికి.

కిషోర్ కూడా ఆ రూంలోకి వెళ్లాలనుకున్నాడు కానీ జలజని కొట్టిన దెబ్బలకి విపరీతంగా అలసిపోయాడు. కనీసం కుర్చీలో నుంచి కూడా లేవలేకపోయాడు.

వెనుక గదిలోకి తీసుకుపోయిన మంజు వణికిపోతోంది. భయంతో ఆమె శరీరం కంపించిపోతోంది.

పోలీసులు ప్రయోగించే అమానుషం, పరమ దుర్మార్గమైనటువంటి థర్డ్ డిగ్రీ మెథడ్స్‌లో న్యూసెన్స్ ట్రీట్‌మెంట్ ఒకటి.

బీర్‌బాటిల్ మూతికి నూనె రాసి, కారం అద్ది స్త్రీల జననాంగాలలో దోపుతారు. దానితో వారు మంటతోటీ, బాధతోటీ గిలగిల్లాడిపోయేలా చేస్తారు. పురుషులకు అయితే మలద్వారంలో దోపుతారు.

సభ్యసమాజంలోనూ, నాగరీక ప్రపంచంలోనూ కనీసం ఊహించడానికి కూడా వీల్లేనటువంటి దారుణమైన, అతి హేయమైన చిత్రహింసల పద్ధతుల్లో ఇది ఒకటి.

ఈ న్యూసెన్స్ ట్రీట్‌మెంట్ విధానంలో సరికొత్త పద్ధతుల్ని కూడా అవలంబిస్తుంటారు.

బల్లులు, తొండలు, ఎలుకలు, చీమలు, బొద్దింకలు ఇలాంటివాటిని నేరస్తుని శరీరంమీద, ముఖ్యంగా మర్మావయవాలమీద వదిలిపెడతారు. భయంతో వాళ్లు బిర్రబిగుసుకుపోయి వెర్రిగా అరిచేస్తుంటే, కేకలు పెడుతుంటే వినోదిస్తుంటారు వీళ్లు.

మానవ శరీరంమీద అధునాతన పద్ధతుల్లో చిత్రహింసల ప్రయోగాలు చేయడంలో మానవదేహాన్ని రకరకాలుగా బాధించడం, హింసించడంలో ప్రవీణులు వాళ్లు!

ఈ ప్రావీణ్యాన్ని అభివృద్ధి చేయడాన్నే పాలకపక్షం పరోక్షంగా ప్రోత్సహిస్తున్నది. ఇంకా... ఇంకా...చిత్రహింసల పద్ధతుల్లో నూతన పరిశోధనలకూ, నూతన ప్రయోగాలకూ వీలు కల్పిస్తున్నది. ఆ నరక కూపాల నించి అమాయకుల ఆర్తనాదాలు బయట ప్రపంచానికి వినిపించకుండా ఆ చిత్రహింసల మృత్యు గుహలని సౌండ్‌ప్రూఫ్, ఎయిర్ కండీషన్డ్ చేయిస్తున్నది.

నారాయణ అనే ఆ పీసీ వెనుకగదిలో బీర్ బాటిల్ మూతికి నూనెరాసి, కారం అద్ది మంజు జననాంగంలో పెట్టాడు.

ఆ మంటని భరించలేక మంజు ఒక్కసారిగా హాహాకారాలు చేసింది. పెద్దగా ఏడ్చింది. "అమ్మా..." అని గిలగిలా కొట్టుకుంది.

మంజు ఏడుపుతో పోలీస్ స్టేషన్ ప్రతిధ్వనించింది.

"ఏమే... ఎలా వుందే... బాగుందా... రుచిగా వుందా?"

మంజుకి ఒకవైపు భరించరాని మంట... మరోవైపు మానసిక వేదన.

తీవ్ర భయాందోళనలకీ, బాధకీ మంజు శరీరం నించి చెమటలు కక్కాయి. వళ్ళంతా తడిసి ముద్దయిపోయింది.

నిస్సహాయంగా, దయనీయంగా, హృదయ విదారకంగా ఏడుస్తున్న మంజుని తీసుకువచ్చి మిగతా యువతులతోపాటు లాకప్‌లో పడేసారు.

లాకప్‌లో వున్న మిగిలిన యువతులు తమవంతు కూడా వస్తుందనీ, తమకి కూడా




బాధతప్పదనీ భయంతో వణికిపోతున్నారు.

సుబ్బమ్మ కంపెనీలో పనిచేసిన మిగిలిన ఇద్దరు యువతుల్ని వెనుక గదిలోనికి తీసుకుపోయి వాళ్ళ ఇద్దరికీ షాక్ ట్రీట్‌మెంట్ ఇచ్చారు.

ఎలక్ట్రిక్ షాక్ మనిషిని ఎంతగా బాధిస్తుందో వేరేగా చెప్పాల్సిన పనిలేదు. తక్కువ పొటెన్సియల్ విద్యుత్ సాయంతో శరీరానికి షాక్ ఇస్తారు. ఈ షాక్ కారణంగా మనిషికి చచ్చిబ్రతికినంత పనవుతుంది. ప్రాణం పోయినంతగా గిలగిల్లాడిపోతారు. ప్రధానంగా లైంగికావయవాలకు ఈ షాక్ ఇస్తారు.

ఈ షాక్ ట్రీట్‌మెంట్‌వలన అనేక సందర్భాలలో పురుషులు నపుంసకులవుతుంటారు. మతి చలించే అవకాశం కూడా వుంది.

షాక్ ఇవ్వడంతో ఒక యువతి స్పృహకోల్పోయింది. మరో యువతి భయంతో, బాధతో వెర్రిగా అరిచింది. బాధని భరించలేక జుట్టు పీక్కుంది. తల గోడకేసి బాదుకుంది.

వాళ్ళ ఇద్దర్నీ తీసుకువచ్చి లాకప్‌గదిలో పడేశారు.

చిత్రహింసలపాలు గాకుండా లాకప్‌లో మిగిలిన ఇద్దరు యువతుల్నీ అక్కడే నాలుగు దెబ్బలు కొట్టి వదిలిపెట్టారు.

రాత్రి రెండు గంటల సమయంలో కిషోర్ ఇంటికి వెళ్తూ డ్యూటీలో వున్న పీసీల్ని పిలిచి చెప్పాడు.

"ఇంటికి వెళ్తున్నాను. ఆ నలుగురితో మాత్రం జాగ్రత్తగా వుండండి. వాళ్ళని రేపు కోర్టుకి హాజరుపరుద్దాం. వాళ్ళని విడిచిపెట్టవద్దు. వాళ్ళతో మాత్రం వేషాలు వేయకండి'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆరోజు రాత్రి డ్యూటీలో నలుగురు కానిస్టేబుళ్ళు వున్నారు. ఎస్ఐ ఇంటికి వెళ్ళిన తరువాత క్రిష్ణా హొటల్‌లో దొరికిన ఇద్దరు యువతుల్ని వెనుక గదిలోనికి తీసుకుపోయారు.

వేకువజాము వరకూ ఆ నలుగురు పీసీలూ వంతులవారీగా ఆ ఇద్దరు యువతులతో గడిపారు. తెల్లవారకముందే ఆ ఇద్దర్నీ ఇంటికి పంపించివేశారు.

★ ★ ★

ఉదయం 9 గంటల ప్రాంతంలో కిషోర్ స్టేషన్‌కు వచ్చాడు.

"లాకప్‌లో వున్న లం... ల్ని ఇలా తీసుకురండి'' అని ఆజ్ఞాపించాడు.

కానిస్టేబుల్ వెళ్ళి లాకప్ తాళం తీసి, ఆరుగురు యువతుల్ని తీసుకువచ్చి ఎస్ఐ ముందు నిలబెట్టాడు.

"ఆరుగురే వున్నారు. మిగతా ఇద్దరు ఏరీ?"

"సంసారాలు చేసుకునే వాళ్ళు అంట సార్ ఆ ఇద్దరూ! భర్తలకి తెలిస్తే కాపురాలు దెబ్బతింటాయని ఏడుస్తున్నారు. స్కూళ్ళలో చదువుకునే పిల్లలు కూడా వున్నారంట! భర్తలకి తెలియకుండా రెండో ఆట సినిమాకు అని చెప్పి హొటళ్ళకి వచ్చారంట సార్! అందరికీ తెలిస్తే తల ఎత్తుకుని తిరగలేం, చచ్చిపోతామని ఏడుస్తున్నారు. అందుకని వదిలిపెట్టాం సార్!" అన్నాడు ఒక పీసీ.

"నేను వచ్చేవరకూ వుంచకపోయారా?" మామూలుగానే అన్నాడు కిషోర్. అతనికి విషయం అర్థమైపోయింది.

"అయ్యగారి ముందు ఏమిటే ఆ నిలబట్టం? చేతులు కట్టుకుని నిలబడాలని తెలీదూ?" అని మంజు చెంప చెళ్ళుమనిపించాడు ఆ కానిస్టేబుల్.

మిగతా యువతులు కూడా వణికిపోతూ చేతులు కట్టుకుని నిలబడ్డారు.

టేబుల్ ఎదురుగా నిలబడిన వాళ్ళవైపు తేరిపార చూశాడు కిషోర్.

వాళ్ళలో శాంతి ముగ్ధమనోహరంగా వుంది. అమాయకంగా, బేలకళ్లతో, సిగ్గుప

డుతూ తలవంచుకుని కళ్ళంట నీళ్ళు కారు తుండగా నిలబడివుంది.

వీరి జాలి చూపులకి తను కరిగిపోకూడదు. ఖాకీ యూనిఫారం వంటిమీదకు వచ్చినప్పటినించే జాలీ, మానవత్వంలాంటివి తమ మనసుల్లోనించి మాయమైపోయాయి.

ఆరోజు తనని మర్యాదగా, గౌరవంగా సాగనంపవచ్చు కదా! ప్రజలముందూ, పది మంది ముందూ హేళన చేశారు.

వీరికి తన ప్రతాపం చూపెట్టాలి. వీరికి ఖాకీ పవర్ తెలియాలి! మృత్యుముఖంలో వున్నా ఖాకీ అంటే గడగడవణికిపోయేలా వుండాలి.

శాంతివైపు చూశాడు. వాళ్ళ అందరి ముందూ ప్రత్యేకంగా, బంగారు మేనిఛాయతో అపురూపంగా, అద్భుతంగా వుంది.

'నువ్వు వేశ్యవి కావాల్సిన దానివి కాదే! ఏ కుబేరుడి ఇంట్లోనో, ఏ రాజమహల్‌లోనో పుట్టాల్సినదానివి!' మనసులో అనుకున్నాడు కిషోర్.

ఆరోజు తనని నవ్వులపాలూ, అవమానాలపాలూ, ఎగతాళిపాలూ చేసింది ఆమె అందమే!

వళ్ళమ్ముకునేదానికీ, నలుగురి పక్కలో పడుకునేదానికీ ఇంత అందమా? తనని పిచ్చివాడ్నీ, వెర్రివాడ్నీ చేసిన ఇంత అందం వుండటానికి దానికి వీల్లేదు! ఈ అందాన్ని అందవిహీనం చేయాలి.

"వీళ్లని స్టేషన్ వెనక్కి తీసుకపోయి కూర్చోపెట్టు! వీరి ముకాన కాసిన్ని టీ నీళ్ళు పోయించు'' కానిస్టేబుల్‌కి చెప్పాడు కిషోర్.

"రండే'' అని కదిలాడు ఆ కానిస్టేబుల్

ఆ ఆరుగురూ అనుసరించారు. అందరికంటే వెనుక శాంతి, అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగా నడుస్తోంది.

శాంతి జడ మోకాళ్ళవరకూ నల్లత్రాచు పాము మాదిరిగా వేలాడుతూవుంది. 'ఎంత పొడవు జుట్టే నీది?' అనుకున్నాడు కిషోర్.

వెళ్తున్న వాళ్ళవైపు చూస్తూ కూర్చున్న కిషోరు మనసులో ఒక ఆలోచన మెరిసింది.

బయటకు వచ్చి వరండాలో నిలబడ్డాడు. కొద్దిసేపు తరువాత ఎదురుగా వున్న కానిస్టేబుల్‌ని పిలిచి చెప్పాడు.

"టీ స్టాల్ ప్రక్కన వున్న సెలూన్‌కి వెళ్ళి మంగలి రాముని పిలుచుకురా. నేను పిలుస్తున్నానని చెప్పు"

"ఎందుకు సార్?" అడిగాడు ఆ కానిస్టేబుల్.

"పని వుంది. పిలుచుకురా''

కొద్దిసేపటికి సెలూన్‌నించి రాము వచ్చాడు "ఏంటి సార్, పిలిచారంట?" అంటూ.

రాముని స్టేషన్ వెనుకవైపుకి తీసుకుపోయాడు.

అక్కడ ఐదుగురు కూర్చుని వున్నారు. ఒకావిడ టాయిలెట్‌కి వెళ్ళింది.

"వీళ్లని రాత్రి లాడ్జిల్లో రసికుల దగ్గర పడుకుని వుంటే పట్టుకొచ్చామోయ్ రామూ: మన టౌనులో బ్రోతల్ హౌసెస్ పెరిగిపోతున్నాయి, బ్రోతల్స్ ఎక్కువైపోతున్నారు. వాళ్లని కంట్రోలు చేయమని ఎస్పీనించి రోజూ తాఖీదులు! వీళ్లకి వృత్తి మానుకోండే అని ఎన్నోసార్లు చెప్పి చూశాం. మా మాట అంటే గోటితో సమానమైపోయింది. వీరికి బుద్ధి అనేది ఏకోశానా లేదు. రెండోసారి రెండోవాడితో పోకుండా తగిన శాస్తి చెయ్యాలి!"

"నన్నేం చేయమంటారు సార్?" అడిగాడు అతను.

"వీళ్లని వరుసగా కూర్చోపెట్టి అందరికీ బోడిగుళ్ళు చెయ్యి, తరువాత మా పని మేం చేస్తాం"

అతను మౌనంగా వున్నాడు. అతనికి ఆ ఆలోచనే అసహ్యమనిపించింది. ఆ పని చేయడానికి మనస్సు అంగీకరించలేదు.




"తటపటాయిస్తావేంటోయ్... కానిచ్చి త్వరగా చేయక... అవతల మాకు చాలా పనులు వున్నాయి''

"మగవాళ్ళకి చేస్తే మళ్ళీ నాల్రోజుల్లో ఎప్పటి మాదిరిగానే వెంట్రుకలు వస్తాయి. చూస్తూ చూస్తూ ఆడవాళ్ళకి ఎలా చెయమంటారు సార్?" నసుగుతూ అన్నాడు రాము.

"నిన్ను మేం సలహాలు అడగడానికి పిలిచామా? అనవసరంగా మాట్లాడకుండా చెప్పినట్లు చేయి. మేం చెప్పిన పని చేయడానికి నీకు భయం ఏమిటి?"

"వీళ్ళకి చేయడానికి నాకు చేతులు రావడం లేదు సార్'

"ఎవడ్రా వీడు? అయ్యగారిముందే, అయ్యగారికి ఎదురుతిరిగి మాట్లాడుతున్నాడు. నువ్వు అక్కడ సెలూన్ వుంచదలుచుకున్నావా, ఎత్తేయదలుచుకున్నావా? సార్‌కి ఎదురు చెపుతావేంరా బద్మాష్?" అంటూ బారెడు పొడవు వున్న తుపాకీని భుజానికి తగిలించుకుని వున్న ఒక కానిస్టేబుల్ రాము దగ్గరకి వచ్చి పెద్దగా గర్జిస్తూ అన్నాడు.

అతని దగ్గర వున్న ఆ తుపాకీని, ఆ తుపాకీ చివర్లో మూరెడు పొడవున వున్న బాయ్‌నెట్‌నీ చూసి రాము భయపడిపోయాడు.

అది తీసుకుని పొడిస్తే ఇంకేముంది? ఆ పోలీస్ చూపులూ, ముఖంలో ఫీలింగూ చూసి రాము జంకాడు.

"నేను వస్తూ సామాను తీసుకురాలేదు సార్!" అన్నాడు అతను భయపడుతూనే తప్పించుకోవడానికి.

"సరంజామా తీసుకురాకుండా ఏం పెత్తనాలు చేయడానికి వచ్చావురా? మా స్టేషన్ చూసి పోవడానికి నిన్ను పిలిపించామనుకున్నావంట్రా?" అన్నాడు ఆ పోలీస్.

ఇంతలోనే టీ కొట్టు పిల్లవాడు టీ తీసుకు వచ్చి అందరికీ ఇచ్చాడు.

"రేయ్ బాబూ... వీళ్ళ షాపుకి వెళ్ళి మా పేరు చెప్పి బ్లేడు సెట్టూ, నాలుగు బ్లేడ్లూ తీసుకురా!" అని కానిస్టేబుల్ ఆ టీ కుర్రవాడికి పని పురమాయించాడు.

ఆ పిల్లవాడు వెళ్ళి ఐదు నిముషాల్లో అవి తీసుకువచ్చాడు.

అక్కడవున్న యువతులు అందరికీ తమకి బోడిగుండ్లు చేయబోతున్నారని తెలిసింది.

ఇద్దరు యువతులు ఏడుస్తూ వెళ్ళి కిషోర్ కాళ్ళు పట్టుకున్నారు తమని వదిలిపెట్టమనీ, కనికరించమనీ.

అయినా కిషోర్ ఏమాత్రం తొణకలేదు.

"కానీయ్... త్వరగా చెయ్..." అని రాముమీద కోప్పడ్డాడు.

రాము మనసులో బాధపడుతూనే వాళ్ళకి గుళ్ళు గీయడం మొదలుపెట్టాడు.

"వెంకన్నా... నువ్వు ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌కో, ఎక్కడికైనా సరే వెళ్ళి జీడిగింజలు తీసుకురా!" అని కానిస్టేబుల్‌కి పని పురమాయించాడు.

శాంతి వద్దకు వచ్చేసరికి గుండ్లు గీస్తున్న రాముకి ఏడుపు ఆగలేదు. కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

చేతెడు పొడవు వెంట్రుకలు... నల్లగా నిగనిగలాడుతూ... ఆమె అందం అంతా ఆ కురుల్లోనే వుంది. ఆ వెంట్రుకలే ఆమెకి శోభనిచ్చింది.

రాము ఎంతోమందికి తలలు గొరిగాడు. గుండ్లు గీశాడు. స్త్రీలకి కూడా గుండ్లుగీశాడు. కానీ, అంత పొడవు వెంట్రుకల తల గుండు గీయడం రాముకి అదే ప్రథమం.

వంగి తల గీస్తున్న రాము కన్నీళ్ళు ఆ తలమీద పడుతుండగా వెంట్రుకలు తల నించి వేరు పడిపోయాయి.

జీడిగింజలకోసం వెళ్ళిన కానిస్టేబుల్ అవి తీసుకువచ్చాడు.

ఇద్దరు కానిస్టేబుళ్ళు ఆ జీడిగింజల్ని బాగా నూరడం మొదలుపెట్టారు.

"ఇప్పుడే కాదు, వీళ్ళకి శాశ్వతంగా వెంట్రుకలు రావడానికి వీల్లేదు. వీళ్ళ జన్మ అంతా ఇలా గుండ్లతో జీవించాల్సిందే! నారాయణా... ఆ నూరిన రసం తీసుకువచ్చి వీళ్ల తలలకి పూయి. బాగా మందంగా పూయాలి..." కిషోర్ చెప్పాడు.

"ఈ జీడి గింజల రసం రాస్తే ఇక వీళ్ళకి నిజంగా వెంట్రుకలు రావాసార్?" ఒక పీసీ సందేహం వెలిబుచ్చాడు.

"ఇక వాళ్ళకి జన్మలో వెంట్రుకలు అనేవే రావు. నూనె రాసుకునే పని వుండదు. గుండ్లతోనే బతకాల్సిందే, వాటితో చావాల్సిందే!"

"గుళ్ళు చేశారు. ఆ రసం రాయవద్దు సామీ. మీ కాళ్ళకి మొక్కుతాం సామీ!" అని ఇద్దరు యువతులు పోలీసుల కాళ్ళు పట్టుకున్నారు.

పోలీసులకి మహాసంబరంగా వుంది. వీళ్ళ మాటలని వాళ్ళు లక్ష్యపెట్టలేదు.

నారాయణ ఆ నూరిన జీడిగింజల రసం వాళ్ళ తలలకి రాస్తూ "ఇంతటితో ఏమైందే మీ పని. ఇంకా ముందుందే ముసళ్ళపండగా..." నవ్వుతూ అన్నాడు.

ఆ పోలీసుల ఆనందానికి అవధుల్లేవు. వాళ్లకి చాలా ఉత్సాహంగా వుంది. ఈ దేశంలో వ్యభిచారాన్ని సమూలంగా నిర్మూలించేసినట్లు భావిస్తూ ఆనందపడిపోతున్నారు వాళ్ళు.

వీళ్ళ దుఃఖమే వాళ్ళకి ఆనందం.

ఆ స్త్రీలు సిగ్గుతో, అవమానభారంతో, బాధతో, భరించలేని వేదనతో తలలు పూర్తిగా వంచుకున్నారు.

"నలుగురు కానిస్టేబుళ్ళు వెళ్లి, వాళ్లని నాలుగు బజారుల్లో వూరేగించి వదిలిపెట్టండి!" ఆదేశించాడు కిషోర్.

"అదేంటి సార్, కోర్టుకి తీసుకుపోవద్దా?"

"ఇంకా కోర్టుకి ఎందుకులే? గుళ్ళు ఎందుకు గీసారని ఆ జడ్జిగాడు రుసరుసలాడతాడు. మనకి ఒక పనికిమాలిన నా కొడుకుని తీసుకువచ్చి వేశారు జడ్జిగా!"

"అయితే గాడిదలు తీసుకువస్తాం సార్, గాడిదలమీద వూరేగిద్దాం సార్' ఉత్సాహపడ్డాడు ఒక పీసి.

"గాడిదలూ వద్దూ, గుర్రాలూ వద్దు చెప్పినట్లు చేయండి. వాళ్ళని ఆ మెయిన్ రోడ్‌లో తిప్పి వదిలిపెట్టండి''

"కనీసం బ్యాండు మేళం అయినా పెడదాం సార్'

"మేళం లేదూ, తాళం లేదుగానీ మామూలుగానే వూరేగించండి'' చిరాగ్గా అని తన రూంలోనికి వెళ్ళాడు కిషోర్.

★ ★ ★

ఆ పట్టణంలో ప్రధాన వీధి అది.

జనం రోడ్లమీద నిలబడి వేలం వెర్రిగా, విచిత్రంగా చూస్తున్నారు.

కొంతమంది పోలీసుల చర్యని అసహ్యంతో చీదరించుకుంటున్నారు. కొంతమంది సంతోషంగా కేరింతలు కొడుతున్నారు.

ముగ్గురు పోలీసులు ముందు నడుస్తుండగా, బోడిగుండ్లతో ఆరుగురు యువతులు వారివెంట వున్నారు. ఆ యువతుల వెనుక ముగ్గురు పోలీసులు వున్నారు.

'మేం వ్యభిచారిణులం.

ఇంక ఎప్పుడూ వ్యభిచారం చేయం'

అని రాసిన అట్టలు వారి మెడలో వేలాడుతున్నాయి.

ఆకతాయి కుర్రవాళ్ళు ఆ పోలీసుల వెంటా, ఆ యువతుల వెంటా కొంతదూరం అనుసరిస్తున్నారు.

క్షణాల్లో సమాచారం ఆ పట్టణంలో వున్న విలేకరులకూ తెల్సింది.







కొద్దినిముషాల్లోనే విలేకరులూ, ఫొటోగ్రాఫర్లూ వాలారు.

“పేపరోళ్ళు వార్త రాసుకుంటే రాసుకున్నారు. వాళ్ళు ఏం పగలబొడుస్తారు కానీ ఫొటోలు చిక్కితే కొంప మునిగిద్దేమొ! అది సాక్ష్యంగా చెల్లుబాటు కావచ్చుగా? పైగా మన ముకాలు కూడా కనబడతాయి!” ముందు నడుస్తున్న పీసీ అన్నాడు ప్రక్కన వున్న పీసీతో.

“అవును. రేపు ఎస్‌ఐ బాగుంటాడు! మధ్యలో మనం ఇరుక్కుపోతాం. మన కెందుకు వచ్చిన బాధా? ఆ ఫొటోగ్రాఫర్లని ఫొటోలు తీయకుండా తరిమేస్తే పోతుంది'' అన్నాడు ప్రక్క పీసీ.

అతను వెళ్ళి వెనుకవున్న కానిస్టేబుళ్లతో ఒక్క నిమిషం విషయం మాట్లాడాడు. అంతే, ఆరుగురు పీసీలూ వెళ్ళి ఫొటోగ్రాఫర్లమీద పడ్డారు.

అప్పటికే ఇద్దరు ముగ్గురు ఫొటోగ్రాఫర్లు తమ కెమేరాల్ని క్లిక్‌మనిపించారు.

పోలీసులు దౌర్జన్యంగా వాళ్ల చేతుల్లోని కెమేరాల్ని లాక్కున్నారు. వాటిలోని రీళ్లని తీసిపారేశారు.

ఒక ఫొటోగ్రాఫర్ తన కెమేరాని ఇవ్వడానికి నిరాకరించాడు. దాన్ని పోలీసుల చేతికి చిక్కనివ్వకుండా గట్టిగా పట్టుకున్నాడు.

ఆ ఫొటోగ్రాఫర్ని పోలీసులు ఎడా పెడా కొట్టారు. అతన్ని క్రిందపడవేసి, అతని చేతిలోని కెమేరాని లాక్కునే ప్రయత్నం చేశారు.

ఆ తోపులాట, తొక్కిసలాటలో కెమేరా నుగ్గునుగ్గయిపోయింది. ఆ ఫొటోగ్రాఫర్ని కొడుతుంటే అడ్డం పోయిన విలేఖరులకీ, ఇతర ఫొటోగ్రాఫర్లకి కూడా దెబ్బలు పడ్డాయి.

చివరకి పోలీసు లాఠీల బలం ముందు విలేఖరుల బలం వీగిపోయింది.

హెచ్చరిక పత్రిక ఫొటోగ్రాఫర్ రమణ. మహాచురుకైన వాడు. అతను కాంట్రాక్టు పద్ధతిలో ఆ పత్రికకు ఫొటోలు తీస్తాడు.

వయస్సుకు చిన్నవాడు. నిండా 20 ఏళ్ళు కూడా నిండని వాడు.

అతని తండ్రికి ఆ పట్టణంలో పెద్ద ఫొటోస్టూడియో కూడా వుంది. రమణ మంచి ఫొటోగ్రాఫర్.

అందరికంటే ముందే స్పాట్‌కి వచ్చిన రమణ ఆ యువతుల్ని పోలీసులు బజారులో తిప్పటాన్ని తన కెమేరాలో భద్రపరిచాడు.

అతను తన పని పూర్తిచేసుకుని టీ త్రాగడానికి దగ్గర్లో వున్న టీ స్టాల్‌కి వెళ్ళాడు. అక్కడ అతని మిత్రుడు కనపడితే అతనితో మాట్లాడుతూ కొంత ఆలస్యం చేశాడు.

టీ తాగి, తరువాత స్కూటర్ మీద వస్తూవుంటే గలభా, జనం వున్నారు.

అక్కడ ఇతర పత్రికల ఫొటోగ్రాఫర్లమీద పోలీసులు దౌర్జన్యం చేయడం కనిపించింది. నిమిషం కూడా ఆలస్యం చేయకుండా ఆ దృశ్యాల్ని కొద్దిదూరంనించే తన కెమేరాతో క్లిక్‌మనిపించాడు.

మరుసటిరోజు అన్ని పత్రికలలో నిర్భాగ్యులైన పేద అమ్మాయిల్ని పోలీసులు అల్లరి చేయడం, ఫొటోగ్రాఫర్లూ, విలేకరులమీదా దౌర్జన్యం చేయడం గురించిన వార్తలు వచ్చాయి. ఆ అమ్మాయిలకి గుండ్లుగీసి, అవమానకరంగా, అనాగరికంగా, నీచంగా వీధుల్లో తిప్పటాన్ని గురించి అందరు విలేకరులూ తీవ్రంగా విమర్శిస్తూ వార్తగా రాశారు.

హెచ్చరిక పత్రిక మొదటిపేజీలోనే ఫొటోలు కూడా ప్రచురించింది. రంగుల్లో, ఆకర్షణీయంగా, కళ్ళకు కట్టినట్టే, కళ్ళముందు చూస్తున్నట్టే ఆ ఫొటోలు వున్నాయి.

ఫొటోలేగాకుండా సమగ్రమైన వార్త కూడా ఇచ్చాడు కళాధర్. ఆ వార్త ప్రజల్లోనే గాకుండా పోలీసువర్గాల్లో కూడా చర్చనీయాంశంగా తయారైపోయింది.

ఆ అమ్మాయిల తలలు గుండ్లు గీయడం, బజార్లంట తిప్పటం వెనుకవున్న పూర్వరంగాన్ని కళాధర్ వెల్లడించాడు.

ఎస్ఐ కిషోర్ సుబ్బమ్మ కంపెనీకి పోవడం, అక్కడ అతను గొడవపడటం కళాధర్ వివరంగా రాశాడు. ఆ అమ్మాయిల్ని పోలీసులు స్టేషన్‌లో చిత్రహింసలు పెట్టడం, వాళ్ళు నిజంగా నేరం చేస్తే కనీసం కోర్టుకి కూడా హాజరు పరచకుండా వదిలిపెట్టడాన్ని కళాధర్ ప్రశ్నించాడు.

'గంజాయి ఏమైంది?'

అని సబ్‌హెడ్డింగ్‌తో మరో వార్త కూడా అందులో రాశాడు.

ఫలానా తేదీన, ఫలానా నెంబరు గల కారులో, ఫలానా ప్రదేశంలో దాదాపు 4 లక్షల విలువచేసే గంజాయిని కిషోర్ స్వాధీనం చేసుకున్నట్లు తెలుస్తోంది. అని కూడా రాశాడు.

ఆ గంజాయిని కిషోర్ ప్రభుత్వానికి స్వాధీనం చేయలేదనీ, ఎవరికైనా అమ్ముకుని వుండవచ్చనీ కళాధర్ తన వార్తలో సందేహం వెలిబుచ్చాడు.

అమ్మాయిల విషయంలో పోలీసు అధికారులు పట్టించుకోకపోయినా, గంజాయి విషయమ్మై కదిలారు.

గంజాయి విషయంలో ఎస్పీ శాఖాపరమైన విచారణకు ఉత్తర్వులు ఇచ్చాడు. డిఎస్పీని విచారణ జరిపి, వెంటనే రిపోర్ట్ ఇవ్వమని ఎస్పీ ఆదేశించాడు.

వ్యభిచారిణిల్ని పోలీసులు హింసించడాన్ని జిల్లాలో చాలా ప్రజాసంఘాలు ఖండించాయి. నిరసన తెలిపాయి. అన్ని సంఘాలూ కలిపి సంయుక్తంగా ఒక సభని కూడా ఏర్పాటు చేశాయి.

అయితే ఇవి అన్నీ దున్నపోతుమీద రెండు చినుకులు పడిన చందమే!




ప్రభుత్వం ఆ విషయంలో ఏమీ స్పందించలేదు. కనీసంగా కూడా పట్టించుకోలేదు.

★ ★ ★

"ఈ కంచిపట్టుచీరలో నిన్ను చూస్తుంటే... ఎంత అందంగా వున్నావు డియర్... నిన్ను చూడటానికి రెండు కళ్ళూ చాలడంలేదు. సిన్మాయాక్టర్లు నీ కాలిగోటికి సరితూగరు!"

"నిజంగా అంత బాగున్నానా?"

"చెప్పలేనంత బాగున్నావు. నీలాంటి అందగత్తె భార్యగా దొరకడం నాకు నిజంగా అదృష్టమే అనుకో!"

"మీలాంటి అందగాడు దొరకడం కూడా నాకు అదృష్టమే!"

"ఈరోజు మన మ్యారేజీడే... హ్యాపీగా చేసుకుందాం డియర్..."

"ష్యూర్... అందుకే గదా ఇంత ఖరీదైన కంచిపట్టుచీర... ఇన్ని కేజీల మల్లెపూలూ..."

"సంవత్సరానికి మన ఇద్దరికీ కలిపి వుమ్మడిగా ఒక్క రోజు వచ్చే పండుగ ఇది. మన ఇద్దర్నీ ఏకం చేసిన రోజు ఇది. మళ్ళీ వచ్చే సంవత్సరం ఈ రోజువరకూ ఎదురు చూసేలా వుండాలి. అదీ ఈ రోజు స్పెషాలిటీ!"

"హాయిగా... ఆనందంగా... హ్యాపీగా"

"మీ ఇష్టం. మీ ఆనందమే నా ఆనందం. మీ సుఖమే నా సుఖం" రేణుక అన్నది.

రేణుకా, లక్ష్మణరావూ భార్యాభర్తలు.

లక్ష్మణరావు లక్ష్మీపుత్రుడు. ఆ పట్టణంలో వున్న పారిశ్రామిక వేత్తల్లో అతను ఒకడు.

ఆయనకి బాయిల్డ్ రైస్‌మిల్ వుంది. సెలైన్ సీసాల ఫ్యాక్టరీ వుంది. బోలెడు డబ్బూ, ఎన్నో ఆస్తులూ వున్నాయి.

రాత్రి 10 గంటలవుతోంది.

భార్యాభర్తలు ఇద్దరూ పడకగదిలో కూర్చుని విదేశీ విస్కీ సేవిస్తూ ఉన్నారు.

"మన మ్యారేజీడేకి అని నీకోసం ప్రత్యేకంగా కంచినించి తెప్పించిన ఈ పట్టుచీర నీ వొంటికి బాగా నప్పింది రేణూ! 50 వేలు ఖరీదు అయితేకానీ, చీర ఎంత బావుందీ. ఈ చీరలో నువ్వు ఇంకా ఎంత బావున్నావో!"

"మీ ఆఫీసులో పనిచేసే నీలిమకంటే నా?"

"అబ్బా... ఇంత ప్రశాంతవేళ దాని ఊసు ఎందుకు? తిండికి గతిలేనిది. అది నీతో పోల్చుకుంటే ఎందుకు పనికివస్తుంది? సరే చూడూ, వచ్చే ఏడాది మన మ్యారేజీడేనాటికి నీకు బాంబేనించి బ్రహ్మాండమైన నెక్లెస్ ఇంకొకటి తెప్పిస్తా. అది వేసుకుంటే నువ్వు ప్రపంచ సుందరివైపోతావనుకో!"

"మూడు సంవత్సరాలనుంచీ అంటున్నారు. మహా అయితే 15, 20 లక్షలు అవుతుందేమో మీరు తెప్పించే హారం. మీరు తెప్పించేది ఎప్పుడూ, నావంటి మీదకు వచ్చేది ఎప్పుడూ? మద్రాస్‌నించి ఈ 3 లక్షల నెక్లెస్ తెచ్చి 3 ఏళ్లు సణిగారు"

"ఈ ఏడాది ఖచ్చితంగా తెప్పిస్తా చూడు"

లక్ష్మణరావు ఆమెని పెనవేసుకుపోయాడు.

ఆ రాత్రి లక్ష్మణరావు తాగి, తూలి, విచ్చలవిడిగా ప్రవర్తించాడు.

తెల్లవారి 10 గంటల ప్రాంతంలో బద్ధకంగా, నీరసంగా, ఒళ్లు విరుచుకుంటూ నిద్రలేచింది రేణుక.

అప్పటికే లక్ష్మణరావు ఫ్యాక్టరీకి వెళ్లిపోయాడు.

పనిమనుషులు ఇద్దరుగాక ఇంట్లో రేణుక ఒక్కతే ఉంది.

పిల్లలు వేసవి సెలవులకి రేణుక తల్లివద్దకు వెళ్లారు.

"అమ్మగారూ... కాఫీ తెచ్చి

ఇమ్మంటారా?" పనిమనిషి ప్రభావతి వచ్చి అడిగింది.

"తీసుకురా... అలాగే బ్రష్‌మీద పేస్ట్ కూడా వేసి తీసుకురా. బడలికగా ఉంది'' అంది రేణుక పడుకునే.

ప్రభావతి కాఫీ తెచ్చి ఇస్తే బెడ్‌మీద నుంచి దిగకుండానే సేవించింది రేణుక. తరువాత బ్రష్ తీసుకుని బాత్‌రూంలోకి వెళ్లింది.

శరీరం అంతా తూలిపోతున్నట్లు ఉంది.

"కూరలు ఏం చేయమంటారు అమ్మగారూ?" అని ఆండాళమ్మ వచ్చింది.

"చికెన్ బిర్యానీయో, ఏదో చెయ్ ఈ పూటకి..." అంది రేణుక.

ఆండాళమ్మ కూరలు చేయడానికి వంటగదిలోకి వెళ్లింది.

ఆండాళ్లమ్మా, ప్రభావతీ తల్లీకూతుళ్లు. వాళ్లది అక్కడికి 50 కి.మీ. దూరంలో ఉన్న పల్లెటూరు.

ఆండాళమ్మ భర్త మరణించాడు. ఆ పల్లెలో పనులు లేకా, తిండికి జరగకా, ఉపాధికోసం కూతుర్ని తీసుకుని, తెలిసిన వారి సహాయంతో పట్టణానికి చేరుకుంది ఆమె.

ప్రభావతి పదవ తరగతి తప్పింది. కూతురికి ఏదైనా చిన్న ఉద్యోగం చూడాలనేది ఆ తల్లి కోరిక.

పెద్ద పెద్ద డిగ్రీలు చదివిన వాళ్లకే ఈరోజుల్లో ఉద్యోగాలు దొరకడం అంతంతమాత్రం! ఇక ప్రభావతికి అంత తేలిగ్గా ఉద్యోగం దొరుకుతుందా?

తల్లీకూతుళ్లు ఇద్దరూ లక్ష్మణరావు ఇంట్లో పనికి కుదిరారు.

లంకంత మేడ అది. ఆ మేడని కడగటానికీ, తుడవటానికే ఒక మనిషికి రోజంతా పని సరిపోతుంది.

వంట చేయడం, బట్టలు ఉతకడం, మొక్కలకి నీళ్లు పెట్టడం, పిల్లల్ని సముదాయించడం, వాళ్లని స్కూళ్లకి పంపించడం... ఈ పనులు అన్నీ తల్లీకూతుళ్లు చేయాలి.

లక్ష్మణరావు ఫ్యాక్టరీ, బాయిల్డ్ రైస్‌మిల్ పనులూ చూసుకుంటాడు.

రేణుకకి పార్టీలకీ, క్లబ్‌లకీ, సినిమాలకీ తిరగడానికే టైమంతా సరిపోతుంది.

డబ్బు విషయంలో ఆ భార్యాభర్తలవి భిన్నధృవాలు. డబ్బుదగ్గిర లక్ష్మణరావు పిసినారితనంతో ఉంటాడు. రేణుక విచ్చలవిడిగా ఖర్చుచేస్తుంది. వాళ్లకి వ్యాపారాలమీద అపారంగా ఆదాయాలు వస్తుంటాయి కాబట్టి లక్ష్మణరావు భార్య డబ్బు దుబారా విషయంలో పెద్దగా పట్టించుకోడు. పైగా రేణుక వస్తూనే లక్షల రూపాయల కట్నం వెంటబెట్టుకుని వచ్చింది.

స్నానం అయిన తరువాత టిఫిన్ చేసింది. ఒక ఫ్రెండ్ ఇంటికి వెళ్లాలని త్వరత్వరగా ముస్తాబు అయింది.

ఇంతలో వేరే ఇద్దరు ఫ్రెండ్స్ వచ్చారు. వాళ్లతో కూర్చుని కబుర్లు మొదలెట్టింది. వాళ్లు మధ్యాహ్నంవరకూ కూర్చుని వెళ్లిపోయారు.

కారు డ్రైవర్ వచ్చి లక్ష్మణరావుకి కేరియర్‌లో ఫ్యాక్టరీ దగ్గరికి భోజనం తీసుకుపోయాడు.

వీసీపి ఆన్ చేసుకుని ఇంగ్లీషు పిక్చర్ చూస్తూ కూర్చుంది రేణుక.

సినిమా చూస్తున్న రేణుకకి హఠాత్తుగా నెక్లెస్ విషయం గుర్తుకువచ్చింది.

రాత్రి దానిని తీసి టీపాయ్‌మీద పెట్టింది. మరుసటిరోజు ఉదయం దాచిపెట్టుకోవచ్చు అనుకుంది.

అప్పటికైనా గుర్తుకు వచ్చినందుకు సంతోషించి, గబగబా మేడ మెట్లు ఎక్కి పడకగదిలోకి వెళ్లిచూసింది.

లోనికి వెళ్లి చూసిన రేణుక భయంతో వణికిపోయింది. టీపాయ్‌మీద నెక్లెస్ లేదు.




3 లక్షల రూపాయలకు కొన్న నెక్లెస్ అది.

ఏమైనట్లు...?

రాత్రి టీపాయ్‌మీద పెట్టినట్లు తనకి గట్టిగా గుర్తు! లక్ష్మణరావు ఫ్యాక్టరీకి వెళ్తూ తీసి దాచిపెట్టాడా?

తను కూడా లేట్‌గా లేచివుంటాడు. తను తీసి దాచిపెట్టే అవకాశం తక్కువ.

చూస్తే తెలుస్తుందికదా అనుకుని రేణుక ఆ నెక్లెస్ దాచివుంచే స్థలంలో చూసింది. అక్కడ లేదు. అంటే లక్ష్మణరావు తీయలేదన్నమాట!

తను ఎక్కడైనా వేరే ప్రదేశంలో దాచిపెట్టి మర్చిపోయానా అని తనకి తనే సందేహపడి స్టోర్‌వెల్స్, ఇనప్పెట్టి, అల్మారాలూ, బెడ్‌కిందా అన్నీ దాదాపు గంటసేపు వెదుకులాడింది. ఎక్కడా లేదు. మరి ఏమైనట్లు?

లక్ష్మణరావుకి ఫోన్‌చేసింది రేణుక.

"హలో... నేను రేణుకని మాట్లాడుతున్నాను. నెక్లెస్ కనబడటంలేదు. మీరు ఏమైనా ఉదయం తీసి దాచారా?"

"లేదు రేణుకా... అసలు నేను దాన్ని చూడనుకూడా లేదు. ఎక్కడ దాచిపెట్టావో గుర్తుచేసుకో! మన ఇంట్లో ఎక్కడకు పోతుంది? ఎక్కడో పెట్టి మర్చిపోయి వుంటావు! వెదుకు దొరుకుతుంది"

"గంటనించీ అన్నీ వెదుకులాడానండీ! ఎక్కడా కనపడలేదు"

"సరే... నేను వస్తున్నా. నువ్వేం వర్రీకావద్దు" అని లక్ష్మణరావు ఫ్యాక్టరీనుంచి వెంటనే ఇంటికి వచ్చాడు.

ఇద్దరూ కలిసి అన్నీ మళ్లీ వెదుకులాడారు. ఎక్కడా కనపడలేదు.

"నాకు బాగా గుర్తు, రాత్రి నేను ఈ టీపాయ్‌మీదనే పెట్టానండీ! అప్పటికే బాగా పొద్దుపోయింది. రేపు ఉదయం దాచిపెట్టుకోవచ్చులే అని ఇక్కడే పెట్టాను" బావురమని ఏడుస్తూ అంది రేణుక.

భర్తని 3 సంవత్సరాలు పోరుపెట్టి మద్రాస్‌నుంచి తెప్పించుకుంది ఆ నెక్లెస్. తెప్పించుకున్నన్ని రోజులు లేదు! అది ఇవ్వాళ మార్కెట్లో 4 లక్షలకు తక్కువ ఇవ్వరు.

"రాత్రి నీ మెడలో ఉండటం నేను కూడా చూశా! తెల్లారేపాటికి మన ఇంటికి దొంగలు ఎవరు వస్తారు? మన ఇంటికి ఇవ్వాళ ఎవరెవరు వచ్చారు?"

"సరోజా, సరస్వతీ ఉదయం వచ్చారండీ! కిందనే గంటసేపు కూర్చుని మాట్లాడి అటునుంచి అటే వెళ్లిపోయారు. ఇంక ఎవరూ రాలేదు ఇవ్వాళ"

"బయటివాళ్లెవరూ రాలేదు. అంటే ఇంట్లోవాళ్లకి తెలియకుండా వస్తువు ఎక్కడికీ పోదు. మొత్తానికి ఇది ఇంట్లోవాళ్లపనే! మన ఇంట్లో ఎవరు ఉన్నారు? నువ్వూ నేనూ కాకుండా ఆండాళమ్మా, దాని కూతురూ!"

"అవును... మనం నలుగురమే ఉంటున్నాము ఇంట్లో"

"మన సొమ్ము మనం ఎందుకు దొంగతనం చేసుకుంటాం? ఇది ఆండాళమ్మా, దాని కూతురు పనే! అనుమానం లేదు. వాళ్లు ఈ గదిలోకి వచ్చారా?"

"ఎందుకు రాలేదు? ఉదయంనుంచీ ఈ గదిలోనే ఉన్నారు. నేను నిద్ర లేవకముందే గది శుభ్రంచేశారు. నేను పదింటికి నిద్రలేస్తే నాకు కాఫీ కలిపి ఇచ్చారు. నేను బాత్‌రూంనుంచి వచ్చేసరికి ప్రభావతి టీపాయ్ మీద ఉన్న మ్యాగజైన్ చూస్తూకూర్చుంది"

"ఇంక డౌట్‌లేదు. ఇది ఖచ్చితంగా వాళ్లపనే!"

"వాళ్లు ఐదు నెలలనుంచీ పనిచేస్తున్నారు. మనుషులు నమ్మకస్తులేనండీ! నేను చాలాసార్లు కనిపెట్టాను. ఇంతవరకూ చిన్న పూచికపుల్ల కూడా తాకలేదు"

"అయితే ఎవరు తీసివుంటారు చెప్పు?

ఇంట్లోకి బయటివాళ్లెవరూ రాలేదంటున్నావు. తల్లీకూతుళ్లే ఈ గదిలోకి వచ్చారంటున్నావు. పిచ్చి రేణుకా... పూచిక పుల్లతాకరు, నిజమే... కంటికి ఎదురుగా నాలుగు లక్షల వస్తువు కనబడుతుంటే ఎవరుమాత్రం తీయకుండా ఉంటారు? చిన్నా చితకా దొంగతనం చేసేకంటే కొట్టేదేదో జాక్‌పాట్ కొట్టడం మంచిదికదూ?''

ఆండాళమ్మనీ, ఆమె కూతుర్నీ అడిగారు.

"మీరు తప్ప ఇంట్లోకి ఎవరూ రాలేదు. బుద్ధిగా తీసిన వస్తువు ఇస్తారా ఇవ్వండి, లేకపోతే చాలా గొడవ అవుతుంది. కావాలంటే మీకు వెయ్యో, రెండువేలో డబ్బు ఇస్తా!"

"మేం కూటికి పేదవాళ్లమి అయినా గుణానికి పేదవాళ్లమి కాదు. మాకు అన్నెం పున్నెం తెలియదు. మేం ఆ వస్తువుని కంటితో చూడలేదు''

"మీ ఇష్టం. మర్యాదగా వస్తువు ఇవ్వండి. మీకు తెలియకుండా ఇంట్లోకి ఎవడు వచ్చి తీస్తాడే దొంగముండల్లారా... మీలాంటి అలగా ముండల్ని చేరదీయడమే తప్పు!"

"మీరు ఎన్ని అయినా అనండి... ఆ దేవుడి సాక్షిగా, సత్యప్రమాణకంగా మాకేమీ తెలియదు''

"మీరు నోటిమాటలతోటీ, అయ్యా అమ్మా అంటే వినరే! మీనుంచి వస్తువు ఎలా తీసుకోవాలో నాకు బాగా తెలుసు. మీలాంటి దొంగవెధవల్ని రోజూ నేను ఎంత మందిని చూట్టంలేదూ ఫ్యాక్టరీలోనూ, బాయిల్డ్ మిల్‌లోనూ? పోలీసుల్ని పిలిపించి నాలుగు తన్నిస్తేకానీ మీరు దారికి రారు. బతిమిలాడితే మాట వింటారంటే మీరు?"

"పెళ్లి కావాల్సిన పిల్ల ఇది. మా జాతకం బాగలేక ఇలా పనిమనుషులుగా పాచిపని చేయాల్సిన కర్మ పట్టింది. ఒకప్పుడు పరువుగా, బాగా బతికినవాళ్లం బాబూ మేము! మీకు పుణ్యం ఉండిద్ది. మమ్మల్ని బజారు ఎక్కించవద్దు. మాకు నిజంగా తెలియదు!" ఏడుస్తూ అంది ఆండాళమ్మ.

"నువ్వు దొంగ ఏడుపులు ఏడవద్దు! నీ ఏడుపుకి ఇక్కడ ఎవరూ కరిగిపోరు. తీసిన వస్తువు మంచిగా ఇవ్వండీ, మూడో కంటివాడికి తెల్లియనివ్వం. మీకు కావాలంటే 2 వేలు డబ్బు కూడా ఇస్తాం".

"మీ సొమ్ముకి మేం పుట్టలేదయ్యా! అసలు ఆ నెక్లెస్సు ఎలాంటిదో కూడా మేం చూడలేదు. మీరు సరిగా వెదుకులాడుకోండయ్యా, దొరుకుతుంది''

"ఇంక ఎక్కడ వెదుకులాడుకోమంటావే? పొద్దుట్నించీ అన్నీ వెదుకులాడి వెదుకులాడి అలిసిపోతే! సరే... బీరువా తాళాలు కూడా ఇవిగో... నువ్వు వెదుకులాడు. నీ చేతికి అది దొరికితే నీకు బహుమానం కూడా ఇస్తా!"

"నేను ఎక్కడ చూసేదయ్యా... నాకేం తెలుసు. మీరు ఎక్కడ దాచిపెట్టుకుంటారో ఏమో..." అని తాళాలు తీసుకోడానికి నిరాకరించింది ఆండాళమ్మ!

వెదుకులాడినట్లు నటించి, ఫలానాచోటులో పడివుందనీ, తీసుకున్న వస్తువు తెచ్చి ఇస్తుందనే ఉద్దేశంతో లక్ష్మణరావు వెదుకులాడమని చెప్పాడు.

"వెదుకులాడూ... మంచి మాటలతో బతిమిలాడితే తీసుకున్న వస్తువు అంత తేలిగ్గా ఇస్తారంటే మీరు? పోలీసుల చేతుల్లో నాలుగు తన్నులు పడితేకానీ లొంగరే! దెబ్బ పడితేనే దెయ్యం వదిలేది! చివరిసారిగా అడుగుతున్నా... ఇస్తారా, పోలీస్ కంప్లయింట్ ఇవ్వమంటారా?" లక్ష్మణరావు హెచ్చరిస్తూ కోపంగా అన్నాడు.

"తీసుకోని వస్తువుని ఎక్కడనుంచి తెచ్చి ఇమ్మంటారయ్యా మమ్మల్ని? మేం పొద్దున మీ ఇంటికి పనికి వచ్చిన తరువాత కోడికోసమని నేను ఒక్కదాన్నే బయటికి వెళ్లా. ఇంక ఎక్కడికీ వెళ్లలేదుగా! మీరు కావాలంటే




మమ్మల్ని సోదాచేసుకోండి. తీసుకున్న వస్తువు మా దగ్గిరే ఉండాలికదా?" అంది ఆండాళమ్మ.

"ఇక వీళ్లతో లాభంలేదండీ... నేను మనుషులు మంచివాళ్లు అనుకున్నాకానీ, ఇలా తిన్న ఇంటివాసాలే లెక్కపెడతారనుకోలేదు. పోలీస్ రిపోర్ట్ ఇవ్వటమే మంచిది'' అంది రేణుక.

"పోలీస్ రిపోర్ట్ ఇవ్వొచ్చు! ఆ పోలీసులేమో దొంగ గాడిద కొడుకులు. ఇంతకు ముందు మాదిరిగా కాదు, ఇప్పుడు విపరీతంగా లంచాలు గుంజుతున్నారు. వాళ్లకి అడ్డూ అదుపూ ఏంఉంది? కనీసం 20 వేలో, 25 వేలో కాజేస్తారు. చూస్తూ చూస్తూ అంత డబ్బు ఎక్కడ పోగొట్టుకుందాం? సరే, వాళ్లకి అంత ఇచ్చేకంటే మీకు 5 వేలు ఇస్తా. వస్తువు ఇవ్వండే!" అన్నాడు లక్ష్మణరావు.

వాళ్లనుంచి ఏమీ జవాబు లేదు.

లక్ష్మణరావు లోపలికి వెళ్లి 50 రూపాయల నోట్లకట్టలు రెండు తీసుకువచ్చాడు.

"ఇదిగో ఈ 5 వేలూ తీసుకొని వస్తువు మాది మాకు ఇవ్వండే. ఎందుకు ఇబ్బంది పెడతారు? ఈ డబ్బు మళ్లీ తీసుకుంటాం అనుకోవద్దు! ఇచ్చిన సొమ్ముకీ కక్కిన కూటికీ ఆశపడేవాళ్లం కాదు మేము!"

"మీ సొమ్ము మాకు ఎందుకయ్యా? మేం ఆ వస్తువు తీసుకుని ఏం చేసుకుంటాం?" అంది ఆండాళమ్మ.

ఇక అడిగి ప్రయోజనం లేదని తల్లీకూతుళ్లు ఏడుస్తున్నా వినిపించుకోకుండా లక్ష్మణరావు ఆ రెండు నోట్లకట్టలూ తీసుకుని కంప్లయింట్ ఇవ్వడానికి కారు వేసుకుని పోలీస్ స్టేషన్‌కి వెళ్లాడు.

★ ★ ★

ఎస్.ఐ. కిషోర్ తన రూంలో కూర్చుని ఒక హత్య కేసుకి సంబంధించిన ఫైల్ చూస్తున్నాడు.

లాకప్‌లో ఒక ముసలి వ్యక్తీ ఇద్దరు యువకులూ నిలబడి తలుపు చువ్వల్ని పట్టుకుని "ఆకలవతంది... టీనీళ్లు ఇప్పించండి సార్... సార్..." అని ఎదురుగా ఉన్న కానిస్టేబుల్‌ని బతిమిలాడుతున్నారు.

"రేయ్... నోర్మయ్యండి ఆకలవతందిరాలం... కొడకల్లారా... టీ కావాలీ... చికెన్ బిర్యానీ వద్దూ... మీ అమ్మ మొగుడి సొమ్ము ఏమైనా తీసుకొచ్చి మాకు ఇచ్చార్రా మీకు టీ పోయించడానికి..." అని ఆ కానిస్టేబుల్ వాళ్లని బూతులు తిడుతున్నాడు.

ఇంతలో స్టేషన్ ఆవరణలోనికి కారు వస్తున్న శబ్దం వినిపించి, కిషోర్ కిటికీలో నుంచి బయటకు చూశాడు.

లక్ష్మణరావు డోరు తీసుకుని కారులోనుంచి దిగుతూ ఉన్నాడు. కూర్చున్న కిషోర్ లేచి ఆయనని సాదరంగా ఆహ్వానించాడు.

"రండి సార్... బావున్నారా... ఏమిటీ పనిమీద వచ్చారూ? ఫోన్ చేస్తే మేమే వచ్చివుండేవాళ్లం కదా సార్? ఏమిటీ విశేషాలూ..." వినయంగా అడిగాడు కిషోర్.

అతని ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని లక్ష్మణరావు విషయం వివరంగా చెప్పాడు.

"ఈరోజుల్లో ఇళ్లలో బయటి దొంగలు పడి దోచుకోవడం తగ్గిపోయింది సార్. మనం పెట్టుకున్న పనిమనుషులే దోచుకుంటున్నారు. రామరాజు లేడూ... జిల్లా పార్టీ ప్రెసిడెంటు. వాళ్ల ఇంట్లో కూడా ఇలాగే పనిమనిషే బీరువా తాళాలు తీసి 2 లక్షల రూపాయల గోల్డ్ కాజేసి పారిపోయింది. ఆయన వచ్చి మీలాగే ఇలానే రిపోర్ట్ చేశాడు. వారంరోజులకి దాన్ని ఏదో ఊళ్లో ఉంటే పట్టుకున్నాం. నాకు తెలీదంటే తెలీదనీ, తగాదా పడి అక్కడ పని మానుకుని వచ్చానని బుకాయించింది. పదిరోజులు లాకప్‌లో పెట్టి చర్మం వలిచేసరికి చివరికి ఒప్పుకుంది. తీసుకుపోయి దాని చెల్లెలి మొగుడికి ఇచ్చింది''

"వీళ్లు కూడా మాకు తెలియదని ఏడుస్తు న్నారు''

"తెలియదనక తెలుసు అని ఇవ్వరుకదా! నాలుగు రోజులు లాకప్‌లో పెట్టి నాలుగు తంతే వాళ్లే ఇస్తారు. వీళ్లు కాకుండా మీ ఇంటికి కొత్తవాళ్లు ఎవరూ రాలేదుకదా?"

"కొత్తవాళ్లు రాలేదూ, పాతవాళ్లు రాలే దూ! నెక్లెస్ రాత్రి ఉంది, ఉదయానికి మాయ మైపోయింది. మా ఆవిడ ఇవ్వాళ హెడేక్‌గా ఉందని బాగా లేట్‌గా లేచింది. తను లేచేసరి కే వస్తువు పోయింది''

"ఓకే సార్! రెండు రోజుల్లో మీ వస్తువు ఎక్కడ ఉన్నా వస్తుంది'' అన్నాడు కిషోర్.

"ఇవి ఉంచండి సార్'' అని లక్ష్మణరావు 50 రూపాయల నోట్లకట్ట ఒకటి తీశాడు.

ముఖం చిట్లించినట్లు అసంతృప్తిగా చూశా డు కిషోర్. "ఇప్పుడు ఎందుకు సార్... మీ దగ్గరే ఉంచండి. రేపు వస్తువు మీ చేతికి వచ్చిన తరువాత చూద్దాం"

"కాదులే సార్... ప్రస్తుతానికి ఇవి ఉంచండి. తరువాత మళ్లీ ఇస్తాను''

"చాలా తక్కువ ఇస్తున్నారు సార్. జనర ల్‌గా మేము వస్తువు వేల్యూలో ట్వంటీ, ట్వంటీఫైవ్ పర్సెంట్ తీసుకుంటున్నాం సార్. మీరు పెద్దవాళ్లు. మిమ్మల్ని అడగడం, మీ దగ్గర తీసుకోవడం భావ్యంకాదులే సార్''

"ఇప్పటికి ఇవి తీసుకోండి''

"వద్దు అన్నాకదా సార్. మీ వస్తువు మీకు ఇప్పించే బాధ్యత నాది. మీకెందుకు, నాల్రో జుల్లో మీ వస్తువు మీ చేతికి వస్తుంది''

లక్ష్మణరావు జేబులోనుంచి ఇంకొక కట్ట తీసి కిషోర్‌కి ఇచ్చాడు.

కిషోర్ మౌనంగా అవి తీసుకుని ప్యాంట్ బటన్ తీసి అండర్‌వేర్‌కి ఉన్న జేబులో పెట్టుకున్నాడు.

"ఇప్పుడే వస్తాను కూర్చోండి సార్ వె ళ్దాం" అని కిషోర్ వెనుక గదిలోకి వెళ్లాడు.

అక్కడ ఒక కానిస్టేబుల్, ఇద్దరు యువకు లూ ఉన్నారు. ఆ యువకులు ఇద్దరూ నగ్నంగా ఉన్నారు. వాళ్లు సిగ్గుతో తలకాయ వంచుకుని ఏడుస్తూ ఉన్నారు.

"కానివ్వండ్రా లం... కొడుకుల్లారా... చె ప్పిన పని చేయండి'' అని కానిస్టేబుల్ వాళ్లని లాఠీకర్రతో పశువుల్ని కొట్టినట్లు కొడు తూ అంటున్నాడు.

ఆ ఇద్దరు యువకుల్నీ ఒకరి పురు షాంగం మరొకరి మలద్వారంలో పెట్టమని గంటసేపు హింసించాడు.

తరువాత నోట్లో పెట్టుకోమని వాళ్లని కొ ట్టడం ప్రారంభించాడు.

ఆ ఇద్దరు యువకులూ జేబుదొంగలు. బస్టాండూ, సినిమాహాళ్లవద్ద జనం జేబులు కత్తిరించి డబ్బు కాజేయడం వాళ్ల వృత్తి.

వాళ్లవలన పోలీసులకి పెద్దగా ఆదాయం ఏమీలేదు. వాళ్ల పనుల కారణంగా పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి అపకీర్తి కూడా వస్తోంది.

వాళ్లని ఆ పని మానుకొమ్మని అనేకసార్లు కొట్టారు. చిత్రహింసలు పెట్టారు. జైల్లో వేశా రు.

అయినా వాళ్లు అదే వృత్తిలో బతుకుతు న్నారు. తమ దెబ్బలకీ, జైలు శిక్షలకీ వాళ్లు ఏమీ వెరవడంలేదు.

ఇక లాభంలేదని పోలీసులు వాళ్లని ఆ అనాగరిక పద్ధతిలో శిక్షించడం మొదలుపె ట్టారు. ఒక పోలీస్ స్టేషన్‌లో ఇద్దరు సాధా రణ జేబుదొంగలకు జరుగుతున్న ఘన సన్మానం అది! వాళ్లు అతి చిన్న జేబుదొంగ లే కానీ... కోట్లూ, వందలకోట్లూ కొట్టేసే హర్షద్‌మెహతా, భూపేన్ దలాల్, కృష్ణమూ ర్తిలాంటివాళ్లు కాదు! వాళ్లు చిన్న జేబుదొంగ లే!

"ఏమంటున్నారు లం... కొడుకులూ... ఏరా నా కొడకల్లారా... ఇక బస్టాండూ, సినిమా హాళ్ల ప్రాంతానికి పోవడం మాను






కుంటారా?" కిషోర్ వచ్చి అడిగాడు.

"మేము ఈసారి జేబు కత్తిరిస్తే మీరు మమ్మల్ని ఉరితీసి చంపెయ్యండి సార్. ఈ ఒక్కసారికీ వదిలిపెట్టండి సార్" అని ఆ ఇద్దరూ కిషోర్ కాళ్లు పట్టుకున్నారు.

"నాలుగు తన్ని వదిలిపెట్టు వెధవల్ని! ఈసారికానీ మీరు ఎవరిజేబైనా కత్తిరించినట్లు తెల్సిందో నేను మీ పీకలే కత్తిరిస్తా లం... కొడకల్లారా'' అన్నాడు కిషోర్.

"రండి సార్ వెళ్దాం" అని లక్ష్మణరావు దగ్గరకి వచ్చాడు.

ఇద్దరు కానిస్టేబుళ్లని కూడా వెంటబెట్టుకుని, నలుగురూ కలిసి కారులో లక్ష్మణరావు వాళ్ల ఇంటికి వెళ్లారు.

అక్కడ ఏమీ మాట్లాడకుండా ఆండాళమ్మనీ, ఆమె కూతురు ప్రభావతినీ స్టేషనుకి తీసుకువచ్చారు.

★ ★ ★

ప్రభావతినీ, ఆమె తల్లినీ పోలీసులు పదిరోజులుగా లాకప్‌లో ఉంచి నెక్లెస్ ఎక్కడ దాచారో చెప్పమని హింసిస్తున్నారు. స్త్రీలు అనే విచక్షణ కూడా లేకుండా వాళ్లని చిత్రహింసలు పెడుతున్నారు.

ఆండాళమ్మ బంధువులు ఇద్దరు ముగ్గురే ఉంటే వాళ్లు ఆ పల్లెటూరినుంచి వచ్చి పలకరించి పోయారు. చూడటానికి వచ్చిన వాళ్ల దగ్గర పోలీసులు వీళ్లని చూపెట్టినందుకు డబ్బు కాజేశారు.

ఆ బంధువులు కూడా పేదవాళ్లే! వాళ్లు వచ్చి చూసిపోవడం తప్ప వేరే ఎలాంటి సహాయమూ చేయలేని నిస్సహాయులు!

ఆండాళమ్మా, కూతురూ ఉండే పూరిగుడిసెని పోలీసులు చిందరవందర చేశారు. ఆ గుడిసెలో ఉన్న సామాన్లు అన్నీ నాశనం చేసిపెట్టారు.

లాకప్‌లో వీళ్లు చచ్చిపోకుండా రోజుమార్చి రోజూ, రెండుమూడు రోజులకి ఒకరోజూ

హోటల్‌నుంచి అన్నం తీసుకొచ్చి పెడుతున్నారు.

తల్లీకూతుళ్లు ఇద్దర్నీ వివస్త్రలని చేసి తల్లి ఎదురుగా కూతుర్నీ, కూతురు ఎదురుగా తల్లినీ మానభంగం చేస్తున్నారు. భయంకరమైన, అసహ్యకరమైన మాటలూ, బూతులూ అంటున్నారు.

పోలీసులు పెడుతున్న చిత్రహింసలకి ఏడవడం, వేడుకోవడం, తమకి తెలీదని చెప్పడం తప్ప మరో మాట వాళ్ల నోటినుంచి రావడంలేదు.

"ఒసేయ్ లం... ల్లారా... మీరు మా కస్టడీకి వచ్చి ఇవ్వాల్టికి పదిరోజులు. మీరు ఆ వస్తువు బయట పెట్టేవరకూ పది వందల రోజులయినా మిమ్మల్ని వదిలిపెట్టేపని లేదు. ఎందుకు మీకీ నరకం? బుద్ధిగా ఆ వస్తువు ఎక్కడ దాచిపెట్టారో చెప్పి ఇవ్వండి. మిమ్మల్ని వదిలిపెడతాం" అన్నాడు కిషోర్.

ప్రభావతి మౌనంగా తల దించుకుని ఉంటే ఆండాళమ్మ అంది.

"ఆ వస్తువు అసలు ఎలాంటిదో కూడా మేము చూడలేదు. దొంగతనం అనేది మాకు ఇంటా వంటా లేదు. మాకు తెలియనిదాన్ని తెచ్చి ఇవ్వమంటే మేము ఎక్కడ తెచ్చిస్తామండీ?"

"సరే... మీ ఇష్టం... రేపట్నించీ ఇంకా ఘోరంగా ఉంటుంది మీ పని. మా పోలీసుల తడాఖా రుచి చూడాలంటే అలాగే చూడండి. ఏంచేస్తాం, మీ ఖర్మ'' అన్నాడు కిషోర్.

★ ★ ★

మెయిన్‌రోడ్ అది.

సాయంసమయంలో షాపింగ్‌కి వచ్చిన జనం భయవిహ్వాలులై పరుగులు తీస్తున్నారు.

షాపులవాళ్లు టకటకా షట్టర్లు దింపేస్తున్నారు, లోపల కష్టమర్లు ఉండగనే.

ఒక యువకుణ్ణి బంతులమాదిరిగా బాంబులు విసురుతూ నలుగురు వ్యక్తులు వెంటాడుతున్నారు.

అతను షాపుల్లోకి పోవడానికి ప్రయత్నిస్తున్నాడు. అంతకుముందే ఆ షాపులవాళ్లు మహా వేగంగా షట్టర్లు దింపేస్తున్నారు.

అతను ప్రాణభయంతో భయంకరంగా అరుస్తూ తప్పించుకోవడానికి అన్వేషిస్తూ పరుగులు తీస్తున్నాడు.

వెంటపడిన వ్యక్తులు బాంబులు విసిరి అతన్ని పడగొట్టారు. పడిపోయిన ఆ యువకుణ్ణి కత్తులతో తూట్లు తూట్లుగా పొడిచారు.

అప్పటికీ కసితీరని వ్యక్తి అతనికి కొన ఊపిరి ఉంటుందనే అనుమానంతో గండ్రగొడ్డలి వేటుతో అతని తలని మొండెంనుంచి వేరుచేశాడు...

ఆ హంతకులు తమ పని అయిన తరువాత వచ్చినదారినే ప్రశాంతంగా, నింపాదిగా నడుచుకుంటూ వెళ్లిపోయారు.

అంతా క్షణాల్లోనే జరిగిపోయింది. కళ్లు మూసి తెరిచేటంత వ్యవధిలోనే హత్య జరిగిపోయింది. ఆ యువకుడి ప్రాణం దేహాన్ని వదిలిపెట్టి పోయింది.

ఇది పట్టపగలు పట్టణం నట్టనడుమ జనం సాక్షిగా జరిగిన హత్య.

హత్యకు గురయింది ఎంఎల్ఏగా పోటీపడి, ఓటమిపాలైన రంగడి అనుచరుడు చిన్నా! చిన్నా రంగడికి కుడిభుజంలాంటివాడు.

హత్య చేసింది ఎంఎల్ఏ గుర్నాధం అనుచరులు.

లూటీలు, గొడవలూ జరుగుతాయనే భయంతో షాపులవాళ్లు తలుపులు తాళాలు వేసుకుని ఇళ్ళకు వెళ్ళిపోయారు.

హత్య జరిగిన అరగంటకి పోలీసులు తాపీగా వచ్చారు. శవాన్ని స్వాధీనం చేసుకు




న్నారు.

పోస్ట్‌మార్టంలాంటి సాధారణంగా జరిగే కర్మకాండని యధావిధిగా జరిపే కార్యక్రమంలో పోలీసులు నిమగ్నమయ్యారు.



దాదాపు సంవత్సరకాలంగా వెదుకులాడుతున్న గజదొంగ ప్రభాకర్‌ని పోలీసులు పట్టుకున్నారు:

పేరుమోసిన గజదొంగ అతను.

దోపిడీ సమయంలో జరిగిన ఒక హత్య కేసులో ప్రభాకర్ ముద్దాయి.

అతనిమీద ఇంకా అనేక దొంగతనం కేసులు వున్నాయి.

ఈ కేసులే గాకుండా ఒక పోలీస్‌ని కత్తితో పొడిచి తప్పించుకుపోయాడు. అయితే ఆ పోలీసుకి ప్రమాదకరమ్మైన గాయం తగలలేదు. స్వల్పంగానే గాయపడ్డాడు.

ప్రభాకర్‌ని పట్టించిన వారికి ప్రభుత్వం ఇరవైఐదువేల రూపాయల పారితోషికం కూడా ప్రకటించింది.

ఆ దొంగ రెండు పెళ్ళిళ్లు చేసుకున్నాడు.

అతను రెండవ భార్య తమ్ముడి ఇంట్లో వుండగా హెడ్‌కానిస్టేబుల్, ఇద్దరు కానిస్టేబుళ్ళూ సమయస్ఫూర్తిగా పట్టుకున్నారు.

వేరే పనిమీద ఆ పేటకి వెళ్ళిన పోలీసులకి ప్రభాకర్ పట్టుబడ్డాడు.

పోలీస్‌స్టేషన్ హడావిడిగా వుంది. ప్రభాకర్‌ని పట్టుకోవడంతో అతని దగ్గరికి సిఐడి, ఎస్పీలు వచ్చారు.

పోలీస్‌ని గాయపరచడానికి ముందు అతను చేసిన దొంగతనాలూ, దోపిడీలలో పోలీసులకీ, పోలీసు ఉన్నతాధికారులకీ వాటాలు ఇచ్చేవాడు.

కొంతమంది అధికారులకి అయితే అతను చిక్కడంతో వణుకు బయలుదేరింది. అతను ఇచ్చిన వాటాల విషయం ఎక్కడ బయటపెడతాడో అని ఆందోళన చెందారు.

అతను ఇటీవల నలుగురైదుగురు ధనికుల ఇళ్ళలో పడి దాదాపు పదిలక్షల రూపాయల సొమ్ము దోచుకున్నాడు.

అతని రెండు చేతులకీ, కాళ్ళకీ కూడా సంకెళ్లు వేసి ఒక లాకప్‌రూంలో పెట్టారు.

"ఏరా బామ్మర్దీ... బాగుండావా? చాలా రోజులకి కనపడతండావురా? ఏదీ, ఒక బీడీ వుంటే ఇటు పడేయ్!" లాకప్‌రూం ముందుగా పోతున్న ఒక కానిస్టేబుల్‌ని పిలిచి అన్నాడు ప్రభాకర్.

"బాగానే వున్నాను బావా... బీడీ కావాలా, ఇంకేం పనిలేదా? పెళ్ళి వద్దూ... తొందరపడవాకు. ఇయ్యాలా, రేపట్లోనే చేస్తాంలే పెళ్ళి'' అన్నాడు ఆ కానిస్టేబుల్.

"ఏం పగలబొడుస్తార్రా మీరు... నాలుగు తంతారు, అంతేగదా! ఈ టౌన్‌లో సగంమంది పోలీసులూ... పోలీసులే కాదురా, మీ అధికారులు కూడా నా సొమ్ముతిని బతికినవాళ్ళేరా! వాళ్ళ పెళ్లాలవంటిమీద వున్న నగలు అన్నీ కూడా నా కష్టార్జితమేరా!"

"దొరికినవాడివి ఎలాగూ దొరికావు. నోరు పారేసుకుంటావు ఎందుకురా, వళ్లు ఏమైనా చిమచిమలాడతందేమిటి? అనవసరంగా ఎందుకు తన్నులు తింటావు? రెండు రోజులు మర్యాదగా పడివుంటే, కోర్టుకి హాజరుపెడతా

రు. అప్పుడు వెళ్లి జైల్లో కూర్చుని, అత్తగారి ఇంట్లో అన్నం తిన్నట్లు తిని వెళ్లిపోక..."

"ఓరే, పిచ్చి బామ్మర్దీ... నన్ను అంత తేలిగ్గా కోర్టుకి తీసుకపోతారంట్రా? ఈ ఏడాది నించీ ఎక్కడెక్కడ దొంగతనాలు చేశావూ, ఎంత సొమ్ము కాజేసావూ, ఎక్కడ దాచిపెట్టావూ, ఎవరికి ఇచ్చావూ, చెప్పూ వెళ్లి తెచ్చుకుంటాము, అని చెప్పిందాకా మీరు కోర్టుకి నన్ను హాజరు పెడతారంట్రా?" అన్నాడు ప్రభాకర్.

అతడు తన అనుభవసారాన్నంతా వెళ్ళగక్కాడు.

ఆ కానిస్టేబుల్ డిఎస్పీ దగ్గరకి వెళ్ళి అన్నాడు. "ఆ ప్రభాకర్‌గాడు పిచ్చి పిచ్చిగా వాగుతున్నాడు సార్. నోటికి ఏమాట వస్తే ఆ మాట అంటున్నాడు''

"ఏమంటున్నాడేమిటి?" డిఎస్పీ అడిగాడు.

"పిచ్చి పిచ్చి వాగుడంతా వాగుతున్నాడు సార్' అన్నాడు ఆపేసి.

డిఎస్పీ స్టేషన్‌కు అయితే వచ్చాడు కానీ, ప్రభాకర్ దగ్గరకి రాలేదు. ప్రభాకర్‌వలన కొద్దో, గొప్పో లాభం పొందిన వాళ్ళలో ఆ డిఎస్పీ కూడా ఒకడు. ప్రభాకర్ ముఖం చూడటానికి అతను కొద్దిగా సందేహించాడు. ముఖమాటపడ్డాడు.

"ప్రభాకర్‌గాడి పొగరు అణగాలి. ముందు వాడికి అర్జంట్‌గా బాక్సర్ ట్రీట్‌మెంట్ ఇవ్వండి. ఇక నోరు తెరవడు'' అని డిఎస్పీ సిఐని పిలిచి ఆదేశించాడు.

"ఎస్ సర్' అని సిఐ వెళ్లిపోయాడు.

పోలీసులు ఉపయోగించే థర్డ్ డిగ్రీ మెథడ్స్‌లో ఇదొక రకమైన చిత్రహింస.

మంచి జడ్జి ఎవరైనా వున్నా 'పోలీసులు కొట్టారు' అని ముద్దాయి ఆ జడ్జిముందూ, న్యాయస్థానం ముందూ సాక్ష్యాధారాలతో చూపించుకునేందుకు ఏమాత్రం వీలులేని విధంగా వుంటుంది ఈ థర్డ్ డిగ్రీ మెథడ్.

పోలీసులు బాక్సర్స్ ఉపయోగించే బాక్సింగ్ గ్లౌజులు చేతులకు తొడుక్కుంటారు. అవి వేసుకుని నేరస్తుని గుండెలమీదా, తల మీదా, కణతలమీదా కొడతారు. నేరస్తుని శరీరంలో సున్నితమైన భాగాలు... చిన్న దెబ్బకే ప్రాణం పోయేటంత నొప్పిని కలిగించే సున్నిత శరీర భాగాలపై ఈ దెబ్బలదాడి అధికంగా వుంటుంది. ఈ దెబ్బలకు శరీరంమీద బొత్తిగా సాక్ష్యాలు దొరకవు.

ప్రభాకర్‌ని వెనుకగదిలోనికి తీసుకుపోయి నలుగురు పోలీసులు చాలా క్రూరంగా, అమానుషంగా బాక్సర్ ట్రీట్‌మెంట్ ఇచ్చారు.

వాళ్ళు కొడుతున్న దెబ్బలకు ప్రభాకర్ అరుపులు లాకప్‌లో వున్న ఇతరులు భీతి చెందేటంత భయంకరంగా వున్నాయి.

ప్రభాకర్‌ని స్టేషన్‌కు పట్టుకొచ్చిన మొదటి రెండు రోజులూ ఆండాళ్ళమ్మకీ, ఆమె కూతురికీ విశ్రాంతి దొరికింది. ఆ రెండు రోజులూ వాళ్ల జోలికి పోలీసులు రాలేదు.

లక్ష్మణరావు వీలు చూసుకుని అప్పుడప్పుడూ స్టేషన్‌కు వచ్చి ఎస్ఐతో మాట్లాడిపోతున్నాడు. స్టేషన్‌కి రానిరోజు ఫోన్‌చేసి కనుక్కుంటున్నాడు.

"ఎన్ని తన్నినా, ఎన్ని కొట్టినా వాళ్లు మేం దొంగతనం చేయలేదని చెపుతున్నారు సార్. ఒక్కోసారి వస్తువు దొంగిలించేది ఒకరూ, మన అనుమానం మరొకరిమీదకూ పోతుంది. వీళ్ళే తీశారని మీకు గట్టిగా నమ్మకమేనా?" ఒకరోజు ఎస్ఐ కిషోర్ అడిగాడు లక్ష్మణరావుని.

"హండ్రెడ్ పర్సెంట్ వీళ్ళే సార్. మా ఇంటికి బయటివాళ్ళెవరూ రాలేదని చెపుతున్నాంకదా సార్. మా పిల్లలు కూడా అప్పుడు వూళ్ళో లేరు, సమ్మర్ హాలిడేస్‌కి వాళ్ళ గ్రాండ్‌పా వాళ్ళ ఇంటికి వెళ్ళారు''

"వీళ్ళు తీస్తే మాత్రం ఇవ్వాళ కాకపోతే




రేపైనా నిజం కక్కిస్తాం సార్. ఆడవాళ్లు అంత గట్టిగా మాట్లాడటం, మేం కొడుతున్న దెబ్బలకి లొంగకపోవడం ఇంతవరకూ జర గలేదు'' అన్నాడు కిషోర్.

"మా మిసెస్ బాగా దిగులుపడిపోయింది సార్. తనకి ఎంతో ఇష్టమైన నెక్లెస్. ఆ నెక్లెస్‌లో వున్న డైమండే 2 లక్షల రూపాయ లు వుంటుంది సార్. నెక్లెస్ పోయిన దగ్గ ర్నించీ సరిగా మీల్స్ కూడా చేయడం లేదు''

"వీళ్లు కానీ ఆ వస్తువు దొంగిలిస్తే మీది మీకు గ్యారెంటీగా వస్తుంది. డౌట్ లేదు. వాళ్ళనించి నిజం ఎలా రాబట్టాలో, వస్తువు ఎలా తెప్పించాలో మాకు బాగా తెలుసు''

"మా వస్తువు మాకు వస్తే మీ హెల్ప్ ఎప్పటికీ మరచిపోము సార్. అనుకున్న దానికంటే ఎక్కువే మీకు ఇస్తాను''

"దాందేముందిలే సార్... మా డ్యూటీ మేం చేయాలికదా?"

లక్ష్మణరావు వెళ్ళిపోయిన తరువాత కిషోర్ ఆ తల్లీకూతుళ్లని తన రూంలోనికి పిలిపించాడు.

వాళ్లు వచ్చిన వెంటనే, వాళ్ళని చూసిన కిషోర్ కిరాతక హృదయం కూడా ఒక్కసారి మూలిగింది. ఎక్కడో... ఎక్కడో... మూరు మూలన ఆ హృదయంలో దాగివున్న పిస రంత జాలి బయటకు తన్నుకువచ్చింది.

వెంటనే వృత్తిధర్మం గుర్తుకు వచ్చిన కిషోర్ దాన్ని తక్షణం హృదయపు అడుగు పొరలలోకి తోసేశాడు.

వాళ్ళ తలలు ఎండిపోయి, మురికిపట్టి పోయి వున్నాయి. జుట్టు చెల్లాచెదురుగా ముఖంమీద పడుతూవుంది.

ఇక ఆ బట్టలు పొయ్యిలో పెట్టినా మండే లా లేవు. అంత దుమ్ము వాటిమీద పేరుకు పోయివుంది.

వచ్చినప్పుడు మానవ ఆకారాలతో, చూ డటానికి కొద్దిగా ఇంపుగా వుండేవాళ్లు. ఇప్పు డు పుల్లలైపోయారు. గాలి కొడితే ఆ గాలికి ఎగిరిపోయేలా వున్నారు. ఇద్దరి ముఖాల్లో కళాకాంతులూ లేవు.

ఇద్దరూ భయభయంగా వణికిపోతూ కిషోర్ టేబులికి ఎదురుగా చేతులు కట్టుకుని నిలబడ్డారు. వాళ్ల చూపులు అమాయకంగా, దయనీయంగా వున్నాయి.

"నేను ఎంతోమంది దొంగల్ని, గజదొంగ ల్ని, బందిపోటు దొంగల్ని చూశాను. కొమ్ము లు తిరిగిన వాడి దగ్గర్నించి కూడా నిజం నిమిషాలమీద కక్కించా! అయితే మీ అంత మొండివాళ్లని ఇంతవరకూ నా సర్వీసులో చూడలేదు''

"మాకు నిజంగా దేవుడి సాక్షిగా తెలియ దు సార్' అంది ప్రభావతి.

"ఇన్ని రోజుల్నించీ అదేమాట కదా మీరు చెప్పేది. కొత్తమాట ఏముంది ఇందులో? ఎంతకాలం మీకు వేళకి తిండీతిప్పలూ లే కుండా మా పోలీసులు చేతుల్లో తన్నులు తింటూవుంటారు. ఇది మీకూ, మాకూ ఇద్దరి కీ శ్రేయస్కరం కాదు. మేమూ బాధపడుతు న్నాము. మీరూ బాధపడుతున్నారు. ఎందు కొచ్చిన బాధ ఇది చెప్పండి. ఆ వస్తువు ఇచ్చేవరకూ మిమ్మల్ని వదిలిపెట్టే పని మాత్రం జరగదు. తొందరగా తెలిస్తే మీకూ, మాకూ ఇద్దరికీ మంచిది'' అన్నాడు కిషోర్.

"దేవుడి దగ్గర ఏ ప్రమాణం చేయమన్నా ఆ ప్రమాణం చేస్తాము. తిరుపతి వెంకటేశ్వ రస్వామి సాక్షిగా మాకు తెలియదు సార్' అంది ప్రభావతి.

"సరే మీ ఇష్టం" అని ప్రభాకర్ వాళ్లని తీసుకుపొమ్మన్నట్లుగా కానిస్టేబులికి సైగ చేశాడు.

ఆ కానిస్టేబుల్ వాళ్లని తీసుకువచ్చి లా కప్‌లో పడేశాడు.

వీళ్ళ దగ్గరనించి వస్తువు తీసుకుపోయి ఇచ్చిన తరువాత లక్ష్మణరావు ఇచ్చే నోట్లక ట్టల చుట్టూనే కిషోర్ ఆలోచనలు పరిభ్రమిస్తు

న్నాయి. వీళ్లు ఎప్పుడెప్పుడు నిజం చెపుతారా, ఆ వస్తువు తీసుకుపోయి లక్ష్మణరావుకి ఇచ్చి ఎంత డబ్బు వసూలు చేద్దామా అనే కిషోర్ ఆలోచిస్తున్నాడు.

నారాయణ అనే కానిస్టేబుల్‌ని పిలిచి చెప్పాడు కిషోర్.

"వీళ్లని స్టేషన్‌కు తెచ్చి ఇన్ని రోజులవుతున్నా, వీళ్ళ నోటినుంచి నిజాన్ని కక్కించలేక పోయామంటే ఇది మన డిపార్ట్‌మెంట్‌కే చాలా ఇన్సల్ట్! ఆఫ్టాల్ ఆడముండల దగ్గర్నించి నిజాన్ని రాబట్టలేకపోతే ఇంక ఎందుకూ మన డిపార్ట్‌మెంట్? ఎలాగైనా సరే, ఇవ్వాళ నైటుకి వాళ్ళ నోటితోటి వస్తువు ఎవరికి ఇచ్చారో లేకపోతే ఎక్కడ దాచిపెట్టారో తెల్సుకోవాలి. నువ్వూ, ఇంకో పీసీ కలిసి పని పూర్తిచేయండి. నీకెందుకు, రేపు ఈ టయానికి మీ ఇద్దరికీ చెరి రెండు వేలూ ఇప్పిస్తా ఆ లక్ష్మణరావు దగ్గిర"

"నిజంగానా సార్' ఆశగా అడిగాడు నారాయణ.

"అబద్ధం ఏముందీ? వాడు ఎంత ఇవ్వమన్నా ఇచ్చేలా వున్నాడు. వాడికేం... బాయిల్డ్ రైస్‌మిల్లూ, సెలైన్ ఫ్యాక్టరీ... అడ్డంగా బలిసిపోయాడు! ఇంకా ఎక్కువే ఇవ్వమన్నా ఇస్తాడు''

"అయితే వాళ్ళకి ఇవ్వాళ మూడింది సార్! ఒకదానికి చైనీస్ ట్రీట్‌మెంటూ, ఒకదానీకి రోలర్ ట్రీట్‌మెంటూ ఇస్తాం సార్! వాళ్ళేమిటీ వాళ్ల బాబు కక్కుతాడు సార్ 'నిజం ఒక్క నిముషంలో..."

"సరే, మీరు ఏ ట్రీట్‌మెంట్ అయినా ఇవ్వండీ, ఏమైనా చేయండి. వాళ్ళ ప్రాణం మాత్రం పోకుండా చేయండి. మళ్ళీ వాళ్లు చస్తే అది మన మెడకి చుట్టుకుంటుంది''

ఆ రాత్రి ఆ తల్లీ కూతుళ్లకి కాళరాత్రే!

నరకంలోనో, యమకూపంలోనో కూడా వుండనటువంటి భయంకరమైన చిత్రహింసల్ని ఆ రాత్రి వాళ్లు అనుభవించారు.

ప్రభావతికి రోలర్ ట్రీట్‌మెంట్ ఇచ్చారు.

ఆమె కాళ్లూ, చేతులూ కట్టివేసి నేలమీద పడుకోబెట్టారు. తరువాత ఆమె శరీరంమీద బరువైన కొయ్యదుంగని తీసుకువచ్చి రోలర్‌లా అటూ ఇటూ పొర్లించారు.

ప్రభావతి నోటినించి రోజూ చెప్పే జవాబే వస్తూండటంతో పోలీసులు ఆ దుంగమీద అటు ఒకరూ, ఇటు ఒకరూ ఎక్కి ఆ దుంగని ఆమె శరీరంమీద దొర్లించారు.

ఆమె ఎముకలు పటపటలాడిపోయాయి. శరీరం అంతా ఒక మాంసం ముద్ద మాదిరిగా తయారైపోయింది.

దయనీయంగా, బాధాకరంగా ఏడుస్తున్న ఆమె ఏడుపు పోలీసులకి వినోదంగా వుంది.

కళ్లముందు పచ్చనోట్ల రెపరెపలు తప్ప వాళ్ళకి మరేమీ కనబడటం లేదూ, వినబడటం లేదూ!

ఆ బాధ భరించేకంటే చచ్చిపోవటమే ఉత్తమం అనిపించింది ప్రభావతికి. ఏమాత్రం అవకాశం దొరికినా ఆత్మహత్య చేసుకుందాం అనిపిస్తోంది.

ఆండాళ్ళమ్మ ఎముకల గూడులా వుంది. గట్టిగా, బలంగా ఒక్క దెబ్బ తగిలితే, ఆ దెబ్బకి అనుమానం లేకుండా ప్రాణం పోతుంది.

ఆమె శరీరానికి గట్టిదెబ్బ తగలకుండా చైనీస్ ట్రీట్‌మెంట్ ఇచ్చారు.

ఆమెని ఒక కుర్చీమీద కూర్చోపెట్టి, కదలకుండా తాళ్లు పెట్టి కట్టేశారు. తల కూడా ఏమాత్రం కదలడానికి వీలు లేకుండా వెనకకు వంచి కట్టేశారు. అంటే, మీద కప్పు కనపడేలా తలని కట్టేశారు. తలమీద పైన ఎత్తుగా ఒక పాత్ర కట్టి, దానిలో నీరుపోసి, ఆ పాత్రకి చిన్నరంధ్రం చేశారు. ఆ రంధ్రంనించి ఒక్కొక్క బొట్టే నీరు ఆమె భృకుటిమీద పడేలా ఏర్పాటు చేశారు.

ఈ చైనీస్ ట్రీట్‌మెంట్ వలన శారీరకంగా




కంటే మానసికంగా ఆ నేరస్తులో, ఆ అమాయకులో పడేబాధ వర్ణనాతీతం. అనేక సందర్భాలలో ఈ ట్రీట్‌మెంట్ కారణంగా నేరస్తులకి మతిభ్రమిస్తుంది. పిచ్చివాళ్లు అయిపోతారు.

సమాచారం రాబట్టడం కోసం పోలీసులు 24 గంటలకంటే ఎక్కువసేపు నిందితుడ్ని నిర్బంధించకూడదనీ, అలా నిర్బంధిస్తే అది శిక్షార్హమని సీఆర్‌పీసి సెక్షన్ 57 అంటున్నది. ఈ నేరానికి పాల్పడిన వ్యక్తులకు 3 సంవత్సరాల వరకూ జైలుశిక్ష అని భారత శిక్షాస్మృతి సెక్షన్ 348లో రాశారు.

నిందితుడినించి నిజం రాబట్టడానికి 24 గంటలు కాదు, 24 నెలలు నిర్బంధించినా ఈ దేశంలో అడిగే నాథుడు లేడు. పట్టించుకునే దిక్కులేదు.

సమాచారం కోసం హింసిస్తే ఆ నేరానికి 7 నుండీ 10 సంవత్సరాల వరకూ జైలుశిక్ష అని భారత శిక్షాస్మృతి సెక్షన్లు 330, 331లో రాశారు.

హింసించడం కాదు, పోలీసులు చంపివేసినా ప్రశ్నించేవాళ్లు లేరు.

చట్టాల్లోనూ, రాజ్యాంగంలోనూ ఉండటానికి అన్నీ బాగానే రాసివున్నాయి. అయితే ఆ చట్టం ప్రకారం, ఆ సెక్షన్ల ప్రకారం ఏ లక్షకో, కోటికో ఒకడికి శిక్షపడి వుంటుందేమో!

తమకి పట్టిన దుర్గతికీ, దౌర్భాగ్యానికీ ఆ రాత్రి ఆ తల్లీకూతుళ్లు కుమిలి కుమిలి విలపించారు.

★ ★ ★

రంగడి అనుచరుడు చిన్నా హత్య జరిగి పదిరోజులు దాటింది. అయినా పోలీసులు హంతకుల్ని అరెస్టు చేయలేదు.

హంతకుల్ని అరెస్ట్ చేయడంలో విఫలమైన పోలీస్ యంత్రాంగాన్ని విమర్శిస్తూ పత్రికలు వార్తలు రాశాయి.

హెచ్చరిక పత్రిక ఒక అడుగు ముందుకి వేసి చిన్నాని హత్య చేయడానికి వెనుకవున్న మాఫియా గొడవలు కూడా రెండురోజులు సవివరంగా ప్రచురించింది. అంతేగాకుండా ఈ కేసుకి సంబంధించిన వివరాలు ఎప్పటికప్పుడు పాఠకులకి అందిస్తున్నది.

ఈ కేసులో అమీతుమీ తేలేవరకూ కలం దించకూడదని కళాధర్ నిశ్చయించుకున్నాడు. పోలీసుల ఉదాసీన వైఖరికీ, హంతకుల్ని కాపాడుతున్న తీరుకీ కళాధర్ విసుగు చెందాడు.

చివరకి హెచ్చరిక ఒకరోజు ప్రచురించిన వార్త ఎస్ఐ కిషోర్‌ని ఇబ్బందిపడేలా చేసింది.

హంతకులు పట్టణంలోనే వున్నారని కళాధర్ హెచ్చరికలో వెల్లడించాడు. పట్టణంలోనే ఒక ప్రముఖ రాజకీయ నాయకుడి గృహంలో వాళ్లు ఆశ్రయం పొందారని పాఠకలోకం దృష్టికి తీసుకువచ్చాడు.

ఆ నాయకుడికి పట్టణ శివార్లలో వున్న విశాలమైన అతిథిగృహంలో ఆ హంతకులు మూడు పూటలూ తిని, తాగుతూ, వీసీపిలో సినిమాలూ, బ్లూ సినిమాలూ వేసుకుని చూస్తూ, విశ్రాంతి తీసుకుంటూ, ఆనందంగా కాలం గడుపుతున్నారని హెచ్చరిక సంచలనవార్తనే ప్రచురించింది.

ఆ అతిథిగృహంలో వున్న నేరస్తులు తమ స్థావరం కొంతమందికి తెలిసిపోయిందనీ, స్థావరాన్ని త్వరగా మార్చుకుంటే బాగుంటుందనీ అనుకుంటున్నారు. ఇంతలోనే హెచ్చరిక పత్రికలో వార్త వచ్చింది. ఆ వార్త నిమిషాలమీదనే వాళ్లకి తెలిసిపోయింది ఫోన్‌లో.

ఇక వాళ్లు అప్పటికప్పుడే, ఆ వేకువజామునే తమ డెన్‌ని మరో సురక్షిత ప్రాంతానికి మార్చుకున్నారు.

ఎస్ఐ కిషోర్ రెండుసార్లు ఆ అతిథిగృహానికి వెళ్ళి ఆ హంతకుల్ని పరామర్శించి వచ్చాడు. వాళ్ళ కోసం సాగుతున్న అన్వేషణ, విచారణ ఎంతవరకూ వచ్చిందో, ఉన్న



తాధికారులు ఏమనుకుంటున్నారో అన్నీ వాళ్ల కి పూసగుచ్చినట్లు విశదీకరించి చెప్పాడు.

"అయితే కిషోరూ... వీళ్ళకి యాంటిసిపీ టరీ బెయిల్ వస్తుందంటావా? జడ్జి ఏమైనా తిరకాసు పెడతాడా? బెయిల్ రావాలీ, వీళ్లు బయటకు రావాలీ, అంతేకానీ మీ స్టేషన్‌కు వచ్చి సరెండర్ అయ్యే పనిలేదు. కోర్టు ముందుకి కూడా వెళ్లి లొంగేపని జరగదు. ఏమంటావు?" ఒకసారి కిషోర్ ఆ అతిథిగృ హానికి వెళ్లినప్పుడు అక్కడే కూర్చుని వున్న ఎంఎల్ఏ గుర్నాధం అన్నాడు.

"కేసు పెద్ద బలంగా ఏం రాయలేదు సార్. జడ్జి బెయిల్ ఇవ్వవచ్చు. పోనీ, ఇక్కడి జడ్జి బెయిల్ ఇవ్వకపోయినా హైకో ర్టులో ట్రై చేస్తే వాళ్ళే ఇస్తారు''

"బెయిల్ కోసం మన ప్లీడరు ట్రై చేస్తు న్నాడు. రెండు మూడు రోజుల్లో బెయిల్ రావచ్చు అంటున్నాడనుకో. సరేకానీ... వీడె వడయ్యా, హెచ్చరికవాడు మన వెంట పడు తున్నాడేమిటి? రోజూ కేసుకి సంబంధించిన విషయం ఏదో ఒకటి కెలుకుతున్నాడు''

"కళాధర్ అనీ... మహా పొగరుబోతు వాడు సార్, వాడే ఆ హెచ్చరికకి రిపోర్టర్‌గా పనిచేస్తున్నాడు. వాడేను సార్ ఈ రాతలు అన్నీ రాయడం! వాడికి కళ్లు నెత్తిమీద వుంటాయ్, వాడు ఎవర్నీ లెక్క చేయడు సార్!"

"ఓహోహో... మన తడాఖా తెలియన ట్లు వుంది వాడికి. ఎప్పుడూ మన దెబ్బ రుచి చూడలేదా ఏమిటి? పిచ్చి పిచ్చి రాతలు రాస్తే లేపేస్తాం, ఏమనుకుంటున్నాడో, ఏమిటో..."

"వాడు పెద్ద తలనొప్పి సార్. నేను ఫణిగిరిలో పనిచేసినప్పుడు వీడు స్ట్రింగర్‌గా పనిచేస్తూ అక్కడ నన్ను ఇబ్బంది పెట్టాడు''

"ఇంతకుముందు ఎలక్ట్రిసిటీ గ్రిల్స్ విష యంలో కూడా కూపీ అంతా బయటకు లాగి చాలా న్యూసెన్స్ చేశాడు. వాడికి ఒకసారి వార్నింగ్ ఇస్తే బాగుంటుంది. ఆ పనిచె య్యి''

"వార్నింగ్ లాభం లేదుసార్. వాడికి ఒకసారి బాగా పడాలి. లేకపోతే ఇంకా మితిమీరి వాడి ఇష్టం వచ్చినట్లు రాస్తాడు''

"మీ డిపార్ట్‌మెంట్ వలన గాకపోతే చె ప్పు, మేమే వాడికి గుణపాఠం చెప్తాం" గుర్నాధం అన్నాడు.

"సరే సార్... నా ప్రమోషన్ విషయం... మీరు గట్టిగా పనిచేసి పెట్టాలి సార్''

"చూద్దాం. ఎప్పటికప్పుడు నువ్వు చెపు తున్నావూ, నేను మర్చిపోతున్నాను. ఈసారి గట్టిగా గుర్తు పెట్టుకుని నీ పనిచేస్తా వుండు''

"చాలారోజుల్నించీ తిరుగుతున్నాను సార్. ఇప్పటికే చాలా లేట్ జరిగిపోయింది''

"ఈసారి మాత్రం గట్టిగా నీపని చేసి పెడతాను. నాలుగురోజుల్లో హైదరాబాద్ వెళ్ళా లికదా! అక్కడినించి వచ్చేటప్పుడు నీ ప్రమోషన్ ఆర్డర్ కాగితం తీసుకునేవస్తా. నాలుగురోజులు కాదు, ఇంకా రెండు రోజులు ఆలస్యమయినా నీ పని అయిన తరువాతనే రైలు ఎక్కుతా'' అన్నాడు గుర్నాధం.

"అవసరమైతే డబ్బు ఇద్దాం. తప్ప కుండా చేసి పెట్టండి సార్'' అని కిషోర్ లేచి బయలుదేరాడు.

"నీ పని అంత త్వరగా చేసిపెడితే నువ్వు మామాట వింటావా? మా చుట్టూ తిరుగుతా వా? చిన్నగానే చేద్దాంలే నీపని. అర్జంట్‌గా నీకు ప్రమోషన్ రాకపోతే మునిగిపో యిందేమీ లేదు'' మనసులో అనుకున్నాడు గుర్నాధం.

★ ★ ★

3 లక్షల విలువచేసే నెక్లెస్ పోవడంతో లక్ష్మణరావు భార్య రేణుక బాగా కలత చెందింది.

ఆమెకి నగలంటే విపరీతమైన వ్యా మోహం! ఆ వ్యామోహానికి తగినట్లే ఆ నగ పోవడంతో మనిషి నీరసించిపోయింది.




ఆ వస్తువు ఎలా పోయిందో ఆమెకి అంతుబట్టడంలేదు. ఆండాళ్లమ్మనీ, ఆమె కూతుర్నీ పోలీసులకి అప్పగించినా మన సులో ఎక్కడో సందేహం! వాళ్లు తీసివుండ రని కాస్తంత సంశయం!

వాళ్లు గాకుండా వేరేవాళ్లు ఎవరూ ఇంటి కి రాకపోవడంతో వాళ్లని అనుమానించక తప్పడంలేదు.

తల్లీ కూతుళ్లని విపరీతంగా కొడుతున్నా రనీ, హింసిస్తున్నారనీ తెలిసి ఆమె కొంచెం బాధపడింది. ఏదో పొరపాటుగా తీశారు. ఆ తీసిన వస్తువు ఇవ్వవచ్చుకదా అని తనని తను సమర్థించుకుంది.

అప్పటికి ఆ వస్తువుపోయి 35 రోజులు!

ఆరోజు రేణుక ముఖ్యస్నేహితురాలి బర్త్ డే పార్టీ. ఆ పార్టీకి పట్టణంలో వున్న ప్రముఖ మహిళలు అందరూ వస్తున్నారు.

కలెక్టర్ భార్య కూడా తమ మహిళామండ లిలో మెంబరే! ఆమెని కూడా ఆ పార్టీకి ఇన్వైట్ చేశారు. ఆమె కూడా వస్తుంది అని తెల్సింది.

ఈ పార్టీకి ఆ డైమండ్ నెక్లెస్ కూడా వుంటే బాగుండేది అనుకుంది రేణుక.

పార్టీకి వెళ్లడానికి స్టోర్‌వెల్‌లో వున్న కంచి పట్టుచీర తీసింది.

ఆ చీర కట్టుకోవడానికి సిద్ధమవుతూ మడత విప్పింది.

మిలామిలా, ధగధగా మెరిసిపోతూ డై మండ్ నెక్లెస్! ఆ చీర మడతలో వుంది.

విభ్రాంతి చెందింది రేణుక.

ఆ మడతలోనికి ఎలా వచ్చింది?

ఆ రాత్రి...

గతం గుర్తొచ్చింది రేణుకకి.

ఆ రాత్రి తను టీపాయ్‌మీద పెట్టింది నెక్లెస్.

కంచిపట్టుచీర మడతవేసి, ఆ నెక్లెస్‌ని ఆ మడతలో పెట్టి, ఆ చీరని తరువాత రోజు స్టోర్‌వెల్‌లో పడేసింది.

తను తాగివున్నా జాగ్రత్తగానే వుంది. తెలివిగానే వుంది.

టీపాయ్‌మీద నెక్లెస్ కళ్లకి ఎదురుగా ఎందుకు అనే ఉద్దేశంతో తను చీర మడతలో పెట్టింది. తరువాత రోజుతీసి దాచిపెట్టుకోవ చ్చు అనుకుంది.

అయితే ఆ విషయం తనకి గుర్తు రాలేదు. కనీసం అలా పెట్టే అవకాశం వుందని అనుమానం కూడా రాలేదు.

ఆ విషయం మరిచిపోయి... తల్లికూతు ళ్లని అనుమానించి... ఎంత పొరపాటు జరిగి పోయింది!

ఇప్పుడు ఎలా?

భర్తకి ఫోన్ చేసింది.

"హలో... రేణుకని మాట్లాడుతున్నాను. అర్జంట్‌గా మీరు ఇంటికి రావాలండీ"

"ఎందుకూ?"

"పని ఉంది. త్వరగా రండి"

"నేను ఇక్కడ కొంచెం బిజీలో ఉన్నాను. పని ఏమిటో చెప్పరాదూ?"

"మరీ... నెక్లెస్ దొరికిందండీ! కంచిపట్టు చీర మడతలో ఉంది"

"అరే... అలాగా... గుడ్‌న్యూస్ చెప్పావు. వెంటనే వస్తున్నాను. ఉదయం నేను వస్తూ పోలీస్ స్టేషన్‌కి వెళ్లి వచ్చాను. ఇనస్పెక్టర్ ఆ తల్లీకూతుళ్లు కాదేమోనని డౌట్‌పడ్డాడు. వాళ్లే నని నేను బల్లగుద్ది మరీ చెప్పివచ్చాను. ఇప్పుడే వస్తున్నా ఇంటికి" అన్నాడు లక్ష్మ ణరావు.

ఆయన వెంటనే బయలుదేరి వచ్చేశాడు.

"మన వస్తువు అంత తేలిగ్గా పోదు రేణూ. అన్యాయపు సొమ్ము అయితే అది ఎప్పటికీ అచ్చుబాటు కాదు. మనం ఎప్పు డూ ఇతరుల సొమ్ముకి ఆశపడం! ఇదంతా మన కష్టార్జితమే! అంత తేలిగ్గా మన కష్టం పోదు రేణూ" అన్నాడు లక్ష్మణరావు.



"ఇప్పుడు ఎలాగండీ? ఆండాళమ్మనీ, ప్రభావతినీ ముందు స్టేషన్‌నుంచి బయటకు తీసుకురండి. నెలరోజులు వాళ్లు స్టేషన్‌లో ఎన్ని బాధలు పడ్డారో'

"సరే జరిగిందేదో జరిగిపోయిందిలే! ఇప్పుడు అవి అన్నీ అనుకుంటే ఏం ప్రయోజనం? పొరపాటు జరిగింది కానీ, మనం కావాలని వాళ్లని పోలీసులకి పట్టిచ్చామా? వాళ్లని పోలీసులకి పట్టిస్తే మనకేం వస్తుంది?"

"వెళ్లి ఎస్.ఐ.కి ఏదో చెప్పి వాళ్లని వదిలి పెట్టించండి'' అంది రేణుక.

"ఆ ఎస్.ఐ. మనదగ్గర డబ్బు బాగానే కాజేశాడు. టీపాయ్‌మీద పెడితే ఎలుక తీసుకుపోయి ఏదో మూలన పడేసిందనో, ఎక్కడో పాతిపెట్టిందనో ఏదో ఒక అబద్ధం చెప్పాలి''

లక్ష్మణరావు నెక్లెస్‌ని కళ్లతో తృప్తిగా ఒక్కసారి చూసుకుని పోలీస్ స్టేషన్‌కి వెళ్లాడు.

మొదట్లో లక్ష్మణరావు స్టేషన్‌కి వెళ్తే ఎస్.ఐ. కిషోర్ కుర్చీలోనుంచి లేచి, ఎదురు వచ్చి విష్‌చేసి సాదరంగా ఆహ్వానించేవాడు. ఇప్పుడు లక్ష్మణరావు వెళ్లి అతనికి విష్ చెయ్యాలి.

"ఏంటి సార్ మళ్లీ వచ్చారు? ఉదయం వచ్చిపోయారుకదా! ఎందుకు మాటిమాటికీ తిరగడం? వాళ్లు చెప్పడంలేదు, తెలియదన్న మాటే!"

"సారీ సార్! మిస్టేక్ జరిగిపోయింది. వస్తువు దొరికింది సార్!"

"నెక్లెస్ దొరికిందా? వస్తువు ఒకచోట పెట్టుకుంటారూ, అమాయకులమీద నిందలేస్తారూ! కేసు ఫైల్ చేయలేదు కాబట్టి సరిపోయింది. ఫైల్ చేస్తే మళ్లీ ఎంత రిస్కు! మా పని ఇప్పుడు ఏమయ్యేది?" కిషోర్ అన్నాడు.

"సారీ సార్' అన్నాడు లక్ష్మణరావు.

అంతే... సారీ అనే మాటకే ఆ తల్లీకూతుళ్లు 35 రోజులుగా ఆ స్టేషన్‌లో అనుభవించిన భయంకరమైన అవమానాలూ, అత్యాచారాలూ ఎగిరిపోతాయి. వాళ్లు పడిన శారీరక, మానసిక హింసలు మాయమైపోతాయి!

"ఇది పబ్లిక్‌లోకి వెళితే మా డిపార్ట్‌మెంట్ మీద జనం 'ఛూ...' అని ఉమ్మేస్తారు. ఏదయినా ఆలోచించి చేయాలండీ!"

కిషోర్ మాటలకు లక్ష్మణరావు ఏమీ మాట్లాడలేదు. మౌనంగా ఉన్నాడు.

ఒక పీసీని పిలిచి "వాళ్లకి హోటల్‌నుంచి మీల్స్ తెప్పించి పెట్టండి'' అని వంద రూపాయల కాగితం ఇచ్చాడు.

ఆ పీసీ ఆ కాగితాన్ని జేబులో పెట్టుకుని మిగిలిన చిల్లర తనదేకదా అని సంతోషంగా ఆ పని చేయడానికి వెళ్లిపోయాడు.

"వస్తాను సార్' అని లక్ష్మణరావు లేచి వచ్చేశాడు, ఎక్కువసేపు ఉండటం మంచిది కాదని.

ఆండాళమ్మనీ, ఆమె కూతుర్నీ లక్ష్మణరావు చూడదలచుకోలేదు. వాళ్లకి కనపడకుండానే విషయం ఎస్.ఐ. కిషోర్‌కి చెప్పి వెళ్లిపోయాడు అతను.



"మిమ్మల్ని నెలరోజులు పైగా స్టేషన్‌లో ఉంచినట్లూ, కొట్టినట్లూ ఎవరికీ చెప్పకండి. మీరుకానీ ఈ విషయం ఎవరికైనా చెప్పారో మళ్లీ మీకు ఇదేగతి పడుతుంది. ఇన్ని




రోజులూ మీరు నరకాన్ని చూశారు, ఈసారి అంతకంటే పెద్ద లోకాన్ని చూస్తారు!" ఆరోజు సాయంత్రం ఆ తల్లీకూతుళ్లని స్టేషన్ నుంచి వదిలిపెడుతూ ఎస్.ఐ. కిషోర్ అన్నాడు.

ఎస్.ఐ. మాటలకి వాళ్లు ఏమీ జవాబు చెప్పలేదు.

ఒక తెల్ల కాగితంమీద ప్రభావతితో సంతకం పెట్టించుకున్నారు. మరో కాగితంమీద ఆండాళమ్మతో వేలిముద్ర వేయించుకున్నారు.

ఆ తల్లీకూతుళ్ల శరీరాలు హూనం అయిపోయాయి. మాంసంముద్దలుగా మిగిలిపోయాయి.

అస్థిపంజరాల్లా తయారైపోయారు. వాళ్లకి నడవడానికి కూడా శక్తి లేకపోయింది.

చిన్నగా కుంటుకుంటూ, దారిలో చాలాసార్లు కూర్చుంటూ, లేస్తూ గుడిసెకి చేరుకున్నారు.

గుడిసెలో చూసుకుంటే ఏముంది? ఉన్న రేకుపెట్టెని పోలీసులు విరగతొక్కి పెట్టారు. ఆరేడు గిన్నెలూ, రెండు పళ్లాలూ ఉంటే వాటిని చిందరవందర చేశారు. ప్లాస్టిక్ బకెట్‌ని పగలకొట్టారు. నెక్లెస్‌కోసం ఆ గుడిసెలో అంగుళం అంగుళం గాలించారు.

వీళ్లని చూసినవెంటనే చుట్టుపక్కల ఉన్న ఇరుగమ్మ పొరుగమ్మలు అందరూ వచ్చారు.

చుట్టుపక్కల ఉన్న ఆ గుడిసెలవాళ్లే స్టేషన్ దగ్గరకు అప్పుడప్పుడూ వెళ్లి వీళ్లకి ఉతికిన బట్టలు ఇచ్చేవాళ్లు. ఒక్కోసారి భోజనం తీసుకుపోయేవాళ్లు.

పోలీసులనుంచి విడిపించే శక్తి లేకపోయినా వీళ్లని తోబుట్టువుల్లా ఆదరించారు.

వాళ్లందర్నీ చూసి తల్లీకూతుళ్లు భోరున విలపించారు.

"వాళ్ల నెక్లెస్సూ, వాళ్లూ నాశినంగానూ! ఇంట్లో పెట్టుకునే మామీద అపవాదు వేసి మమ్మల్ని ఈ గతి పట్టించారు. మా ఉసురు వాళ్లకి తప్పకుండా తగులుతుంది'' అని ఆండాళమ్మ ఏడ్చింది.

వాళ్లని ఆ స్థితిలో చూసిన ఆ గుడిసెవాసుల అందరి హృదయాలూ కోపంతో రగిలిపోయాయి.

ఆ మురికివాడలో ఉన్న చాలామంది వచ్చి వీళ్లని చూసి, పలకరించి పోయారు. అందరూ సానుభూతి తెలిపారు. 'అయ్యో పాపం!' అన్నారు. పోలీసుల్నీ, లక్ష్మణరావునీ చడామడా తిట్టారు.

కళాధర్‌కి విషయం తెలిసింది. అతను వెంటనే వచ్చాడు.

తల్లీకూతుళ్లతో మాట్లాడాడు. వాళ్లు ముందు చెప్పడానికి సంశయించారు.

ఇరుగుపొరుగువాళ్లూ, కళాధర్ ధైర్యం చెప్పడంతో బాధతో వాళ్లు తమకు జరిగిన పరాభవాన్ని ఏడుస్తూ చెప్పారు. 35 రోజులు తాము క్షణంక్షణం అనుభవించిన క్షోభనీ, హింసనీ వివరించారు.

వాళ్లు తమకి జరిగిన అవమానాల్ని చెప్పేటప్పుడు ఏమీ సిగ్గుపడలేదు. సిగ్గుపడాల్సిన తప్పు వాళ్లు చేయలేదుకదా!

"నెల రోజులనాడు మనుషులు ఎలా ఉండేవాళ్లు, ఇప్పుడు ఎలా ఉన్నారు? వీళ్లలో ఇప్పుడు ప్రాణం తప్ప ఇంకేముంది? వీళ్లు మళ్లీ మామూలుగా నెలరోజులనాటి మనుషులు కావాలంటే ఎన్ని నెలలు పడుతుంది? పని చెయ్యనివ్వకుండా, ఊరికే కూర్చోపెట్టి తిండిపెట్టినా ఇక అసలు మామూలు మనుషులు అవుతారా?" అన్నారు జనం.

వాళ్ల దీనగాధ విన్న కళాధర్ కదిలిపోయాడు. హృదయం చలించింది. కలం ఝుళిపించాడు.

35 రోజులు ఆ నిరపరాధులు పోలీస్ లాకప్‌లో పడిన వేదననీ, రోదననీ అక్షరబద్ధీకరించాడు. చదివిన పాఠకులు చలించిపో

యేలా, తన శక్తిసామర్థ్యాలు మొత్తం విని యోగించి కళాధర్ ఆ వార్తని శక్తివంతంగా రాశాడు.

మరుసటిరోజు పత్రికలో రావాలనే పట్టుద లతో రాత్రి 11 గంటలవరకూ కళాధర్ ఆ వార్తకి సంబంధించిన పనిలోనే నిమగ్నమ య్యాడు.

డెస్క్‌లోని సబ్ ఎడిటర్ ఆ వార్తకి మెరు గులు దిద్దాడు. చక్కటి పదాలతో, పాఠకుల్ని ఆకట్టుకునేలా వార్త రూపుదిద్దుకుంది.

'అమాయకులపై ఖాకీ పంజా!'

అనే శీర్షికతో హెచ్చరిక పత్రికలో పతాక శీర్షికతో మరుసటిరోజు ఆ వార్త వచ్చింది. ఆండాళమ్మా, ప్రభావతీల కలర్ ఫోటోలు వేశారు.

హృదయ స్పందన ఉన్న పాఠకులు చదివితే కంటనీరు పెట్టేలా ఆ వార్త ఉంది.

★ ★ ★

జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ కార్యా లయం.

ఎస్పీ చాలా కోపంతో ఉన్నాడు.

అంతకు రెండు రోజులక్రితం ఎస్.ఐ. కిషోర్ గంజాయిని మాయంచేసిన కేసులో డిఎస్పీల నివేదిక ఇచ్చాడు.

కిషోర్ కేవలం 5 వేల రూపాయల గంజాయిని మాత్రమే స్వాధీనం చేసుకుని గల్లంతు చేసినట్లు డిఎస్పీ తన నివేదికలో అనుమానం వ్యక్తం చేశాడు.

కిషోర్ గంజాయిని స్మగ్లర్ దగ్గరనుంచి తీసుకున్నట్లు స్పష్టమైన సాక్ష్యాధారాలేవీ దొ రకలేదు. కేవలం ఆ డిఎస్పీ అనుమానం మాత్రమే వెలిబుచ్చాడు.

అంతకుమించి కిషోర్‌కి అనుకూలంగా నివేదిక రాయడానికి డిఎస్పీకి సాధ్యంకాలే దు.

"నువ్వు 4 లక్షల రూపాయల గంజాయిని కొట్టేసినట్లు ఆధారాలు ఉన్నాయి కిషోర్' అన్నాడు డిఎస్పీ నివేదిక ఇవ్వడానికి ముందు.

"నాకు ఏం తెలియదు సార్. గంజాయిని తీసుకుని నేను ఏం చేసుకుంటాను సార్? అది నాకు ఎందుకు సార్?"

"నువ్వు అబద్ధాలు చెప్పి ఏం ప్రయో జనం? దొరికిన ఆధారాల్ని కాదంటావా ఏమిటి? ఈ రిపోర్ట్ కానీ ఎస్పీ ఆఫీసుకి వెళితే నువ్వు ఇంటికి వెళ్లక తప్పదు''

"నా ఉద్యోగాన్ని కాపాడండి సార్' అని కిషోర్ 50 వేలు డిఎస్పీకి సమర్పించాడు.

"నువ్వు 4 లక్షలు కొట్టేసి, నాకు ముష్టి 50 వేలా?" అని డిఎస్పీ ఆ డబ్బు తీసుకోవడాని కి తిరస్కరించాడు.

చివరికి మొత్తం లక్ష రూపాయలు సమ ర్పించుకుంటేకానీ డిఎస్పీ సంతృప్తి చెందలే దు.

అప్పుడు కిషోర్‌కి సాధ్యమైనంత అను కూలంగా, ఉద్యోగం ఊడిపోకుండా ఉండే టంత సింపుల్‌గా నివేదిక రాశాడు.

డిపార్ట్‌మెంట్‌లో ఒకరి గోత్రాలు మరొకరి కి మహా చక్కగా ఎరికే!

గంజాయి మాయంలో కిషోర్ నిరపరాధి అని డిఎస్పీ నివేదిక ఇచ్చినా అది నమ్మడాని కి ఎస్పీ ఏం అంత అమాయకుడు కాదు.

ఆ విషయం పరిశోధించి నివేదిక ఇవ్వ మని డిఎస్పీని నియమించకముందే ఎస్పీకి నిజం తెలుసు. అయినా నేరుగా చర్య తీసుకోకుండా పరిశీలించమని డిఎస్పీకి ఆ బాధ్యత ఒప్పగించాడు.

డిఎస్పీ ఇచ్చిన నివేదిక ఎస్పీ టేబుల్‌మీ దకు వచ్చి రెండు రోజులే అయింది.

కిషోర్‌ని వేరే చోటుకికానీ, వేరే శాఖకి కానీ బదిలీ చేస్తే బాగుంటుందని ఎస్పీ పరిశీలిస్తున్నాడు. ఇంతలోనే ఆండాళమ్మనీ, ప్రభావతినీ అన్యాయంగా చిత్రహింసలు పె




ట్టిన వార్త!

హెచ్చరిక పత్రికలో వచ్చిన వార్తని చది విన ఎస్పీ ఆగ్రహోదగ్రుడయ్యాడు. కిషోర్ తీరుకి చాలా కోపం వచ్చింది.

పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి నూటికి ఏ ఒక్క శాతమైనా, ఏ కొంచమైనా ఖ్యాతి మిగిలి వుంటే, దాన్నికాస్తా అపఖ్యాతిపాలు చేసే సంఘటన అది! ప్రజల్లో పోలీస్ డిపార్ట్ మెంట్ పరువు ప్రతిష్ఠల్ని ఇంకా దిగజార్చే చర్య అది!

ఉన్నఫళాన, తక్షణం వచ్చి తనని కలవ వలసిందిగా కిషోర్‌ని ఆదేశించాడు ఎస్పీ. అరగంటలోపే రావలసిందిగా ఆజ్ఞాపించా డు.

ఏం కొంపలు అంటుకోబోతున్నాయో, ఏ తిట్లు తినాలో అనిభయంభయంగానే కిషోర్ ఏమీ ఆలస్యం చేయకుండా, వెంటనే ఎస్పీ ఆఫీసుకి వెళ్లాడు.

కిషోర్ వెళ్లేసరికి ఎస్పీ పేపరులోని ఇతర వార్తలు చూస్తున్నాడు.

భయపడుతూనే లోనికి అడుగుపెట్టాడు. ఎస్పీ టేబుల్‌ముందు బూటు నేలకేసి బాది సెల్యూట్ చేసి వినయంగా నిలబడ్డాడు కిషోర్.

నిలబడిన కిషోర్ ముఖం పగిలిపోయేలా మడతపెట్టి ఉన్న హెచ్చరిక పత్రిక వచ్చి తగిలింది.

ఎస్పీ పత్రికను కిషోర్ ముఖానికేసి విసిరి కొట్టి కోపంగా ప్రశ్నించాడు - "వాటీజ్ దిస్?"

కిషోర్‌కి నోట మాట రాలేదు.

ఎస్పీ ఇంగ్లీషులో చడామడా తిట్టాడు.

కిషోర్ కొద్దిసేపటికి తేరుకుని "అన్నీ అబద్ధాలు సార్... ఆ పేపర్‌వాడు ఉన్నవీ, లేనివీ కల్పించి రాశాడు. వాడు అసలు..."

"షటప్... ఇడియట్. నువ్వు నీ డ్యూటీ సక్రమంగా చేస్తున్నావా? ఇంతకుముందు కూడా నీమీద చాలా కంప్లయింట్స్ వచ్చాయి. బ్రోతల్స్‌ని గుండ్లు గీసి ఊరే గించడం ఏమిటీ? వాటీజ్ దట్ న్యూసెన్స్. దిసీజ్ ఫస్ట్ అండ్ లాస్ట్ వార్నింగ్! నీమీద ఇంకోసారి ఎలాంటి కంప్లయింట్ వచ్చినా నీకు డిస్మిస్ ఆర్డర్ వస్తుంది. గెటవుట్..."

కిషోర్ ముఖాన నెత్తురు చుక్కలేదు. బతుకుజీవుడా అనుకుని బయటకు జారుకు న్నాడు.

కళాధర్‌మీద గొంతుదాకా కోపం వచ్చింది. పళ్లు పటపటా కొరికాడు.

★ ★ ★

ఆరోజు కిషోర్ వంట్లో నలతగా ఉందని సెలవుపెట్టాడు.

పైగా ఆరోజు పండుగ కూడా! పండుగ అని కొంతమంది పోలీసులు డ్యూటీకి రాలే దు. కొంతమంది సెలవులో ఉన్నారు.

స్టేషన్‌లో ముగ్గురు కానిస్టేబుళ్లే ఉన్నారు. ఒక కానిస్టేబుల్ నిద్రపోతుండగా, ఇద్దరు కానిస్టేబుళ్లు డ్యూటీ చేస్తున్నారు.

రాత్రి 2 గంటల ప్రాంతంలో స్టువర్ట్‌పురం ప్రభాకర్‌కి గుండెనొప్పి వచ్చింది.

లాకప్‌లో ఒక్కడే ఉన్నాడు. 'దాహం దాహం' అని నేలమీద పడి గింగిరాలు తిరిగిపోతున్నాడు.

అతను లాకప్‌లో ఆ చివర ఉండి అరుస్తు న్నాడు. నేలమీద పడి పొర్లాడుతున్నాడు.

అతనికి మంచినీళ్లు ఇవ్వడానికి కానిస్టే బుల్ లాకప్ తాళం తీసి లోపలికి వెళ్లాడు. ఇంకొక కానిస్టేబుల్ లాకప్ తలుపుదగ్గర నిలబడివున్నాడు.

నేలమీద పడి అరుస్తున్న ప్రభాకర్ మెరు పువేగంతో ఆ కానిస్టేబుళ్లు ఇద్దరినీ కొట్టి తప్పించుకుని పారిపోయాడు. అంతా సెక న్లలోనే జరిగిపోయింది.

క్షణాల్లోనే ఎస్పీ ఆఫీసుకీ, ఇతర స్టేషన్లకీ సమాచారం అందింది.

వ్యానుల్లోనూ, జీపుల్లోనూ పోలీసులు పట్టణం అంతా గాలించారు. గాలింపు

నిష్ప్రయోజనమైపోయింది.

ప్రభాకర్ సురక్షితంగా, సురక్షిత ప్రాంతానికి చేరుకున్నాడు.

గజదొంగ ప్రభాకర్ పోలీస్ స్టేషన్‌నుంచి తప్పించుకుపోయినట్లు మరుసటి రోజు ఉదయం పట్టణం అంతా వ్యాపించిపోయింది.

విలేకరులు ఆ వార్తని కవర్ చేయడానికి పోలీస్ స్టేషన్‌కు వెళ్లారు. వాళ్లలో కళాధర్ కూడా ఉన్నాడు.

సిఐడి, డిఎస్పీలు వచ్చారు. స్టేషన్ హడావుడిగా ఉంది. పోలీసులు ఆదుర్దా పడిపోతున్నారు. వైర్‌లెస్ సెట్లో ఏవేవో అరుపులు వినబడుతున్నాయి.

కళాధర్‌ని చూసి కిషోర్ ముఖం చిట్లించాడు. కళాధర్‌ని రెండు షాట్లు లాగుదామా అనిపించింది. కానీ అది సమయం, సందర్భం కాదని తమాయించుకున్నాడు.

గజదొంగ ప్రభాకర్ ఎలా తప్పించుకుపోయాడో ఎస్.ఐ. కిషోర్ క్లుప్తంగా విలేఖరులకి చెప్పాడు.

కిషోర్ ఒకమాటకీ, మరోమాటకీ పొంతన లేకుండా చెప్పాడు. మనిషి తడబడుతున్నట్లు అనిపించింది కళాధర్‌కి. పరస్పర విరుద్ధంగా మాట్లాడాడు.

"లాకప్‌లో ఇతర నేరస్తులు ఎవరూ లేరా?" కళాధర్ ప్రశ్నించాడు.

"లేరు..."

"సాధారణ నేరస్తులకి కూడా లాకప్‌లో కాళ్లకీ, చేతులకీ సంకెళ్లు వేసి పెడుతున్నారు. అలాంటిది గజదొంగ కాళ్లకి సంకెళ్లు ఎందుకు వేయలేదు?"

"చేతులకి ఉన్నాయి కదా సంకెళ్లు. కాళ్లకి కూడా అవసరం అనుకోలేదు. ఎప్పుడూ సంకెళ్లతో ఉంచాలని కూడా రూల్ ఏంలేదు''

"అతనికి మంచినీళ్లు బయటనుంచి ఇవ్వవచ్చుకదా? లాకప్ తాళం తీయవలసిన అవసరం ఏమిటి?"

"అతను గదిలో ఆ చివర ఉన్నాడు. గుండెనొప్పి అని అరుస్తున్నాడు. మనం బయటనుంచి మంచినీళ్లు అందిస్తే అందుతాయా?"

"మంచినీళ్లు తీసుకుని ఒక కానిస్టేబుల్ లోపలికి వెళితే, బయట ఉన్న కానిస్టేబుల్ తలుపు వేయవచ్చుకదా?"

"వేయవచ్చు. కానీ ఇలా తప్పించుకుపోతాడని ఎందుకు అనుకుంటాం?"

"మీ పోలీసుల్ని గాయపరిచి తప్పించుకుపోయాడని అంటున్నారు. ఏ ఆయుధంతో గాయపరిచాడు?"

"చిన్న కత్తి..."

"లాకప్‌లో ఉన్న అతని దగ్గరకి ఆ కత్తి ఎలా వచ్చింది?"

"అదే ఇప్పుడు తేలవలసిన ప్రశ్న. నిన్న సాయంత్రం వాడి భార్య స్టేషన్‌కి అన్నం తీసుకువచ్చింది. బహుశ ఆ అన్నం కేరియర్‌లో కత్తి పెట్టి ఉండవచ్చు. ఏదియేమైనా ఇది మేం పరిశీలించి చెప్పాల్సిన విషయం"

"ఒక గజదొంగ విషయంలో ఎంతో అప్రమత్తంగా ఉండాలి. చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. మీరు అజాగ్రత్తగా ఉన్నారనే ఆరోపణలు వస్తున్నాయి. ఏమంటారు?"

"అవి ఆరోపణలేకదా! వాస్తవం కాదు''

"తగినంతమంది సిబ్బంది లేకుండా, అర్ధరాత్రి సమయంలో లాకప్ రూం తాళం తీసి ఒక గజదొంగ దగ్గరికి మీ పోలీస్ ఎలా వెళ్లాడు?"

కిషోర్ మదిలో పంజాబ్ డిజిపి మెదిలాడు.

ఐ.ఎ.ఎస్. అధికారిణిపట్ల అసహ్యకరంగా ప్రవర్తించిన సంఘటనకాదుకానీ, ఆయన ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి ఇద్దరు విలేకరులని చావబాది, నెత్తురోడేలా చితక్కొట్టి వదిలిపెట్టాడు.




'వీడినీ అలాగే చావబాదితే...' అని పించింది కిషోర్‌కి ఒక్కక్షణం. కానీ ఇప్పుడు సమయంకాదు. తనే ఇప్పుడు సమస్యల్లో ఇరుక్కుపోయే పరిస్థితి! మళ్ళీ అదనంగా మరో సమస్యని ఎందుకు సృష్టించుకోవాలి? - అని ఆ ఆలోచనని విరమించుకున్నాడు.

"అది నీకు సంబంధం లేని ప్రశ్న. వార్త చెప్పాము... రాసుకున్నారు. ఇక వెళ్ళిపొండి. అంతేకానీ, మీరు అడిగే అడ్డదిడ్డమైన ప్రశ్న లకి జవాబులు ఇవ్వడానికేనా ఇక్కడ మేం కూర్చున్నది? మాకు వేరే పని ఏం లేదను కుంటున్నారా?" అన్నాడు కిషోర్ చాలా కో పంగా.

"అబ్బ... ఊరుకోవయ్యా! అన్నీ అనవ సరమైన ప్రశ్నలు. లేనిపోని ప్రశ్నలు ఎందుకు?" అని కళాధర్ పక్కన కూర్చున్న మరో విలేఖరి అన్నాడు.

ఆ విలేకరిని కళాధర్ ఏమీ లక్ష్యపెట్టలేదు. రాజకీయ నాయకులకీ, పోలీస్ అధికారులకీ తాబేదార్లుగా ఉంటూ, డబ్బు సంపా దించడం తప్ప కొందరికి వేరే ధ్యాస ఉండ దు.

స్టేషన్ ఆవరణ దాటి బయటకు వచ్చిన వెంటనే ఆ విలేకరిమీద కళాధర్ జగడం వేసుకున్నాడు.

"నీకు తెలియదు కళాధరూ... ఎందుకు పోలీసులతో రిస్క్? వాళ్ళతో బాగా తలనొప్పి! స్టేషన్‌నుంచి దొంగ తప్పించుకుపోయాడు. స్టేషన్‌నుంచి గజదొంగ పరారీ అని వార్త రాసి పడేస్తే సరిపోయే! వాడు ఎలా తప్పించుకున్నాడూ, ఏవిధంగా తప్పించుకు న్నాడూలాంటి విషయాలు మనకి ఎందుకు?" అని ఆ విలేకరి తనని తను సమర్థించుకోడానికి సిద్ధమయ్యాడు.

అలాంటివాడితో మాట్లాడటం కళాధర్‌కి వేస్ట్ అనిపించింది.

"నేను ప్రశ్నించేటప్పుడు నువ్వు జోక్యం చేసుకోవద్దు. నీకు చేతగాకపోతే చేతకానట్లు గమ్మున కూర్చో! ఆ పోలీస్‌వాడికి నీ సపోర్ట్ ఏమిటి? ఇంకోసారి నేను అడిగేటప్పుడు పిచ్చిపిచ్చిగా జోక్యం చేసుకున్నావో పళ్ళు రాలగొడతాను'' అని కళాధర్ ఆ విలేకరిని హెచ్చరించాడు.

పోలీసుల ప్రమేయం లేకుండా ప్రభాకర్ పరారీ కావడం అసంభవం అనిపించింది కళాధర్‌కి. తనకి కలిగిన సందేహాలు అన్ని టినీ ఒక క్రమంలో పెట్టి పరిశీలించాడు.

చిక్కుముడి విడిపోయింది. సందేహం తీరిపోయింది. పోలీసులే ప్రభాకర్‌ని తప్పించారని నమ్మకం కుదిరింది. అయితే ఆధారాలు ఏమిటి? సాక్ష్యం ఎలా?

★ ★ ★

లాకప్‌నుంచి ప్రభాకర్ తప్పించుకుపోవ డానికి పథకం రూపొందించింది ఎస్.ఐ. కిషోర్.

లాకప్‌లో ఇతర నేరస్తులు లేకుండా చేశా డు. ప్రభాకర్ కాళ్ళకి బిగించిన సంకెళ్ళని తీసివేశాడు.

తనకి నమ్మకస్తులైన ఇద్దరు పోలీసులతో ముందే మాట్లాడాడు. వాళ్ళతో అవగాహన కుదుర్చుకుని, ఆరోజు నైట్‌డ్యూటీ వాళ్ళకి వేశాడు.

తనమీద చాలా కంప్లయింట్స్ ఉన్నాయి కాబట్టి, ఎందుకైనా మంచిదని ముందుజాగ్ర త్తగా ఆరోజు సెలవు పెట్టాడు.

రాత్రి ఒంటిగంట ప్రాంతంలో ఆ పోలీసు లు ఇద్దరూ లాకప్‌లోనుంచి ప్రభాకర్‌ను బయటకు తీశారు. చేతులకు వేసిఉన్న సంకె ళ్లను తీసి, స్టేషన్ ఆవరణలోనే ఉన్న పెద్దబా విలో పడవేసి, ప్రభాకర్‌ని సాదరంగా సాగ నంపారు.

తరువాత తాపీగా తమ చేతులకీ, ముఖా నికీ స్వల్పంగా గాయాలు చేసుకున్నారు.

రెండు గంటల ప్రాంతంలో "పట్టుకోండి, పట్టుకోండి'' అని అరవడం మొదలుపెట్టా

రు. ఎస్పీ కార్యాలయానికీ, ఇతర స్టేషన్లకీ మెసేజ్ పంపారు.

మరుసటిరోజు విధినిర్వహణలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన నేరానికి ఆ ఇద్దరు కానిస్టేబుళ్లనీ ఎస్పీ సస్పెండ్ చేశాడు.

తమకి సస్పెన్షన్ ఆర్డర్ వస్తుందని ఆ పీసీలకు ముందే తెలుసు. అది కేవలం తాత్కాలికమే అనీ, తమ ఉద్యోగాలు ఎక్కడికీ పోవనీ, కొద్దిరోజులకి సస్పెన్షన్ రద్దుచేస్తారని కూడా వాళ్లకి స్పష్టంగా తెలుసు.

సస్పెండ్ అయినందుకు ఆ పోలీసులు ఏమీ చలించలేదు, బాధపడలేదు.

సస్పెన్షన్‌కి సిద్ధపడే వాళ్లు ప్రభాకర్ తప్పించుకుపోవడానికి తోడ్పడ్డారు.

ప్రభాకర్‌ని విడిచిపెట్టేరోజు రాత్రి బాగా పొద్దు పోయిన తరువాత ఎస్.ఐ. కిషోర్ ఇంటికీ, ఆ ఇద్దరు కానిస్టేబుళ్ల ఇంటికీ ఒక్కొక్కరికి లక్ష రూపాయల డబ్బూ, లక్ష రూపాయల పై చిలుకు విలువ చేసే బంగారు ఆభరణాలూ చేరిన విషయం ఎవరికీ తెలియదు.

అంతర్జాతీయ నేరస్తుడు చార్లెస్ శోభారాజ్ జైలునుంచీ, పోలీస్ కస్టడీనుండీ అనేకసార్లు తప్పించుకుని పోయాడంటే, చాలామంది అతని చాకచక్యాన్ని ప్రశంసిస్తుంటారు. అతడు నేరస్థుడైనా తప్పించుకుపోయే అతని సమర్థతకి అబ్బురపడి పోతుంటారు.

శోభారాజ్ సమర్థుడే! చాకచక్యం కలిగినవాడే!

పోలీస్ అధికారులకీ, జైలు అధికారులకీ డబ్బు మూటలు ఎరగా వేసి, వాళ్లని వలలో వేసుకోవడంలోనే ఉంది అతని చాకచక్యమూ, సమర్థతా, చురుకుదనమూ!

★ ★ ★

మెయిన్‌రోడ్‌లో మేడమీద కళాధర్ ఆఫీసు.

గజదొంగ పోలీస్ లాకప్‌నుంచి తప్పించుకుపోయిన విషయం కళాధర్ వార్తగా రాశాడు.

'అతని పరారీలో పోలీసుల పాత్ర...?' అని ప్రశ్నార్థకం పెట్టి మరో వార్త రాశాడు.

తనకి కలిగిన సందేహాలూ, వచ్చిన అనుమానాలూ అన్నిటినీ ఆ వార్తలో వ్యక్తపరిచాడు. తన ప్రమేయం లేకుండా, తను సందేహపడుతున్నట్లు గాకుండా ప్రజలు అనుకుంటున్నారు, భావిస్తున్నారు అని రెండో వార్తని ముగించాడు.

ఆ వార్తతోపాటు ఇతర వార్తలు కూడా రాత్రి 9 గంటలవరకూ రాశాడు.

టీపీ ఆపరేటర్, బాయ్, కంట్రిబ్యూటర్స్- అందరూ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

వేరే ఒక కేసు పరిశోధన నిమిత్తం, దానికి సంబంధించిన విషయాలు ఏమైనా దొరుకుతాయేమోనని రాత్రి 11 గంటల వరకూ పాత న్యూస్ పేపర్ ఫైల్స్ తిరగేస్తూ కూర్చున్నాడు. అవసరమైన పాయింట్స్ నోట్ చేసుకున్నాడు.

ఆకలిగా వుండటంతో, అవి అన్నీ సర్దేసి, గది తలుపువేసి క్రిందకు దిగి వచ్చాడు.

స్కూటర్ దగ్గరకు వచ్చి దాన్ని స్టార్ట్ చేస్తున్నాడు.

ఇంతలో ఇద్దరు ఆగంతకులు వచ్చారు. వాళ్ళని కళాధర్ ఎప్పుడు చూడలేదు.

వాళ్ళు రావడం రావడమే కళాధర్ మీదకు లంఘించారు. ఏమీ మాట్లాడకుండా ముఖంమీదా, వీపుమీదా, పొట్టమీదా, గుండెలమీదా బలంగా పిడిగుద్దులు గుద్దారు. రెండు నిముషాలపాటు, కళాధర్‌ని చిత్తుచిత్తుగా కొట్టి, వచ్చిన దారినే వేగంగా వెళ్ళిపోయారు.

దూరంగా కిళ్ళీబడ్డీ దగ్గరా, టీస్టాల్ వద్ద వున్న వాళ్ళు పరిగెత్తుకుని వచ్చేసరికి కళాధర్ నేలమీద పడిపోయివున్నాడు. నోటి వెంట నెత్తురు వస్తోంది.






కళాధర్‌ని వెంటనే వాళ్ళు దగ్గరలో వున్న హాస్పిటల్‌లో చేర్పించారు.

డాక్టర్లు కళాధర్ ప్రాణానికి ముప్పులేదని చెప్పి అవసరమైన వైద్యం చేసే పనిలో పడ్డారు.

మరుసటిరోజు జిల్లా జర్నలిస్టుల సంఘం అత్యవసర సమావేశం ఏర్పాటు చేసి, కళాధర్‌మీద జరిగిన దాడిని ఖండించింది. నిందితుల్ని తక్షణం అరెస్టు చేసి, శిక్షించాలని డిమాండ్ చేసింది.

జర్నలిస్టుల సంఘం నాయకులు ఎస్పీని కలిసి వినతిపత్రం సమర్పించి, న్యాయం చేకూర్చమని కోరారు.

కళాధర్ దగ్గర రిపోర్టు తీసుకుని, కేసుని దర్యాప్తుచేసి, నిందితుల్ని అరెస్టు చేయవల సిందిగా సిఐని ఆదేశించాడు ఎస్పీ. ఈ కేసు దర్యాప్తు బాధ్యతని సిఐకి ప్రత్యేకంగా కేటాయించారు.

సిఐ హాస్పిటల్‌కి వెళ్ళి కళాధర్‌వద్ద రిపోర్ట్ తీసుకున్నాడు.

కళాధర్‌మీద దాడిచేసింది ఎంఎల్ఏ గుర్నాధం అనుచరులే! అలాంటి అనుచరులు గుర్నాధానికి కనీసం 50 మంది వున్నారు. ఎవరిమీదైనా దాడిచేయడం, గాయపరచడం, హత్యచేయడం ఆ అనుచరులకి వెన్నతో పెట్టిన విద్య! అది వాళ్ళకి ఆటతో సమానమే!

వాళ్ళని దాడికి పురమాయించిందీ, ప్లాన్ వేసి చెప్పిందీ సాక్షాత్తూ ఎస్ఐ కిషోరే!

కిషోర్‌మీద వున్న కంప్లయింట్స్ అన్నీ దృష్టిలో పెట్టుకుని, అతను సివిల్‌లో వుంటే లాభంలేదనే వుద్దేశ్యంతో యాంటీ నక్సలైట్ స్క్వాడ్ విభాగానికి ఎస్ఐగా బదిలీ చేశాడు ఎస్పీ.

కిషోర్‌లాంటి క్రిమినల్ అయితేనే ఆ వుద్యోగానికి సరైన న్యాయం కలిగిస్తాడని

ఎస్పీ భావించాడు.



శరవేగంతో వృద్ధిచెందుతున్న పట్టణం అది.

మున్సిపాల్టీగా వున్న ఆ పట్టణాన్ని కార్పొరేషన్ చేస్తారని ప్రజలు అనుకుంటున్నారు.

రాజకీయనాయకులూ, అధికారులూ కూడా కార్పొరేషన్ చేస్తామని చాలాకాలంనించీ ప్రకటనలూ, వాగ్దానాలూ గుప్పిస్తున్నారు.

ఇందిరానగర్ పట్టణానికి చివరగా వున్న ఒక వాడ.

మూడు నాలుగు సంవత్సరాలక్రితం మిట్టపల్లాలతో, ఎగుడుదిగుడులతో ఎందుకూ పనికిరాకుండా వృధాగా వున్న పోరంబోకు భూమి అది.

గ్రామీణ ప్రాంతాలనించి పనులకోసం పట్టణానికి వలస వచ్చిన పేదలు ఎవరికీ కొరగాని ఆ భూమిని చదునుచేసుకుని, గుడిసెలు వేసుకోవడం మొదలుపెట్టారు.

రిక్షాలు తొక్కేవాళ్ళూ, తాపీ పని వాళ్ళూ, మిల్లు పనుల కూలీలూ- ఇలా ఒకర్ని చూసి ఒకరు ఆ భూమిలో గుడిసెలు వేసుకున్నారు. నాలుగు నెలలకే ఆ భూమి పేదల గుడిసెలతో నిండిపోయింది.

ఆ పేదలు దానికి ఇందిరానగర్ అని పేరుపెట్టారు.

మొదట్లో పట్టణానికి దూరంగా ఎక్కడో విసిరివేసినట్లు వున్న ఇందిరానగర్ చూస్తూండగానే పట్టణంలో అంతర్భాగమైపోయింది. వేగంగా అభివృద్ధి చెందుతున్న పట్టణం, ఇందిరానగర్‌ని సమీపించి దాటిపోయింది.

ఆ గుడిసెల పేదలకి ప్రభుత్వం పట్టాలు కూడా ఇవ్వలేదు. అయినా ఆ భూమికి విపరీతమైన విలువ పెరిగిపోయింది.

దానితోపాటే ఆ భూమిమీద పెద్దల డేగకళ్ళు పడ్డాయి. వాళ్ళలో ఎంఎల్ఏ గుర్నాధం ఒకడు.

ఆ భూమిని ఎలాగైనా ఆక్రమించుకోవాలనీ, హస్తగతం చేసుకోవాలనీ గుర్నాధం నిశ్చయించుకున్నాడు.

ప్రస్తుతం మార్కెట్ ధరల ప్రకారం కనీసం కోటి రూపాయల విలువ చేసే భూమి అది.

పట్టణశివార్లలో పరిశ్రమలు బాగా వెలుస్తున్నాయి. ఇంకా కొద్ది సంవత్సరాలు ఆగితే ఆ భూమి విలువ ఇంకా ఎన్ని కోట్లు చేస్తుందో!

అందులో వున్నవి కేవలం 300 మంది పేదల గుడిసెలు. ఆ పేదల్ని ఖాళీ చేయించి, ఆ గుడిసెలు తీసివేయిస్తే ఆ భూమి తను ఆక్రమించుకోవచ్చు.

ఆ భూమి తన హస్తగతమైతే ముందు ముందు ఏ అవసరానికైనా పనికివస్తుంది. ఫ్యాక్టరీ కట్టుకోవచ్చు. లీజ్‌కి ఇవ్వవచ్చు. ఏది ఏమైనా అది అతివిలువైన చక్కటి స్థిరాస్తి.

అన్ని రకాలుగా ఆలోచించిన గుర్నాధం ఆ భూమిని కబళించడానికి నిర్ణయించుకున్నాడు.

పదవివుంది, అధికారం వుంది, అండ వుంది, అవసరమైతే దౌర్జన్యం చేసే కండ వుంది. కనుక పేదలని ఆ స్థలంనించి





ఖాళీచేయించడం పెద్ద కష్టంకాదు అనుకున్నాడు.

ఆ గుడిసెవాసుల్లో ఏడెనిమిది కుటుంబాల పెద్దల్ని ఆకట్టుకున్నాడు.

"మీ కాలనీ ప్రక్కనే కెమికల్ ఫ్యాక్టరీ కడుతున్నారు. ఆ ఫ్యాక్టరీనించి వచ్చే కాలుష్యానికి మీరు అసలు జీవించలేరు. ఏదైనా ప్రమాదం జరిగితే, అక్కడెక్కడో భోపాల్‌లో జరిగినట్లు తెల్లవారేసరికి ఒక మనిషి కూడా మిగలడు. మీరు ఆ పేట ఖాళీచేస్తే మీ అందరికీ మరోచోట మంచి స్థలంలో మంచి ఇళ్ళు కట్టిపెడతాను''

గుర్నాధం మాటలు నమ్మిన ఆ ఏడెనిమిది మందిలో కొద్దిమంది మిగతా గుడిసెవాసులకి ఆ మాటలు చెప్పారు.

"ఆ కట్టిపెట్టేదేదో ఇక్కడే ఇళ్ళు కట్టిపెట్టమను. టౌనుకి ఇంకా దూరంగా ఎందుకు? మనుషులు బతక్కుండా, గాలి పోసుకోకుండా, జనం చచ్చిపోయేటట్లు ఫ్యాక్టరీ కడతారా ఏమిటి? ఆ ఫ్యాక్టరీ కట్టినప్పుడు చూద్దాంలే!" అన్నారు జనం.

గుర్నాధం మాటల్ని ఎవరూ పట్టించుకోలేదు.

రెండు మూడు నెలలు ఆగి గుర్నాధం ఏకంగా ఇందిరానగర్‌కి వచ్చి మీటింగ్ పెట్టి చెప్పాడు.

ఈసారి రికార్డు మార్చాడు.

"మా నాన్న జ్ఞాపకార్థం ఇక్కడ పేదవాళ్ళకోసం పెద్ద ఆస్పత్రి కట్టించాలనుకుంటున్నాను. అన్ని వసతులతోటీ, సౌకర్యాలతోటీ పెద్ద ఆస్పత్రి కట్టిస్తాను. మీరు గుడిసెలు ఖాళీచేస్తే ఈ స్థలంలోనే, మీకోసమే, పేదలకోసమే ఆస్పత్రి కడతాము. మీకు వేరే చోట మంచి నివాసం చూపెట్టే బాధ్యత నాది''

"నువ్వు ఆస్పత్రికట్టవద్దూ, మేం ఈ స్థలం ఖాళీచేయవద్దూ... ఏమీ వద్దుకానీ, చాల్చాల్లే, పోపోవయ్యా!" అని జనం విదిలించి కొట్టారు.

వీళ్ళని మామూలు మాటలతో బ్రతిమలాడితే ప్రయోజనం లేదని తన పథకం మార్చుకున్నాడు.

ప్రభుత్వ అధికారులతో మాట్లాడాడు. మంత్రితో రికమెండ్ చేయించుకున్నాడు.

ఆ స్థలం తన తండ్రి జ్ఞాపకార్థం ఆస్పత్రి నిర్మాణానికి ప్రభుత్వం ఇచ్చినట్లు కాగితాలు సృష్టించి తెచ్చాడు.

"ఇది గవర్నమెంటు భూమి. ఇక్కడ ఆస్పత్రి కట్టుకోవడానికి గవర్నమెంటు నాకు పర్మిషన్ ఇచ్చింది. మీరు మర్యాదగా ఖాళీ చేస్తారా చేయండి. మీరు కానీ ఖాళీ చేయకపోతారో చాలా గొడవ జరుగుతుంది'' అని గుర్నాధం తన మనుషులతో వచ్చి హెచ్చరించాడు.

"ఖాళీ చేయకపోతే ఏమవుతుంది?" ఆ గుడిసెవాసుల్లో ఒకరు ప్రశ్నించారు.

"వారం రోజులు టైం ఇస్తున్నా, వారం రోజుల్లో ఖాళీ చేయకపోతే ఏం అవుతుందో, ఏం జరుగుతుందో అప్పుడు తెలుస్తుంది'' అన్నాడు గుర్నాధం.

"నువ్వు ఆస్పత్రి కట్టుకోవాలంటే ఎక్కడా చోటు దొరకలేదా ఏమిటి? మేం మాత్రం ఖాళీ చేసే పని లేదు. నువ్వు ఏం చేస్తావో చూస్తాం" అని స్పష్టంగా తేల్చి చెప్పారు జనం.

ఆయన ఆ స్థలం ఆక్రమించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడని గుడిసెవాసులు అందరికీ తెలిసింది. వాళ్ళలో పట్టుదల పెరిగింది.

తమ నీడ, నివాసాలూ కాపాడుకోవాలంటే అందరూ ఐకమత్యంగా, సంఘటితంగా వుండాలనీ నిర్ణయించుకున్నారు.

పది రోజులు దాటిన తరువాత ఒకరోజు వుదయమే గుర్నాధం అనుచరులు ఇరవైమంది కర్రలూ, కత్తులు, పలుగులూ, పారలూ తీసుకుని, మూడు కారుల్లో వచ్చి, దౌర్జన్యంగా గుడిసెలు కూలగొట్టడానికి సిద్ధ

మయ్యారు.

"సామానంతా బయట పారవేయండి. మర్యాదగా ఖాళీ చేయండ్రా అంటే మీరు చేస్తారంట్రా?" అంటూ ఆ రౌడీలు గుడిసెల్లోని సామాన్లు బయట వేయడం మొదలుపెట్టారు.

పిల్లలూ, పెద్దవాళ్ళూ, ఆడవాళ్ళూ, మొగవాళ్ళూ అందరూ చేరారు. రౌడీల్ని ప్రతిఘటించారు.

వ్యక్తులమీద రౌడీల జులుం సాగుతుంది. అంతే కానీ, సమిష్టిగా వున్న జనంమీద రౌడీల జులుం సాగుతుందా?

జనం తిరగబడ్డారు. ఆ రౌడీల్ని తరిమి తరిమి దొరికినవాడిని దొరికినట్లు చిత్తుచిత్తుగా, తుక్కుతుక్కుగా కొట్టి వదిలిపెట్టారు.

అప్పటికే రౌడీలు ఒక గుడిసెని పీకివేశారు. రెండవ గుడిసె వద్దకు వచ్చి దానిని కూడా కొంత నష్టపరిచారు.

రౌడీలు వెళ్ళి పోలీసుకేసు పెట్టారు. తమని అకారణంగా, అన్యాయంగా ఆ గుడిసెవాసులు కొట్టారని వాళ్ళమీద కేసు బనాయించారు.

"గట్టిగా రాయవయ్యా ఇన్స్పెక్టరూ కేసూ... వాళ్ళకి మామూలు శిక్షకాదు, యావజ్జీవ శిక్ష పడాల! నా మనుషుల జోలికి వస్తారూ?" అని ఎంఎల్ఏ గుర్నాధం స్టేషన్‌లో కూర్చుని, పోలీసులమీద వత్తిడి తెచ్చి కేసు బలంగా రాయించాడు.

పోలీసులు వెళ్ళి గుడిసెవాసులు 10 మందిని అరెస్టుచేసి, తీసుకువచ్చి లాకప్‌లో పడేసారు.

ఆ వాడలోని వాళ్ళు అందరూ చందాలు వేసుకుని, రౌడీలు దాడి చేసి నష్టపరిచిన గుడిసెవాసులకి, మళ్ళీ గుడిసెలు వేసి పెట్టారు.

అరెస్టు చేసిన వాళ్ళని విడిపించుకోవడానికి గుడిసెవాసులు ప్లీడర్ల చుట్టూ తిరగడం మొదలుపెట్టారు.

★ ★ ★

కళాధర్‌కి దెబ్బలు తగ్గడానికి దాదాపు నెలరోజులు పట్టింది.

హాస్పిటల్‌నించి పూర్తి ఆరోగ్యంతో బయటకి వచ్చిన కళాధర్, మళ్ళీ ఆఫీసుకి వెళుతూ తన వార్తల ప్రపంచంలో పడ్డాడు.

వృత్తి విషయంలో ఎలాంటి అవినీతికీ, లొంగుబాటుకీ, రాజీకీ తావు లేకుండా పరిశోధనా వార్తలనే ఎక్కువగా ఇస్తున్నాడు. స్కూప్స్‌కే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నాడు.

కళాధర్‌మీద దాడి జరిగి నెలలు గడిచిపోతున్నా పోలీసులు ఒక్క వ్యక్తిని కూడా అరెస్టు చేయలేదు. కేసు ఒక్క అంగుళం కూడా ముందుకి కదలలేదు. వేసిన గొంగళి వేసిన చోటే పడివుంది.

ఇందిరానగర్ గుడిసెవాసుల భూమిని ఆక్రమించుకోవడానికి జరుగుతున్న ప్రయత్నాలు కళాధర్‌కి తెలిసాయి.

సమాజంలోని పెద్ద మనుషులు భూమిని కబ్జా చేయడానికి చేస్తున్న ప్రయత్నాలూ, ఆ పెద్దల కొమ్ము కాస్తున్న ప్రభుత్వ అధికారుల పన్నాగాలూ గమనించాడు.

విషయాన్ని తెలుసుకున్న కళాధర్ ఏమాత్రం తాత్సారం చేయకుండా కార్యరంగంలోనికి దూకాడు.

ఇందిరానగర్ పేదలతో వివరంగా మాట్లాడాడు. ఎంఎల్ఏ గుర్నాధం ఆ భూమిని దురాక్రమించడానికి మొదటినించీ వేస్తున్న ఎత్తులూ జిత్తులూ, కుట్రలూ వాళ్ళు చెప్పారు.

ఎంఎల్ఏ ప్రభుత్వ అధికారులు ముఖ్యంగా ఆర్‌డిఓల బండారాన్ని బట్టబయలు చేస్తూ కళాధర్ సమగ్రమైన వార్త రాసాడు. హెచ్చరిక పత్రికలో రెండురోజులు సీరియల్‌గా ఆ వార్త వచ్చింది.

ఆ వార్తని చదువుకున్న దొంగలు అందరూ భుజాలు తడుముకున్నారు. ప్రభుత్వం





ఖంగుతింది.

★ ★ ★

ఎంఎల్ఏ గుర్నాధం ఫోన్‌చేసి, ఎస్ఐ కిషోర్‌ని ఇంటికి పిలిచాడు.

"చెప్పండి సార్ పని ఏమిటో... ఇక్కడ కొంచెం బిజీలో వున్నాను'' అన్నాడు కిషోర్ ఫోనులో.

"రావయ్యా... పని వుంది. ఫోన్‌లో చెప్పే విషయాలు కావు. నువ్వు వస్తే అన్నీ వివరంగా మాట్లాడుకుందాం" అన్నాడు గుర్నాధం.

ఇంటికి వెళ్ళాడు ఎస్ఐ కిషోర్.

"ఏమయ్యా కిషోరూ నల్లపూసవయ్యావు! ఇటువైపు రావడం బొత్తిగా తగ్గించివేశావు. మామీద కానీ అలక వహించావా ఏమిటి?"

"మీ మీద ఎందుకు అలుగుతాను సార్? కొద్దిగా పనివత్తిడితో రావడానికి కుదరడంలేదు''

"నీకు ప్రమోషన్ విషయంలో సాయంచేసి పెట్టలేదని ఏమైనా అలిగావేమో అనుకుంటున్నా! మొన్న హోంమినిస్టర్‌తో ఫోన్ చేయించి డీజీపితో మాట్లాడించా! ఇక్కడ ఎస్పీ ఆఫీసునించి ఏవో కాగితాలు వెళ్ళాలట కదా! ఆ కాగితాలు ఇంకా రాలేదు, వచ్చిన వెంటనే మీ పని చేసి పెడతాము అన్నారోయ్!" నోటికి వచ్చిన అబద్ధం చెప్పాడు గుర్నాధం.

"ఏం కాగితాలు సార్?"

"ఏమో, ఆ విషయాలు నాకేం తెలుసు? ఈసారి నేను వెళ్ళేటప్పుడు నువ్వు కూడా రావోయ్! ఇద్దరం కలసి వెళ్ళి డీజీపీనీ, హోంమినిస్టర్‌నీ కలిసి మాట్లాడదాం"

"కాగితాలు ఏమీలేవుసార్. అన్నీ ఎప్పుడో పైకి పంపించారు''

"నాకు ఆ విషయాలు అన్నీ సరిగా తెలియవులే! ఈసారి నేను వెళ్ళేటప్పుడు నువ్వు కూడారా. ఇద్దరం మాట్లాడదాం. సరిపోతుంది''

"అలాగే సార్'

"సరే కిషోరూ... ఇప్పుడు ఒక ముఖ్యమైన అవసరం వచ్చిందోయ్! ఇందిరానగర్ లేదూ... 3, 4 సంవత్సరాల క్రితం వెలిసింది. అక్కడ 3 వందలమంది గుడిసెలు వేసుకుని వుంటున్నారు. మా నాన్న పేరుతో అక్కడ ఆస్పత్రి కట్టిద్దామని నా ఆలోచన. వాళ్ళని ఆ స్థలం నించి ఖాళీ చేయండ్రా అంటే ససేమీరా కాదంటున్నారు వెధవలు! వాళ్ళని ఎలాగైనా అక్కడినించి లేపాలయ్యా!"

"వాళ్ళని ఎలా తరిమి కొట్టాలి సార్?"

"అదే అర్థం కావడంలేదు. నాకు పిచ్చిపట్టినట్లు వుందనుకో! ఆ స్థలం విలువ తెలుసు కదా? ఎవరైనా వంద రూపాయల కాగితాలు పరిచి అంత విలువకి ఆ స్థలం కొంటారంటే నమ్ము! ఇప్పుడు దానికి అంత మార్కెట్ వాల్యూవుంది''

"నిజమే సార్... మరి ఏం చేద్దాం?"

"ఆ లం... కొడుకులకి అంత ధైర్యం ఎక్కడినించి వచ్చిందో నాకు అర్థంకావడంలేదోయ్! వాళ్ళ వెనుక ఎవరో వున్నారని నా అనుమానం. మనవాళ్ళు కూడా అదే మాట అంటున్నారు. వాళ్ళ వెనుక వాళ్ళకి సపోర్ట్‌గా నక్సలైట్లు వున్నారని అంటున్నారు. నిజమెంతో, అబద్ధమెంతో ఎంక్వయిరీ చేసి ఎవరు వున్నారో పట్టి వాళ్ళ అంతు చూడాలోయ్''

"చూద్దాం సార్'

"చూద్దాం అంటే కాదు. వాళ్ళకి సపోర్ట్‌లేకుండా చేస్తే మన పని సులువు అవుతుంది. నువ్వు చేసిన సాయం మరిచిపోతాను అనుకోవద్దు. ఆ స్థలంలో నీకు వాటా ఇస్తా! 40 సెంట్లో, 50 సెంట్లో నువ్వా తీసుకో!"

"అలాగే సార్'

"ఈ విషయంలో మీ పోలీసుల సపోర్ట్

గట్టిగా కావాలోయ్! మీరూ మేమూ కలిస్తే కానీ వాళ్ళని అక్కణ్ణించి ఖాళీచేయించడం కుదరదు. నువ్వు మాత్రం గట్టిగా వాళ్ళ వెనుక వున్న వాళ్ళని పట్టు. తరువాత మీరూ మేమూ కలిసి వాళ్ళని నిమిషాలమీద లేపేద్దాం"

"సరే సార్... తప్పకుండా వాళ్ళని అక్కడ్నించి లేపేసి ఆ స్థలం మనం స్వంతం చేసుకుందాం!" అని కిషోర్ లేచి వచ్చేశాడు.

అప్పటినించీ దాదాపు 10, 15 రోజులు కిషోర్ పూర్తిగా ఇందిరానగర్‌మీద దృష్టి సారించి అదేపనిలో నిమగ్నమయ్యాడు.

★ ★ ★

రాత్రి రెండు గంటలు.

పట్టణం అంతా గాఢనిద్రలో వుంది.

ఆ సమయంలో 5 వ్యానులు నిండుగా పోలీసులతో మహావేగంగా ఇందిరానగర్‌కి దూసుకువచ్చాయి.

తుపాకులతో సిద్ధంగా వున్న పోలీసులు వ్యానుల్లో నించి బూట్లు టకటకలాడించుకుంటూ దూకి ఒక గుడిసెని చుట్టుముట్టారు.

కొంతమంది పోలీసులు ఇతర గుడిసెల వద్దకు వెళ్ళారు.

పోలీసులు ప్రజల్ని భయభ్రాంతులు చేయడానికి గుడిసెల కప్పులకి కాల్పులు జరిపారు. ఆకాశం వైపు కాల్పులు జరిపారు.

పోలీసులు చీమలబారులా, అంగుళం ఖాళీ లేకుండా ఆ గుడిసెని చుట్టుముట్టారు. లోపల నించి ఈగ తప్పించుకుపోవాలన్నా సాధ్యం కాదు.

కిషోర్ నేతృత్వంలో 10 మంది పోలీసులు గుడిసె తలుపుల్ని తోసుకుని లోపలకి వెళ్ళారు.

గుడిసెలోపల వున్న ముగ్గురు మగవాళ్ళనీ, ఇద్దరు ఆడవాళ్ళనీ కొట్టుకుంటూ, ఈడ్చుకువచ్చి వ్యానుల్లో వేశారు.

గుడిసె మొత్తం గాలించి, లోపలనించి కొన్ని కరపత్రాలూ, నాలుగు పుస్తకాలూ స్వాధీనం చేసుకున్నారు. ఒక యువకుడి వద్ద వున్న ఎకె47 తుపాకీని తీసుకున్నారు.

వాళ్ళని వ్యానుల్లో వేసిన తరువాత పోలీసులు అందరూ వ్యానుల్లో ఎక్కారు. ఎంత వేగంగా వ్యానులు వచ్చాయో, అంతే వేగంగా వెళ్ళిపోయాయి.

పోలీసులు పట్టుకుపోయింది ఆ గుడిసెలో వుంటున్న కుటుంబసభ్యులు ముగ్గుర్నీ, జిల్లా నక్సలైటు పార్టీ కార్యదర్శినీ, అతని భార్యనీ!

★ ★ ★

తెల్లవారింది.

ఇందిరానగర్‌లో విషాదఛాయలు అలుముకున్నాయి. ఆ పేట వాసులు అందరూ విచారంగా, దిగులుగా వున్నారు.

ఆ పేటలో ఆ రోజు ఎక్కడ చూసినా కొత్త ముఖాలే! కొత్త వ్యక్తులే!

సివిల్ దుస్తుల్లో పోలీసులు ఆ పేటలో తిష్టవేశారు.

ఇద్దరు ముగ్గురు కుర్రవాళ్ళు వెళ్ళి పత్రికా ప్రతినిధులకి విషయం తెలిపారు. నక్సలైట్లు పార్టీ జిల్లా కార్యదర్శినీ, అతని భార్యనీ పోలీసులు రాత్రి పట్టుకుపోయారనీ, వాళ్ళకి ప్రమాదం జరిగే అవకాశం వుందనీ కనుక వార్తగా రాయమనీ కోరారు.

హక్కుల సంఘంవాళ్ళకికూడా విషయం తెలిసింది. వాళ్ళు వెంటనే పత్రికలకు ప్రకటనలు ఇచ్చారు.

హెూంమినిస్టర్‌కీ, డిజీపికీ టెలిగ్రాములు ఇచ్చారు.

అరెస్టయిన వారిని బూటకపు ఎన్‌కౌంటర్‌లో కాల్చి చంపే ప్రమాదం వుందనీ, వాళ్ళని వెంటనే కోర్టులో హాజరుపెట్టమనీ కలెక్టర్‌ని కలిసి విన్నవించారు. వాళ్ళకి ఏమైనా జరిగితే పోలీసులే బాధ్యత వహించవలసి వుంటుందని హెచ్చరించారు.

హక్కుల సంఘంవాళ్ళు తమ చేతనైన




పరిధిలో వాళ్ళ విడుదలకోసం కృషి ప్రారంభించారు.

★ ★ ★

ఆ అరెస్టయినతని పేరు సాగర్!

అతనికోసం ఎంతోకాలంనించీ పోలీసులు అన్వేషిస్తున్నారు. సాగర్ వాళ్లకి దొరక్కుండా రహస్య జీవితం గడుపుతున్నాడు.

సాగర్ చిక్కడంతో కిషోర్ ఉత్సాహపడిపోతున్నాడు. అతని ఆనందానికీ, సంతోషానికీ హద్దులు లేకుండా వున్నాయి.

సాగర్‌ని ముందుగా బెదరకొట్టి, లొంగ తీసుకోవటానికి కంబళిమార్ ట్రీట్‌మెంట్ ఇచ్చారు.

దీనినే పోలీసుల పరిభాషలో ఆల్‌ఇన్‌వన్ ట్రీట్‌మెంట్ అంటారు.

సాగర్‌ని కంబళిలో చుట్టేశారు. తర్వాత తీవ్రమైన పిడికిలి గుద్దులతో ప్రారంభించి బెల్టు, లాఠీ చెయిన్, సైకిల్ ట్యూబ్‌లాంటి వస్తువులతో దాదాపు రెండుగంటలసేపు విపరీతంగా కొట్టారు.

ఒక మానవదేహాన్ని ఎన్ని రకాలుగా బాధించాలో, క్షోభపెట్టాలో, హింసించాలో ఒక్క పోలీసులకి తప్ప పెద్దపెద్ద డాక్టర్లకి కూడా తెలీదు.

సాగర్‌కి ఆ ట్రీట్‌మెంట్ ఇచ్చిన తరువాత ఇంటరాగేట్ చేయడం మొదలుపెట్టారు.

"నీ పేరేమిటి?"

"సాగర్''

"నిక్ నేం కాదు, అసలు పేరు?"

"మోహనరావు''

"నువ్వు పార్టీలోనికి వచ్చి ఎన్నేళ్ళు అవుతోంది?"

"6 సంవత్సరాలు''

"ఏం చదువుకున్నావు?"

"ఎజీ ఎమ్మెస్సీ గోల్డ్‌మెడలిస్ట్‌ని''

"మంచి చదువులే చదువుకుంటార్రా మీరు. బుద్దే దరిద్రపు బుద్ధి కానీ! ఎందుకు నీకు ఈ ఖర్మ, చెప్పు? ప్రయత్నిస్తే నీ చదువుకి మంచి జాబ్ రాకపొయ్యిందీ?"

"..... ....."

"ఇప్పుడు అయినా మించిపోయిందేమీ లేదు. మాకు అవసరమైన ఇనఫర్మేషన్ ఇచ్చి, మాతో కానీ కోఆపరేట్ చేసావంటే నీకు ఎలాంటి ఇబ్బందీ వుండదు. గవర్నమెంట్‌కి రికమెండ్‌చేసి మంచి జాబ్ కూడా ఇప్పిస్తాము. మేము అడిగే వాటికి సమాధానాలు చెప్పు, చాలు!"

"... ..."

"మీ కేంద్ర కమిటీ కార్యదర్శి ఎక్కడ వుంటాడు?"

"... ..."

"పోనీ, మీ కేంద్ర కమిటీ సభ్యుల్లో ఒక్కడి ఆచూకీ అయినా చెప్పరా! చాలు. నిన్ను వదిలేస్తాం!"

"... ..."

"లాభంలేదు. వీడు సామాన్యుడు కాదు. వీడికి తిండి పడేసి, తరువాత ఏరోప్లేన్ ట్రీట్‌మెంట్ ఇవ్వండి. ఆ ట్రీట్‌మెంట్ ఇస్తే కానీ వీడి నోటినుంచి మనకి కావలిసిన ఇనఫర్మేషన్ రాదు'' ఒక పోలీస్ అధికారి ఆజ్ఞాపించాడు.

ముద్దాయిల మీద పోలీసులు ప్రయోగించే భయానక, అమానుష, బీభత్స, చిత్రహింసల పర్వంలో ఏరోప్లేన్ ట్రీట్‌మెంట్ ఒకటి.

పట్టుకుంటే కమిలిపోయేటంత సుతిమెత్తని శరీరం సాగర్‌ది.

అతనికి ఆహారం ఇచ్చిన తరువాత పోలీసులు తమకి కావలసిన సమాచారం కోసం ఒక ఆట మాదిరిగా, పాట మాదిరిగా సరదాగా ఆ శరీరంమీద రాక్షస హింసాకాండని అమలు జరపడం ప్రారంభించారు.

సాగర్‌ని ముందుగా తలక్రిందులుగా వేలా

డతీశారు. తరువాత అతని చేతుల్ని తాళ్లతో కట్టి పైకిలేపి, మనిషిని 'U' ఆకారంలో వేలాడతీశారు. కాళ్ళూ, చేతులూ కట్టి పైకి వేలాడతీయడంతో అటు ఆకాశం, ఇటు భూమీకాని త్రిశంకు స్వర్గంలా వుంది అతని పరిస్థితి. శరీరం మొత్తం బరువు కాళ్లమీదా, చేతులమీదా పడటంతో అతని బాధ వర్ణనాతీతం.

అదే ఇతర ముద్దాయిలయితే ఆ బాధని భరించలేక ఏడవడం, పోలీసుల్ని వేడుకోవడం చేస్తారు.

కానీ సాగర్ మౌనంగా ఆ బాధని భరిస్తున్నాడు.

తొడల దగ్గర కాళ్ళూ, భుజాల దగ్గర చేతులూ భరించరాని నొప్పితో బాధని కలిగిస్తున్నాయి. ఆ భాగాలు శరీరంనించి వూడిపోయి, మొండెం నేలమీద పడిపోతే బాగుంటుందనే భావన సాగర్‌కి కలిగింది.

20 కిలోల బరువు కలిగిన రాయిని తీసుకువచ్చి, 'U' ఆకారంలో వేలాడతీసిన శరీరంమీద పెట్టి, పోలీసులు ప్రశ్నలు అడుగుతూ, లాఠీలతో ఆ శరీరాన్ని కొట్టడం మొదలుపెట్టారు.

"చెప్పరా, మీ సెంట్రల్ కమిటీ సెక్రటరీ ఎక్కడ చిక్కుతాడు?"

"మీకు ఆయుధాలు ఎక్కడనించి వస్తాయిరా? సరఫరా చేసేది ఎవరు?"

"ఒక్క అండర్ గ్రౌండ్ నక్సలైటు ఆచూకీ అయినా ఇవ్వరా?"

U ఆకారంలో వేలాడతీసిన సాగర్‌ని లాఠీలతో కొడుతూ ప్రశ్నలతో ముంచెత్తుతున్నారు. అన్ని ప్రశ్నలకీ సాగర్‌నించి 'తెలియదు' అనే జవాబూ, మౌనం మాత్రమే వస్తున్నాయి.

మరో గదిలో సాగర్ భార్య సంధ్యని కూడా పోలీసులు అన్ని రకాలుగా ప్రశ్నించారు. ఆమెనించి కూడా ఒక చిన్న మాటని పోలీసులు రాబట్టలేకపోయారు.

సంధ్యని ప్రశ్నలు అడిగి, విసుగెత్తిన పోలీసులు ఆమెకి వెయిట్ ట్రీట్‌మెంట్ ఇచ్చారు.

ఆమె చేతుల్ని బారచాపారు. ఆ చేతుల మీద 40 కిలోల బరువు వున్న పెద్ద బండరాయిని తీసుకువచ్చి పెట్టారు. కాళ్లు బారచాపి కూర్చోపెట్టి, చేతులమీద ఆ బరువు పెట్టారు. చేతులు ముడిస్తే ఆ రాయివచ్చి కాళ్ళమీద పడుతుంది. కాళ్లు పచ్చడైపోతాయి. చేతులు ముడవకుండా కూడా పోలీసులు చేతులమీదా, భుజాలమీదా లాఠీలతో కొడుతూ ప్రశ్నలు అడుగుతున్నారు. చేతులు ఆ బరువు మోయలేక విపరీతంగా లాగుతున్నాయి. భుజాలు వూడిపోయేలా వున్నాయి.

పోలీసులు ఆ స్త్రీ మూర్తిని కొడుతూ, ఎన్నిరకాల హింసలు పెట్టినా, బాధలు పెట్టినా, ఆ శరీరం ఏమాత్రం భరించలేని వేదనా, క్షోభా కలిగించినా వాళ్లు ఆమెనించి ఒక చిన్న సమాచారాన్నీ, ఒక చిన్న సమాధానాన్నీ, ఒక చిన్న ఆచూకీని తెలుసుకోలేకపోయారు.

★ ★ ★

మర్నాటిరోజు అన్ని పత్రికలలోనూ నక్సలైటు పార్టీ జిల్లా కార్యదర్శి సాగర్‌నీ, అతని భార్య సంధ్యనీ అరెస్టు చేసిన వార్త వచ్చింది.

ఇందిరానగర్‌లో ఒక పూరిగుడిసెలో వుండగా వాళ్ళ ఇద్దర్నీ పట్టుకుపోయారని రాశారు. వాళ్ళ ఇద్దర్నే గాకుండా, ఆ గుడిసెలో కాపురం వుంటున్న భార్యాభర్తల్నీ, వాళ్ళ కొడుకుని కూడా పోలీసుల పట్టుకున్నారనీ, వాళ్ళని ఎక్కడ నిర్బంధించారో తెలియడం లేదనీ ఆ వార్తలో వుంది.

ఆ వార్త కిందనే హక్కుల సంఘంవాళ్ళ ప్రకటన కూడా వేశారు. వాళ్లని తక్షణం కోర్టులో హాజరు పరచవలసినదిగా ఆ సంఘం డిమాండ్ చేసింది. వాళ్ల ప్రాణాలకు




ముప్పువాటిల్లే ప్రమాదం వుందని ఆందోళన తెలిపింది.

పత్రికలవాళ్లూ, హక్కుల సంఘంవాళ్లూ, ప్రజలూ అందరూ ఆందోళన చెందుతుండగానే, ఏం జరుగుతుందో అని భయపడిపోతుండగానే- ఆ రాత్రే...

సాగర్‌నీ, సంధ్యనీ కాల్చిచంపారు.

ఆ రెండు నిండుప్రాణాల్నీ నిలువునా బలితీసుకున్నారు.

వాళ్ళ ఇద్దర్నీ తాళ్లతో మూటలుగా కట్టిపడవేసి, వ్యానుల్లో వేసుకుని, ఆ పట్టణానికి 20 కిలోమీటర్ల దూరం తీసుకుపోయి ఒక పల్లెటూరి రోడ్డుమీద ఈ ఘాతుకానికి పాల్పడ్డారు.

నక్సలైటు ఉద్యమం ప్రారంభమైన తరువాత ఆనాటినించీ ఈనాటివరకూ ఈ రాష్ట్రంలో పోలీసులు 12 వందల మందిని ఎన్‌కౌంటర్ల పేరుతో కాల్చిచంపారు.

వాళ్లలో విద్యార్థులు వున్నారు... ఉపాధ్యాయులు వున్నారు... కాలేజీ అధ్యాపకులు వున్నారు... నిరుద్యోగులు వున్నారు... ఇంజినీర్లు వున్నారు... లాయర్లు వున్నారు... డాక్టర్లు వున్నారు... ప్రభుత్వ ఉద్యోగులు వున్నారు... కార్మికులు వున్నారు... కళాకారులు వున్నారు... రచయితలు వున్నారు.. రైతులు వున్నారు... కూలీనాలీ చేసుకునే నిరుపేద జనం వున్నారు... 10, 12 ఏళ్ల వయస్సు వున్న పసిపిల్లలు కూడా వున్నారు.

మొదటి ఎన్‌కౌంటర్ 1968 మార్చి నెలలో జరిగింది.

భార్య పక్కలో పడుకున్న భర్తనీ...

తల్లి పక్కలోనో, తండ్రి పక్కలోనో పడుకున్న బిడ్డనీ...

అన్న పక్కలో పడుకున్న తమ్ముణ్ణీ...

పసికందు అయిన కొడుకు పక్కలో పడుకున్న తండ్రినీ...

అర్ధరాత్రీ, అపరాత్రీ దొంగల్లా వచ్చి, లేవ

గొట్టి తీసుకుపోయి...

బనియన్, లుంగీమీద పడుకున్న వాళ్లని పడుకున్నట్లే వెంటబెట్టుకుపోయి...

నిరాయుధుల్ని నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపేసి...

ఎన్‌కౌంటర్లో మరణించారని కట్టుకథలు చెప్పారు.

మామీద కాల్పులు జరిపితే, ఆత్మరక్షణ కోసం మేం జరిపిన ఎదురుకాల్పుల్లో మృతి చెందారని కల్లబొల్లి కబుర్లు చెప్పారు.

ఇవి-

మానవహక్కులు మంటగలిసిపోతున్నాయని మన నాయకులూ, పాలకులూ గగ్గోలెత్తిపోయే ఏ పాకిస్తాన్‌లోనో, ఏ ఫిలిప్పిన్స్‌లోనో, ఏ పనామాలోనో, ఏ నైజీరియాలోనో జరిగిన హత్యాకాండలు కావు.

ఇవి-

మనదేశంలోనే...

మన రాష్ట్రంలోనే...

మన జిల్లాలోనే...

మన వూళ్లోనే...

మన కళ్ళముందే...

మన ఎదురుగానే...

జరిగిన దారుణ మారణకాండలు!

ఇంత నగ్నంగా హక్కుల హరణ జరుగుతుంటే ఈ రాజ్యంలో చట్టాలు ఏం చేస్తున్నాయి?

న్యాయాధికారులు ఏం చేస్తున్నారు?

కోర్టులు ఏం చేస్తున్నాయి?

రాజ్యాంగం, చట్టాలూ, హక్కులూ అన్నీ... అన్నీ... అన్నీ... కళ్ళముందే కాలరాచి వేస్తుంటే...

ప్రాథమిక హక్కు కనీస హక్కు అయిన జీవించే హక్కుని నిస్సందేహంగా, నిస్సంకోచంగా, నిర్లజ్జగా కబళిస్తుంటే...

ఎవరూ ఎందుకు ప్రశ్నించడం లేదు?

ఎందుకీ మౌనం?

సాగర్‌నీ, సంధ్యనీ కాల్చి చంపిన తెల్లవారి అన్ని పత్రికా విలేఖరుల కార్యాలయాలకీ పోలీసులు ఇచ్చిన ప్రకటన వచ్చింది.

ఫలానా వూళ్ళో ఒక ఇంట్లో నక్సల్స్ సమావేశం అయినట్లు సమాచారం అందిన పోలీసులు ఆ ఇంటిమీద దాడి చేయడానికి వెళ్ళారు. పోలీసుల్ని గమనించిన నక్సల్స్ కాల్పులు ప్రారంభించారు. ఆత్మరక్షణ కోసం పోలీసులు జరిపిన ఎదురు కాల్పుల్లో ఇద్దరు నక్సల్స్ మృతి చెందారు. మిగతా నక్సలైట్లు తప్పించుకు పారిపోయారు. ఆ మృతి చెందిన ఇద్దరు నక్సలైట్లూ జిల్లా పార్టీ కార్యదర్శి సాగర్‌గానూ, అతని భార్య సంధ్యగానూ పోలీసులు గుర్తించారు. మృత దేహాల వద్ద ఎకె 47 తుపాకీ, కొంత విప్లవసాహిత్యం పోలీసులకి దొరికాయి.

ఇదీ ఆ ప్రకటన సారాంశం.



రెండు రోజుల తరువాత ఇందిరానగర్ మీద బిఎస్ఎఫ్ జవాన్లు వచ్చిపడ్డారు.

బిఎస్ఎఫ్ జవాన్లకు తోడు కిషోర్ నాయకత్వంలో చాలామంది స్థానిక పోలీసులు కూడా పాల్గొన్నారు.

స్త్రీలూ, పిల్లలూ, ముసలివాళ్లూ- అందర్నీ గుడిసెల్లోనించి బయటకు ఈడ్చుకువచ్చి, చిత్తం వచ్చినట్లు కొట్టారు. దొరికినవారిని




దొరికినట్లు చావబాది వదిలిపెట్టారు.

ప్రజల్ని కొట్టి, ఆ పేటని బీభత్సం చేసి. భయానక వాతావరణం సృష్టించి, ఆ పేటలో వున్న యువకులు దాదాపు 60 మందిని పట్టుకుపోయి, అందరిమీదా టాడా కేసు పెట్టారు.

ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాన్నీ, రాజ్యాన్నీ సాయుధంగా కూలగొట్టాలనే లక్ష్యంతో తుపాకీ కలిగివున్న నక్సలైటుకు ఆశ్రయం ఇవ్వడం ఆ పేటవాసులు చేసిన తప్పిదం!

అందుకే వాళ్లమీద టాడా కేసు పెట్టారు.

టాడా అంటే టెర్రరిస్టు, విచ్ఛిన్నకర కార్యకలాపాల (నిరోధక) చట్టం!

ఎప్పుడో 150 సంవత్సరాల క్రితం బ్రిటీష్ వాడు తయారుచేసిన, ప్రస్తుతం దేశంలో అమలు జరుపుతున్న నల్లచట్టాలు సరిపోక పార్లమెంటు ఈ చట్టం ఆమోదించింది.

మానవహక్కులకీ, సహజ న్యాయసూత్రాలకీ, ప్రజాస్వామ్యానికీ బద్ధవ్యతిరేకమైనది ఈ చట్టం!

ముద్దాయికి కోర్టులో వుండే అన్ని హక్కుల్నీ ఈ చట్టం తీసివేస్తుంది. ఈ చట్టం ప్రకారం-

లాకప్‌లో ముద్దాయిని పోలీస్ అధికారి కొట్టీ, హింసించీ ఒప్పించిన విషయం కోర్టులో సాక్ష్యంగా చెల్లుబాటు అవుతుంది.

నేరారోపణ పోలీసులు చేస్తే నిర్దోషిత్వం ముద్దాయి రుజువు చేసుకోవాలి.

ముద్దాయి తను నిరపరాధినని రుజువు చేసుకోవడానికి అతనిమీద వున్న నేరారోపణ వివరాలు తెలియచేయరు.

విచారణ రహస్య స్థలంలో ఎక్కడైనా జరుపుతారు.

నిన్ను నీ వూళ్ళో టాడా క్రింద అరెస్టుచేసి ఏ పంజాబ్‌లోనో, కాశ్మీర్‌లోనో, కన్యాకుమారిలోనో విచారణ జరపవచ్చు.

ముద్దాయి నిర్దోషి అని కోర్టు భావిస్తే తప్ప బెయిల్ దొరకదు.

ఒక సంవత్సరం వరకూ కనీసం చార్జిషీటు కూడా పెట్టకుండా జైలులో వుంచవచ్చు.

ఈ చట్టం ప్రకారం దేశంలో ఒక ప్రాంతానికి విడిపోయే హక్కు వుందని భావించినందుకే యావజ్జీవ కారాగారశిక్ష వేస్తారు.

'టెర్రరిస్టులు'గా పోలీసులు గుర్తించిన వ్యక్తులతో సంబంధం కలిగివుంటే, కనీసం మాట్లాడినా అది నేరమే!

జాతీయ మానవహక్కుల కమీషన్ చైర్మన్ దగ్గర్నించీ కేంద్ర హోంశాఖ సహాయ మంత్రివరకూ- అందరూ ఈ నల్లచట్టాన్ని రద్దు చేయమంటున్నారు.

ప్రధానమంత్రి మొదలు సుప్రీంకోర్టు న్యాయమూర్తులవరకూ అందరూ ఈ చట్టం దుర్వినియోగం అవుతోందనీ, దుర్వినియోగాన్ని అరికట్టాలనీ అభిప్రాయపడుతున్నారు.

అయినా ఈ చట్టం యధావిధిగానే అమాయకప్రజలపై తన కొరడా ఝళిపిస్తూ వుంది.

ఈ చట్టం ప్రకారం ఈ రాష్ట్రంలో కనీసం 12 వేలమంది కటకటాల పాలయ్యారు. వేలాది కుటుంబాలు చిన్నాభిన్నమైపోయాయి. వాళ్ళ భార్యాబిడ్డలు అల్లాడిపోతున్నారు.

దక్షిణభారతదేశంలో ఈ చట్టాన్ని వినియోగించడంలో మన ఆంధ్రా రాష్ట్రమే అగ్రస్థానంలో వుంది.

సాగర్‌కీ, సంధ్యకీ ఆశ్రయం ఇచ్చిన కారణంగా ఇందిరానగర్ గుడిసెవాసులు దాదాపు 60 మందిమీద ఈ చట్టాన్ని బనాయించారు.

★ ★ ★

దాదాపు రెండు సంవత్సరాలుగా ప్రమోషన్ కోసం పరితపిస్తున్న కిషోర్‌కి ఎవరి ప్రయత్నం లేకుండానే, ఎన్‌కౌంటర్ జరిగిన వారం రోజుల్లోనే సిఐగా పదోన్నతి లభించింది.

అతనికి బహుమతి కూడా ప్రకటించారు.

కిషోర్ ఆనందానికి అవధులు లేవు.

ప్రమోషన్ పొందిన కిషోర్ ప్రతీరోజూ తాగుతున్నాడు. తాగి, ఇంటికి వెళ్ళిన తరువాత ఏదో ఒక నెపంమీద భార్య వనజని తిడుతున్నాడూ, కొడుతున్నాడు.

సమాజం మీదనే కాదు, కుటుంబంలో కూడా అతని హింసాధోరణీ హింసాప్రవృత్తీ హింసాకాండా పెరిగిపోయింది.

అతను పెట్టే బాధల్నీ, హింసనీ, అతని శాడిస్టు స్వభావాన్నీ భరించలేక వనజ పిల్లల్ని తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది.

పుట్టింటికి చేరిన వనజకి తల్లిదండ్రుల మీద ఆధారపడటం ఇష్టం లేకపోయింది.

ఒక ప్రయివేటు పాఠశాలలో టీచర్ ఉద్యోగంలో చేరింది. వాళ్ళు ఇచ్చే కొద్దీ జీతంలోనే జీవనం సాగిస్తూ, పిల్లల్ని చదివించుకుంటోంది.

భర్తతో విడాకుల కోసం కోర్టుకి అప్లయ్ చేసింది.

★ ★ ★

ఎం.ఎల్.ఏ. గుర్నాధం, సీఐ కిషోర్ ఇందిరానగర్ భూముల్ని ఆక్రమించుకోవడానికి, చేస్తున్న ప్రయత్నాల్ని ఎప్పటికప్పుడు పత్రికలు వెలుగులోనికి తీసుకువస్తూ, వాళ్లని విమర్శిస్తున్నాయి. ఈ వార్తల్ని ప్రచురించడంలో హెచ్చరిక పత్రిక ముందు పీఠంలో వుంది.

ఆ భూమిని ఆక్రమించుకోవడానికి వీళ్లు చేసే ప్రతి ప్రయత్నాన్నీ, ప్రతి చిన్నపనిని కూడా పత్రికలు ఉపేక్షించకుండా ఎండగడుతున్నాయి.

రోజురోజుకీ ఆలస్యం అయిపోతున్నదని కిషోరూ, గుర్నాధం తొందరపడుతున్నారు.

ఇలా చిన్న చిన్న ప్రయత్నాలు అయితే లాభంలేదనీ, ఆ గుడిసెవాసులు రాటుదేలారనీ, ఇందిరానగర్ భూమిని ఆక్రమించుకోవడానికి ఏకంగా అతిపెద్ద ప్రణాళికే వాళ్లు ఇద్దరూ కలసి రూపొందించారు.

ఇద్దరికీ ఎదురులేదు. ప్రభుత్వంలో మంచి పలుకుబడి వుంది. ఎవరికీ భయపడాల్సిన అవసరం లేదు. తమని ఎవరూ ఏం చేయలేరు. ఎలా జరగాల్సి వుంటే అలా జరుగుతుంది, అదీ తరువాత అనే ధైర్యంతో, ధీమాతో తెగించి ఇద్దరూ భారీ వ్యూహం పన్నారు. ఆ వ్యూహాన్ని అమలుచేసే సన్నాహాలు కూడా ప్రారంభించారు.

దూరప్రాంతంనించి కాకలు తీరిన 10 మంది రౌడీల్ని పిలిపించారు. ఆ పదిమందీ రౌడీలే కాదు, ప్రొఫెషనల్ కిల్లర్స్ కూడా!

తన అనుచరుల్లో గట్టివాళ్లు అనుకున్న 20 మంది రౌడీల్ని గుర్నాధం సెలక్ట్ చేశాడు.

20 మంది పోలీసుల్ని కూడా కలుపుకుని, మొత్తం 50 మంది ఒక అర్ధరాత్రి సమయంలో ఇందిరానగర్‌మీద దాడిచేయాలి.

నాలుగు గ్రూపులుగా చీలిపోయి, నాలుగు వైపులనించీ ఒకే సమయంలో ముట్టడిచేసి గుడిసెల్ని భస్మీపటలం చేయాలి.

ప్రతిఘటించిన వాళ్లలో నలుగురైదుగుర్ని ఆ మంటల్లో వేసి దగ్ధం చేయాలి.

ఇందిరానగర్ వాసులు భయభ్రాంతులై తెల్లవారేసరికి చెల్లాచెదురైపోవాలి. ప్రాణభీతితో ఇందిరానగర్‌వైపు ఇక రాకుండా వుండాలి. ఆ ప్రాంతం అంటే భయపడిపోయేలా, అటువైపు కన్నెత్తి కూడా చూడకుండా చేయాలి.

తెల్లవారేసరికి ఏమీ వుండకూడదు. కేవలం భూమీ, బూడిదా మాత్రమే మిగిలిపోవాలి.

"ప్రమాదవశాత్తూ ఘోరమైన అగ్నిప్రమాదం జరిగిపోయింది. మంటల్లో చిక్కుకుని నలుగురు మరణించారు'' అని పెద్దఎత్తున ప్రచారం చేయాలి.

ఒకవేళ దాడి జరిగినట్లూ, ఇందిరానగర్‌ని తగలబెట్టినట్లూ ప్రజలకి తెలిసినా, అది ఎవ





రు చేశారో తెలియకూడదు.

నిజానికి ప్రజలకి తెలియకుండా వుండదు. తమ మనుషులు దాడిచేసినట్లు తెలుస్తుంది. అయితే కనీస సాక్ష్యాధారాలు ఏమీ వుండకూడదు.

దాడి చేయడానికి పకడ్బందీగా వ్యూహం రూపొందించి, దాడికి రెండురోజులముందే ముహూర్తం కూడా నిర్ణయించారు.

వేరే ప్రాంతంనించి తీసుకువచ్చిన రౌడీల్ని బాగా మేపుతున్నారు.

ముందుగానే 2 వందల లీటర్ల పెట్రోలు కూడా తీసుకువచ్చి, 20 వ్యానుల్లో భద్రపరిచారు. శక్తివంతమైన బాంబులూ, ఇతర మారణాయుధాలూ అన్నీ సన్నద్ధం చేసుకుని దాడి చేయడానికి సిద్ధంగా వున్నారు.

అంతా సక్రమంగా వుంది, విజయం ఎంతో దూరంలో లేదు, ఆ రాత్రి దాడి చేయాలనుకుంటుండగా ఉదయమే 'హెచ్చరిక' పత్రిక బాంబు పేల్చింది.

పేర్లు ప్రస్తావించకుండా వాళ్లు పన్నిన మొత్తం వ్యూహం కళాధర్ వెల్లడించాడు.

మారణాయుధాలూ, బాంబులూ ఏ ప్రాంతంలో దాచిపెట్టి వుంచారో, ఆ రౌడీలు ఎక్కడ ఆశ్రయం పొంది ఆంబోతుల్లా తింటున్నారో హెచ్చరిక పత్రిక వెల్లడించింది.

జరగబోయే ఘోరమైన హత్యాకాండకూ, బీభత్సకాండకూ భయపడి, గుర్నాధం అనుచరుడు ఒకడు ఇచ్చిన సమాచారం ఆధారంగానే ఎంతో ప్రయాసకులోనై ఆ విషయాల్ని ధృవపరుచుకునే కళాధర్ బాంబు పేల్చాడు.

గుర్నాధం, కిషోర్‌ల గుండెల్లో ఆ బాంబు ప్రకంపనమై పేలింది.

★ ★ ★

పేపర్‌లో రావడమే ఆలస్యం, ఇందిరా నగర్ గుడిసెవాసులకి క్షణంలో విషయం తెలిసింది.

వాళ్ళలో హాహాకారాలూ, ఐక్యత! తక్షణ కర్తవ్యంగా ఆ వాడవాడంతా, అందరూ కదిలారు.

పేపర్లో ప్రస్తావించిన ప్రాంతానికి వచ్చి, మారణాయుధాలూ, బాంబులూ, పెట్రోలూ దాచివుంచారని అనుమానం వచ్చిన రెండు మూడు ఇళ్లను చుట్టముట్టారు. అవి ఎక్కడికీ తరలించకుండా ఆ ఇళ్ల పరిసరాల్లోనే ఆ గుడిసెవాసులు కాపు కాశారు.

కొందరు వెళ్లి ఎస్పీకి విషయం వివరించి, వాళ్లని అరెస్టు చేసి మారణాయుధాల్ని స్వాధీనం చేసుకుని, తమకి రక్షణ కల్పించమ'ని కోరారు.

కొత్తగా ఎస్పీ పదవీబాధ్యతలు స్వీకరించి వారంరోజులే అయింది. ఎస్పీకీ, ఎంఎల్‌ఏ గుర్నాధానికీ ఇంకా సరిగా స్నేహసంబంధాలు' కూడా ఏర్పడలేదు.

విషయం పబ్లిక్ అయిన తరువాత, రిపోర్ట్ వచ్చిన తరువాత కూడా దాడిచేయకుండా వుండటం సాధ్యం కాదు. స్వయంగా 'ఎస్పీ నేతృత్వంలోనే మారణాయుధాలు దాచివుంచిన గృహంమీద దాడి జరిగింది. ప్రేలుడు పదార్థాల నిపుణులూ, పోలీసులూ ఆ దాడిలో పాల్గొన్నారు.

అత్యంత శక్తివంతమైన బాంబులూ, గండ్రగొడ్డళ్లూ, బరిసెలూ పోలీసులు స్వాధీనం చేసుకుని, ఆ ఇంటి యజమానిని అరెస్టు చేశారు.

వేరేచోట ఆశ్రయం పొందిన ఇతర ప్రాంతపు రౌడీలు అందరూ తప్పించుకుపోయారు. అయితే పోలీసులు పట్టణంలో గాలించి వాళ్ళలో ఇద్దరు రౌడీల్ని మాత్రం అరెస్టు చేయగలిగారు.

★ ★ ★

"ఏమయ్యా కిషోరూ... మన ప్లాన్ మొత్తం తలక్రిందులు అయింది. ఏం చేద్దాం?"

"ఏం చేయాలో నాకూ అంతుబట్టకుండా

వుంది సార్!"

"మన ప్లానంతా భగ్నం చేసింది ఆ హెచ్చరిక వాడేనయ్యా!"

"అవును సార్. ఇంక మనం వూరుకుంటే లాభంలేదు. వాడివలన మీకూ, నాకూ అనేక సార్లు చాలా ప్రాబ్లమ్స్ చుట్టుకున్నాయి. వాడ్ని వెంటనే లేపెయ్యడమే చాలా మంచిది సార్!"

"ఆ పని ఏదో త్వరగా చేయరాదూ?"

"యూనిఫారంలో వున్న మేం వాడ్ని లేపాలంటే కష్టం సార్. ఆ పని మీరు చేస్తేనే బాగుంటుంది''

గుర్నాధం ఇంట్లో కూర్చుని ఇద్దరూ పీకల వరకూ తాగి, తూలుతూ మాట్లాడుకుంటు న్నారు.

"వాడ్ని లేపడం పెద్ద కష్టం కాదయ్యా! వేసిరండ్రా అంటే మనవాళ్లు ఐదంటే ఐదు నిముషాల్లో దర్జాగా పనిముగించుకుని వస్తా రు. కానీ, ఇప్పటికే నామీద చాలా మర్డర్ కేసులు వున్నాయి. మళ్ళీ వీడ్ని లేపితే మరొక మర్డర్ కేసు చుట్టుకుంటుంది''

"ఈ కేసులు ఏం చేస్తాయి సార్?"

"ఏం చెయ్యవు, నిజమే. ముందు పేపర్ వాళ్ళతో తంటా! వాళ్ళు ఏకివదిలిపెడతారు. గొడవ చేస్తారు. పబ్లిక్‌లో కూడా జనం నుంచి వ్యతిరేకత వస్తుంది. రేపు మళ్లీ ఓట్ల కోసం మేం జనం దగ్గరకి వెళ్ళక తప్పదా యె. ఆ పని మీ డిపార్ట్‌మెంట్ ద్వారానే జరిగితే బాగుంటుందయ్యా! మీకు లైసెన్స్ వుంది. మాకు లేదాయె!"

"డిపార్ట్‌మెంట్ ద్వారా కూడా అంత సు లభం కాదు సార్!"

"నాకు కథలు చెప్పొద్దు. మీ డిపార్ట్ మెంట్‌కి అసలు మనదేశంలో ఎదురే ముంది? దేశం మొత్తం మీద ఎక్కువ మర్డర్‌లు చేసింది ఎవరు అంటే అది మీ డిపార్ట్‌మెంటే! నిజం చెప్పాలంటే మీ డి పార్ట్‌మెంట్ చేసినన్ని మర్డర్‌లు ఇంక ఎవ రూ చేసి వుండరనుకో! మొన్న అక్కడెక్కడో బస్టాండులో చీకటిపడిన తరువాత ఇద్దరు ఆడవాళ్ళూ, ఒక పిల్లవాడూ, వాళ్లలో ఒకామె కొడుకు అన్నమాట ఈ పిల్లవాడు, బస్‌కోసం ఎదురు చూస్తూ నిలబడి వున్నారంటయ్యా! పెట్రోలింగ్ చేస్తున్న మన పోలీసుల కళ్లలో వీళ్లు పడ్డారు. ఇంకేముంది? వాళ్ళని రమ్మని గొడవ చేశారు. వాళ్లు ఎదురు తిరగడంతో తల్లి ఎదురుగానే ఆ పిల్లవాడ్ని జీప్‌తో తొక్కించి, చంపేసి, హృదయవిదారకంగా ఏడుస్తున్న ఆ తల్లిని రేప్ చేశారటయ్యా!"

"అబ్బ... అది కాదు సార్..."

"మరేమిటీ? పంజాబ్‌లో డిజీపీ ఒక అయ్యేఎస్ ఆఫీసర్ని అవమానపరిస్తే దిక్కూ మొక్కూ వుందీ? పాపం ఆమె కోర్టు చుట్టూ తిరగలేక అల్లాడిపోతోంది''

"అది వేరు సార్..."

"మరి... మర్డర్లు చేయడం... అది కూడా మీ డిపార్ట్‌మెంట్‌కి కొత్త కాదుగదయ్యా! వరంగల్‌లో ఒక పిల్లల డాక్టర్నీ, ఒక అడ్వకే ట్‌నీ యూనిఫారంలోనే వెళ్లి పబ్లిక్‌గానే మటాష్ చేసి రాలేదా? హక్కులూ, గిక్కులూ అని అడగడమే కదా వాళ్లు చేసుకున్న పాపం!"

"వీళ్లు పేపర్‌వాళ్లు సార్. వీళ్ళతో కొంచెం తంటాయే సార్!"

"ఏమీకాదు. విజయవాడలో నడిబొడ్డునే ఎన్‌కౌంటర్ చేసి ఎడిటర్ దశరథ్‌రాంగాడిని సివిల్ దుస్తుల్లో వెళ్ళి మీ పోలీసులు లేపలే దా? వాళ్ళ తాతేనంటకదా, జాతీయ పతాకా న్ని రూపొందించింది. అంతకంటే పెద్ద మొనగాడా ఏమిటి వీడు?"

"వీడ్ని లేపెయ్యాలనే నాకూ చాలాకా లంనించీ వుంది సార్. కానీ, అది మీరయితే నే బాగుంటుందనీ..."

"ఏంకాదయ్యా! మామీద కేసులూ అవీ ఉంటాయి. మీరుకానీ అయితే కనీసం చార్జిషీ





టు కూడా ఉండదు. ఇప్పుడు పేపర్‌వాళ్లు నోటికి వచ్చినట్లు రాస్తున్నారు. వాళ్లకి మరీ అడ్డూ అదుపూ లేకుండా ఉంది. ఒకణ్ణి కానీ వేశారంటే ఇక పేపర్‌వాళ్లు కూడా భయభక్తులతోటి, కొద్దిగా ఒళ్లు దగ్గర పెట్టుకుని బుద్ధిగా రాస్తారు''

"నిజమేసార్... వీణ్ణి వేస్తేనే మిగతా పేపర్‌వాళ్లకి కూడా ఇన్‌డైరెక్టుగా వార్నింగ్ ఇచ్చినట్లు ఉంటుంది. ఆలోచిద్దాం సార్. నాకు కూడా వాణ్ణి గట్టిగా వేసెయ్యాలనే ఉంది''

"నువ్వు ఏమీ సందేహించవద్దు. గవర్నమెంట్‌నుంచి నీకు ఏం ప్రాబ్లమ్స్ రాకుండా నేను చూసుకుంటాను. నీకు ప్రోత్సాహకాలు ఇప్పించే ఏర్పాటు చేస్తాను. ఇంకా పెద్ద ప్రమోషన్‌కోసం కూడా ట్రైచేద్దాం"

"వీడిమీద మీకంటే నాకు ఎక్కువ కోపంగా ఉంది సార్! టాడాకింద బొక్కలో తోసి రెండేళ్లపాటు చింతపులుసు తాగిద్దామని నాకు బాగా ఇంట్రెస్టింగ్‌గా ఉంది. అందుకు పై మొగుళ్లు ఒప్పుకోలేదు. ఇప్పటికే మన రాష్ట్రంలో ఇలాగే వార్తలు రాసుకునే 9 మంది విలేకరుల్ని టాడా కింద జైల్లో వేశారంట సార్!"

"అయితే వీడు పదవవాడు అవుతాడు. అంతేగదా?"

"పై మొగుళ్లు పడనివ్వలేదు. లేకపోతే ఎప్పుడో టాడాకింద కటకటాలు లెక్కపెట్రా అని నెట్టేవాణ్ణి''

"వీడివలన నేను చాలా నష్టపోయానయ్యా!"

"నేనుమాత్రం సార్? వీడు నన్ను వెంటాడాడు సార్. నన్ను బాగా రిస్క్ పెట్టాడు. బద్మాష్‌గాడు, నామీద వార్తలు రాస్తాడా? నా కాలిగోటి విలువ చేయడు, నేనంటే లెక్కలేకుండా వ్యవహరిస్తాడా? వాణ్ణి వేసెయ్యకపోతే ఇంక నేనెందుకు సార్?"

కిషోర్‌కి నిషా బాగా ఎక్కింది.

"తొందరగా పని ముగిస్తే మంచిది''

"ఎంత సార్? వారం రోజుల్లో మటాష్ చెయ్యకపోతే ఇంక నేనెందుకు సార్? ఖాకీ యూనిఫాం అంటే ఎం.ఎల్.ఏ.లుసైతం ఒక్కోసారి గడగడలాడిపోతారు. అలాంటిది వీడు... ఆఫ్టాల్ ఒక పేపర్‌వాడు తలబిరుసుగా ఉంటాడా? ఆ తలని తెగనరక్కపోతే ఇంకా ఈ యూనిఫారం ఎందుకు సార్? ఈ ఖాకీ యూనిఫారం తీసి అవతల పారేసి, కాషాయి గుడ్డలు వేసుకుని ఏ సన్యాసుల్లోనో కలిసిపోవటం మంచిది''

నిషా బాగా ఎక్కిన కిషోర్ పత్రికలవాళ్లనీ, జర్నలిస్టుల్నీ నోటికి వచ్చినట్లు తిట్టాడు. ఒకవైపు తిడుతూనేవున్నా, మరోవైపు కళాధర్‌ని ఎలా హత్య చేయాలా అని అతని మనసు ఆలోచిస్తూనేవుంది.

★ ★ ★

కళాధర్‌కోసం అతని స్నేహితుడు అశోక్ కుమార్ వచ్చాడు. ఇద్దరూ చిన్నప్పట్నించీ డిగ్రీవరకూ స్నేహితులు.

అశోక్‌కుమార్ ఎం.ఎ. ఫస్ట్‌క్లాసులో పాసయ్యాడు. ఉద్యోగం లేదు. సాహిత్యం, రాజకీయాలూలాంటి విషయాలు బొత్తిగా తెలీవు.

చలాకీగా, హుషారుగా ఉంటాడు. మంచి స్నేహప్రియుడు. హాస్యంగా చతురోక్తులతో మాట్లాడుతుంటాడు.

కళాధర్ మంచి స్నేహితుడు అయినా అశోక్‌కి కనీసం పేపర్ కూడా చూసే అలవాటు లేదు.

ఆరోజు కళాధర్‌కి పని తక్కువగా ఉంది.

ఇద్దరూ కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. చదువుకునే రోజుల్లో జరిగిన సంఘటనల్ని చెప్పుకుని సరదాగా నవ్వుకున్నారు.

వాళ్లతో చదువుకున్న మరో ఫ్రెండ్ కూడా టౌన్‌లోనే ఉన్నాడు. వాళ్ల ఇంటికి వెళ్లివద్దామనుకున్నారు.

రాత్రి 9 గంటల సమయంలో ఇద్దరూ

స్కూటర్‌మీద వాళ్ల ఇంటికి బయలుదేరారు.

కొంతదూరంలో మాటువేసి ఉన్న పోలీస్ వ్యాను వాళ్లని అనుసరించింది.

నిర్మానుష్యంగా, చీకటిగా ఉన్న ప్రాంతానికి వెళ్లిన తరువాత స్కూటర్‌ని వ్యాను ఓవర్‌టేక్ చేసి, ఇక సైడు ఇవ్వకుండా ఆగింది.

కళాధర్ స్కూటర్‌ని ఆపాడు...

కళ్లు మూసి తెరిచేటంతలోనే, మెరుపు వేగంతో స్కూటర్‌తోపాటు వాళ్ల ఇద్దర్నీ వ్యానులో బలవంతంగా వేసుకుని పోలీసులు తీసుకుపోయారు.

వ్యాను పట్టణం చివరలో ఉన్న గుట్టల దగ్గరికి చేరింది.

అక్కడ కళాధర్‌ని కిషోర్ క్రూరంగా హింసించి వికృతానందం పొందాడు.

కొంతసేపు తరువాత ఆ నిరాయుధులు ఇద్దర్నీ ఖాకీలు తుపాకి గుండ్లకి బలిచేశారు...

మరుసటిరోజు పోలీసులు ప్రకటన విడుదలచేశారు.

... పట్టణ శివార్లలో ఉన్న గుట్టలవద్ద నక్సలైట్లు సమావేశం అవుతున్నట్లు సమాచారం అందిన పోలీసులు ఆ ప్రదేశానికి వెళ్లారు. పోలీసుల్ని గమనించిన నక్సలైట్లు మొదట కాల్పులు చేయడం మొదలుపెట్టారు. ఆత్మరక్షణకోసం పోలీసులు ఎన్‌కౌంటర్ చేయగా, ఇద్దరు నక్సలైట్లు మృతిచెందారు. మృతి చెందిన ఇరువురూ జర్నలిస్ట్ ముసుగులో ఉన్న నక్సలైటు కళాధర్, మరియొక నక్సలైటు అశోక్‌కుమార్‌గా పోలీసులు గుర్తించారు. మృతిచెందిన నక్సలైట్లవద్ద కొంత విప్లవ సాహిత్యాన్ని పోలీసులు స్వాధీనం చేసుకున్నారు...'

పోలీసుల ప్రకటనని చదివిన ప్రజలు విస్మయం చెందారు.







# చతుర కతలు

## సరిగంగా స్నానం

స్లీపర్ కోచ్‌లోకెక్కి 43వ నెంబరు బెర్తు కోసం వెతుకుతున్నాను.

"మీరేనా మోహన్‌కుమార్'? నవ్వుతూ పలుకరించిన వ్యక్తిని చూసి తెల్లబోయాను.

"ఔను..." అన్నాను సందిగ్ధంగా.

"నేను కిశోర్‌కుమార్‌ని. మీకు రిజర్వేషన్ చేసి పెట్టిన ట్రావెల్ ఏజంటే నాకూ రిజర్వు చేసి పెట్టాడు. నా అసలు పేరు రామారావనుకోండి'' అన్నాడతను నవ్వుతూ.

నేను హాయిగా ఊపిరి పీల్చుకున్నాను. "నా పేరూ మోహన్‌కుమార్ కాదు లెండి'' అంటూ లోకాభిరామాయణంలో పడ్డాం.

రామారావు మాంచి మాటకారి. స్నేహశీలి, నిముషాల్లో ఆప్తుడై పోయాడు. గంటలు దొర్లిపోయాయి.

"ఇక తొంగుందామా!" అన్నాడు నా ప్రక్కనున్న ముసలాయన. అప్పటికిగానీ ఆయన సంగతే మాకు గుర్తురాలేదు. ఆయనకో అరవై ఏళ్ళుంటాయి. బట్టతల. ముతక ఫంచె. ఇస్త్రీ లేని చొక్కా. తలపాగా. చూడగానే పల్లెటూరి ఆసామీ అని ఇట్టే తెలిసిపోతోంది. ఆయన క్కూడా మా ట్రావెల్ ఏజంటే బెర్తు రిజర్వుచేసి పెట్టాడు.

సరేనంటూ ముసలాయనకి కింద బెర్తు ఇచ్చేసి పై బెర్తు పైకి నేనెక్కేసాను. మధ్య బెర్తుమీద రామారావు పవళించాడు. నిద్రలోకి జారుకున్నాను.



ఓ అర్ధరాత్రివేళ ఎవరో కుదుపుతూండేసరికి లేచి కూర్చున్నా. అప్పటికే మా 'బే అంతా హడావుడిగా వుంది. లైట్లు పుచ్చపువ్వులా వెలుగుతున్నాయి.

"టికెట్టు చెకింగ్ స్క్వాడు వాళ్ళొచ్చారండీ'' అంటూ రామారావు నాతో చెప్పాడు.

నాకు మత్తు వదిలిపోయింది.

"మోహన్‌కుమార్ ఎవరూ?"

శూన్యంలోకి చూస్తున్న నా డొక్కలో పొడిచి "ఈయనేనండీ'' అన్నాడు రామారావు. నేను అవునన్నట్లుగా తలూపాను.

"కిషోర్‌కుమార్'

"నేనే..."

"మరి హేమంత్‌కుమార్?"

"ఈయనే'' అంటూ మావైపు అయోమయంగా చూస్తున్న ముసలాయన్ను చూపాడు రామారావు.

స్క్వాడు మనిషి ముఖంలో విజయగర్వం తొంగిచూసింది.

"మీ పేరేమిటండీ తాతగారు!"

ముసలాయన తడబడ్డాడు.

"ఏమం... ఏమంతకుమారు''

"ఆ పేరు కాదండీ! మీ అస్సలు పేరు చెప్పండి''

"గొర్రెల అప్పల్నాయుడు''

"కొంప మునిగింది'' నా గొంతుకతో రామారావు గొంతూ కలిసింది.

స్క్వాడు వాళ్ళు మా ముగ్గుర్నీ టికెట్టు లేని ప్రయాణీకులుగా భావించి (వేరొకరి టికెట్టు చెల్లదు కాబట్టి) జరిమానా ఫారాలు నింపసాగారు.

- సుబ్బశ్రీ

---

## పేకుల హీరో

"మూర్తిగారు కబురుచేశారండి. సినిమాలో మీకేదో వేషం యిస్తారట" అంది మా ఆవిడ ఆఫీసునుంచి ఇంటికి వెళ్లగానే.

సినిమా ఛాన్సు తగులుతుందనేసరికి ఉప్పొంగిపోయాను. నాకు సినిమాల్లో వేషం వెయ్యాలనే పిచ్చి ఎప్పటినుంచో ఉంది.

మూర్తి మా ఆవిడవైపునుంచి దగ్గర బంధువే. నాలుగైదు సినిమాలకు డైరెక్షన్ చేశాడు. ఓ సినిమా సూపర్‌హిట్ అయ్యింది. మిగిలిన సినిమాలు ఓ మాదిరిగా ఆడాయి.

కాఫీ కూడా తాగకుండా స్కూటరు ఎక్కి మూర్తి ఇంటికి వెళ్లాను. ఫలానా స్టూడియోలో ఫలానా ఫ్లోర్‌లో ఉన్నాడని చెప్పారు ఇంటిదగ్గరవాళ్లు. చచ్చీచెడీ వాహనాల పొగ పీలుస్తూ, ట్రాఫిక్ జామ్‌లు అధిగమిస్తూ స్టూడియోకు చేరుకున్నాను.

"రావోయ్...రా... నీకోసమే ఎదురు చూస్తున్నాను... సినిమాల్లో వేషం వెయ్యాలని ఉబలాటపడుతున్నావటగా'' అన్నాడు మూర్తి నన్ను చూడగానే దగ్గరకు పిల్చి భుజం తడుతూ.

ఆ క్షణంలో అతనో శిబి చక్రవర్తిలా కన్పించేడు. పావురాయి ప్రాణాలు కాపాడటానికి తన తొడమాంసం కోసి డేగకు యిచ్చేయడానికి సిద్ధపడ్డ మహా పురుషునిలా కన్పించేడు.

"హీరోగారి పక్కనే నీ వేషం" అన్నాడు మూర్తి ఈజీచైర్‌లో కూర్చుని హీరోయిన్‌తో విలాసంగా మాట్లాడుతున్న హీరోగారిని వేలితో చూపిస్తూ.

"అంత పెద్ద హీరోగారి పక్కన వేషమా? నిజంగా ఇది వాస్తవమేనా లేక కలా?" అనుకుంటూ చేయి గిల్లుకున్నాను.

...నిజమే!

"రండి... మేకప్ వేసుకుందురుగాని''





అంటూ లాక్కెళ్లాడు అసిస్టెంటు డైరెక్టరు.

"నేను ఏ పాత్ర వేయబోతున్నాను?" ఉత్సుకతతోఅడిగాను అసిస్టెంటు డైరెక్టర్ని

"అన్ని పాత్రలను డీల్ చేసే రోల్" అన్నాడతను నవ్వుతూ.

"ఏమిటది?"

"వంటవాడు"

నిరుత్సాహం గుండెల్లో గూడు కట్టుకోసాగింది. ఛీ... ఛీ... పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షల్లో ప్యాసయ్యి సచివాలయంలో



ఉద్యోగం చేస్తూ వంటవాడిగా వెయ్యడమా? మూర్తి ఇంటర్ పదిసార్లు తప్పి పెద్ద డైరెక్టరవ్వడం, తను యమ్.ఎ. ప్యాసయ్యి వంటవాడుగా సినిమాల్లో నటించడమా? హా... హత విధీ...

"మీరేం నిరుత్సాహపడకండి... చిన్నపాత్రలో రాణింపు తెచ్చుకుని రేపు మీరే పెద్ద హీరో కావొచ్చు" అన్నాడు అసిస్టెంటు డైరెక్టరు (చిన్న, చిన్న ఆర్టిస్టులతో అతనలాగే అంటూవుంటాడని ఆ తర్వాత తెలిసింది నాకు)

అతని మాటలతో కొంచెం ధైర్యం వచ్చింది.

సినిమా షూటింగ్‌కు సిద్ధమయ్యాను.

హీరోగారు హీరోయిన్‌తో వాగ్వివాదం చేస్తుంటాడు. వాళ్లిద్దరి వెనుక నిలబడి ఆసక్తిగా వాళ్లు మాట్లాడుకునేది వింటూ ఉంటాను... అదీ సీన్...

ఆ సన్నివేశం చిత్రీకరణ మొదలయింది.

హీరో హీరోయిన్లు పోట్లాట మొదలయింది డైనింగ్ టేబుల్ దగ్గర.

హీరో కొండవీటి చేంతాడంత డైలాగ్ చెప్పి తన ముందున్న ప్లేటును నెట్టివేస్తాడు.

"కట్" అన్నాడు డైరెక్టర్. వో నిముషం ఆగి 'రీటేక్' అన్నాడు పెద్దగా.

మళ్లీ అదే సన్నివేశం.

"కట్" అన్నాడు డైరెక్టర్.

నాదగ్గరకొచ్చి కోపంగా చూశాడు.

ఎన్ని టేకులు తింటావయ్యా? కొత్తవాళ్లను పెట్టుకుంటే యింతే! హీరో, హీరోయిన్ మాట్లాడుకుంటుంటే ఎటో దిక్కులు చూస్తావేమిటయ్యా?" అని డైరెక్టరు అరిచాడు.

ఆయన చెప్పినట్లే చేశాను. 'రీటేక్' అన్నాడు డైరెక్టరు.

ఆ సీన్ పది టేకులయ్యాక "ఓకే..." అన్నాడు డైరెక్టరు.

"బుద్ధి తక్కువై సినిమాల్లో వేషం కావాలని నిన్ను అడిగాను'' అన్నాను మూర్తితో పక్కన ఎవరూ లేకుండా చూసి.

"ఏం చెయ్యమంటావయ్యా! పేరుకు పెద్ద హీరోయేగాని సరిగ్గా యాక్ట్ చెయ్యడు ఆ హీరో! ఆయనకు చెప్పి 'మళ్లీ టేక్ తీద్దాం సార్' అంటే ఆయనకు కోపం... అందుకని నిన్ను కోప్పడుతున్నట్లు నటించి నాకు కావాల్సిన ఎఫెక్ట్ హీరోగారి దగ్గరనుండి రాబట్టుకున్నాను'' అన్నాడు మూర్తి.

-అలపర్తి రామకృష్ణ

## ఫొటో

"మీ జేబులోని ఈ రంకులాడి ఫొటో ఎవరిదో చెబుతారా లేదా!" నిలదీసింది శృతి భర్తవంక మహాకోపంగా చూస్తూ.

"ఛ... ఛ... నోరుజారకు అదెవరిదంటే..."

"నాకు తెలుసులెండీ... మీరేదో కథ చెప్పబోతున్నారని..."

"శృతీ... అసలా ఫొటో..."

"మీరేం చెప్పనక్కర్లేదు... ఆ చెప్పబోయేది మాంచి కట్టుకథని నాకు తెలుసు. ఇంతకీ మీరీ అమ్మాయితో ప్రేమాయణం ఎంతకాలం నుండి సాగిస్తున్నారు'' తీవ్రంగా అడిగింది శృతి!

"శృతీ! అసలు విషయం ఏమిటంటే...."

"మీరేం సంజాయిషీ యివ్వనవసరంలేదు. మీకు నేనేం లోపం చేసానండీ... మీరిలా పరాయి ఆడవాళ్లతో గ్రంధం సాగించడానికి'' ఆరున్నొక్కరాగం అందుకుంది శృతి.

"ఎందుకలా ఏడుస్తావు? నేను పరాయిదానితో ఏమీ... కథ నడపటం లేదంటే నమ్మవే..."

"అంటే మీకదే అసలైనదీ నేనే పరాయిదాన్ని అన్నమాట" ముక్కు చీదింది శృతి.

"చెప్పేది వినిపించుకోవేం..." తనూ కోపగించుకుని విసుగ్గా గదిలోకి వెళ్లిపోయాడు రంగారావు.

ఆ మర్నాడు భర్త ఆఫీసునుండి ఆలస్యంగా రావటంతో అలా రావటం మామూలే అయినా తిరిగి రాద్ధాంతం మొదలెట్టింది శృతి.

"అసలా అమ్మాయి ఎవరో తెలుసుకోకుండా'' అనబోయాడు రంగారావు.

"నాకు తెలీదనే గదా మీరిలా చాటు మాటు వ్యవహారం సాగిస్తున్నారూ'' శృతి పెంచింది శృతి.

"నీకెలా చెప్పాలో నాకు బోధపడ్డంలేదు'' అనేసి నెత్తి బాదుకుంటూ వెళ్లిపోయాడు రంగారావు.

సరిగ్గా అదే సమయంలో శృతి తండ్రి మధుసూదనం దిగాడు "ఏమ్, అమ్మాయ్ కులాసా...?" అంటూ!

భోరుమంటూ కాసిన్ని కన్నీళ్లు కార్చి ఆ ఫొటోలోని పిల్లతో భర్త చాటుమాటు వ్యవహారం సాగిస్తున్న సంగతి చెప్పింది శృతి.

"అల్లుడు గురించి నాకు బాగా తెలుసు. అటువంటి వాడుకాదే'' ఆశ్చర్యంగా అనుమానంగా అన్నాడు మధుసూదనం.

"అంటే మీరూ అతని పక్షమేనన్నమాట" మరోసారి ముక్కు చీదింది శృతి.

ఆ సాయంత్రం రంగారావు శృతి అంతకు ముందతని జేబులో చూసిన రంకులాడి




ఫొటోకు పెద్ద ఎన్లార్జిమెంట్‌తో ఖరీదైన ఫ్రేంతో సహా తెచ్చాడు. దాన్ని ఎదురుగాను న్న గోడకు వేలాడదీసే ప్రయత్నంలో ఉండ గా...

"అయితే మీ ప్రియురాలి ఫొటోని ఇంట్లో కూడా అలంకరిస్తున్నారన్న మాట. ఉండండి మీ సంగతి మా నాన్నతో చెబుతా'' అని

"ఎంత బరితెగించారూ'' అంటూ పెర ట్లోంచి వస్తున్న తండ్రి వద్దకు ఒక్క అంగలో దూకి ఆ ఫొటోకేసి చూపించింది శృతి.

"బాగుందే అమ్మాయ్! చాలా అందంగా



వుంది సుమీ'' అన్నాడు పొంగిపోయినట్లు మధుసూదనం.

"మీరు కూడా నన్నేడిపిస్తారేంటి నా న్నా...! అయినా నా బతుకే ఓ వేళాకోళం అయిపోయిందిలెండి'' శృతి ఏడుపు లంకించుకుంది.

"అల్లుడూ! అమ్మాయిని ఇలా ఏడి పించటం ఏం బాగోలేదుగానీ ఆ చిక్కుముడి విప్పేయ్!" అన్నాడు శృతిని ఓదారుస్తూ మధుసూదనం.

"మరేం లేదు శృతీ! అప్పట్లో నీ పెళ్లిచూ పుల కోసం మీ నాన్న తీయించిన పాత ఫొటో బాగుందని ఆ ఫొటో స్టూడియోవాడు షో కేసులో పెడితే మీ ఊరొచ్చినపుడు చూశాం! దాన్ని పెద్దది చేయించమని స్టూడియోకిచ్చి చిన్నది జేబులో పెట్టుకు తిరుగుతుంటే అదే నీకళ్లబడింది. ఇంకేం... అనుమానపడ్డావు'' చెప్పాడు రంగారావు.

"పదిహేనేళ్ల క్రితం నీ పెళ్లిచూపులప్పుడు అవసరం వచ్చి హడావుడిగా తీయించిందేనే అది. అందులో సన్నగా, నాజూగ్గా, చాలా అందంగా వున్నావు సుమీ! అసలది చూసేగా నేను ఓకే అన్నది. అది పెద్దది చేయిస్తే బాగుంటుందనుకున్నాను. ఇప్పుడు డబుల్ పన్నాలాగ తయారైన నువ్వు నీ ఫొటోనే పోల్చుకోలేక అల్లరి చేశావు'' నవ్వి అన్నాడు రంగారావు.

"మరి మీరా సంగతి నాతో చెప్పచ్చుగా'' గోముగా అంది శృతి.

"ఏకంగా ఎన్లార్జిమెంట్‌కు ఫ్రేం వేయించు కొచ్చి నిన్ను సర్‌ప్రైజ్ చేద్దామనుకుని ఉంటా డులే' నవ్వేశాడు తండ్రి.

-కె. కె. రఘునందన

# ఏరిన ముత్యాలు

☆ తన చెవులను తాను చూడలేనట్లుగానే మూర్ఖుడు తన తప్పులను తాను తెలుసుకోలేడు.

-థాకరే

☆ మనిషి ఎప్పుడూ తనకున్న సంపదతో తృప్తిపడాలి. తనకున్న విజ్ఞానంతో తృప్తిపడకూడదు.

-మెంకింటోష్

☆ మనిషి ప్రవర్తనే అద్దం లాంటింది. ఆ అద్దంలో ప్రతివాడి నిజరూపం ప్రతిబింబించి తీరుతుంది.

-గెధే

☆ రక్తపుటేరులు పారించే దానికంటే ఒక కన్నీటిబొట్టు తుడవటంలోనే గొప్పదనముంది.

-బైరన్

☆ జీవితంలో మనం ప్రధానంగా చేయవలసింది, ఎక్కడో చీకటిలో ఉన్నదాన్ని అన్వేషించడం కాదు. చేతిలో స్పష్టంగా కనిపించే దానిని ఉపయోగించడం.

-కార్లయిల్

☆ సాహసం చేసేవాడి వెనుకే అదృష్టం నడుస్తూ వుంటుంది. అందుకే ధైర్యే సాహసే లక్ష్మి అన్నారు పెద్దలు.

-వర్జిన్

☆ సంకల్పబలం ఉన్నవాడికి ఈ ప్రపంచంలో అసంభవమనేది లేదు.

-ఎమర్సన్

☆ అధికారానికి కూడా హద్దులున్నాయి. ఇది గుర్తించకపోవడంవల్లనే గొప్పగొప్ప సామ్రాజ్యాలు నాశనమైనాయి.

-బెర్ట్రండ్‌రసెల్

☆ కోపంతో చెలరేగే వాళ్లు కష్టాల్లో మునుగుతారు.

-విల్‌రోజెర్స్

☆ దోషాలు వెదికేవారికి స్వర్గంలోనూ దోషాలు కనిపిస్తాయి.

-థోరో

☆ లోకంలో మోసగాళ్లకంటే మూర్ఖులే ఎక్కువ. అందువల్లే మోసగాళ్ల మనుగడ సునాయాసంగా సాగిపోతున్నది.

-శ్యామూల్ బట్లర్

☆ తమ స్వార్థ ప్రయోజనాల కోసం కాక ఏదో లక్ష్యం మీద మనసు నిల్పి జీవించేవారే సుఖపడతారు.

-జాన్‌స్టూవర్ట్‌మిల్

☆ అప్పులపాలు కావటం మనిషికిగల దుర్గుణాలలో మొట్టమొదటిది. అబద్ధాలాడటం రెండవది.

-లియొనార్డో డావిన్సీ

సేకరణ: **డి.విద్య**

# పసిడి పంజరంపై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన ఘంటికోట బ్రహ్మాజీరావు రచన 'పసిడి పంజరం'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## ఎవరి కోసం...?

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

ఆధునికకాలంలో నానాటికి దిగజారుతున్న సామాజిక విలువలను సంస్కరించి, నేటి తరం స్త్రీని వెన్నుతట్టి అభ్యుదయ పథంవైపు నడిపే నవలలు కావాలి. 'పసిడి పంజరం' నవల ఫక్తు అందుకు వ్యతిరేకం.

ఊరికి నీతి చెప్పాల్సిన రాజావారు మరి పెద్దల మూఢనమ్మకాలికి, వారు అమృతవల్లి యెడల చూపిన న్యాయరాహిత్యానికి పెదవి విప్పరెందుకో!

అంతఃపురంలో అమృతవల్లి సంగీత, సాహిత్యాల ఆధ్వర్యంలో పొద్దుపుచ్చుతుంది. రాణీవారు మరణించినప్పుడు తన నృత్య, గాన, సాహితీ నిపుణతతో వారిని సేదతీరుస్తుంది. ఇది స్థూలంగా ఆమె జీవితం!

తరతరాలుగా పురుషాధిక్యానికి బలైపోతున్న అమృతవల్లులెందరో ఈ ప్రపంచంలో? అమృతవల్లి తన తమ్ముడిని కూడా చూడలేదు. పరపురుషులందరితో ఆమె తెరవెనుక నుండే మాట్లాడాలి. రాజావారు తప్ప ఆమెకందరూ పరపురుషులే!

అమృతవల్లిని రాజావారు తమ ఆస్థిగా పరిగణించడం, ఆమెను చీకట్లో వుంచడం (అంటే తెరవెనుక) అసలు సిసలు ఫ్యూడల్ ఆలోచనలకు ప్రతిరూపం.

తనదనుకున్న అమూల్యరత్నం (అమృతవల్లి) ఎవరైనా అపహరించుకుపోతారని రాజావారు భయపడతారు. అమృతవల్లి రాజావారు పోయిన పదిహేను సంవత్సరాల తరువాత కూడా వారి ఆజ్ఞను జవదాటదు?! ఇది తరతరాల బానిసత్వ ప్రభావం.

ఆడదంటే షోకేసులో బొమ్మా?! ఎందుకిలాంటి నవలలు? ఇవి స్త్రీ స్వేచ్ఛను అణచివేసే, మొదలంటా నరికివేసే గండ్రగొడ్డళ్లు. 'బానిసత్వం, ఒకరి ఆనందంకోసం తను బ్రతకడం' తన జీవిత పరమార్థాలని స్త్రీ ఎందుకనుకోవాలి? ఆమెకు వ్యక్తిత్వం లేదా? ఇలాంటి చవకబారు భావాలను ఇంజెక్ట్‌చేసే రచనలు స్త్రీలకు అవసరంలేదు.

ఇరవైనాలుగు గంటలూ దుఃఖించే స్త్రీలను చూపిస్తూ వాళ్ళ గతి ఇంతే అని, అందులోనే వాళ్లు ఆనందం అనుభవిస్తారని, అలాగుంటేనే స్త్రీ జన్మకు సార్థకత అని చూపించే కథలు, నవలలెందుకు?

యవ్వనం అడవిగాచిన వెన్నెలై, జీవితం వ్యర్థమై అమృతవల్లి ఎందుకోసం, ఎవరి కోసం బ్రతికింది? రాజావారి ఆనందం కోసమా? తరువాత వారి గొప్పతనాన్ని గానం చేయడం కోసమా?

**-రవితేజ**
హైదరాబాద్.

# కాలంతీరిన సాంప్రదాయం

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

సమస్త సంపదలూ మానవశ్రమ ఫలితమే. ఆ శ్రమలో ఎంతమాత్రం భాగస్వామ్యం లేకుండా కోట్లాది రూపాయలను మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుచేసిన రాచరిక వ్యవస్థనూ, వారి ఆభరణాలనూ, వస్త్రధారణనూ, అన్న పానాదుల విషయాలనూ బ్రహ్మాజీరావుగారు చాలా గొప్పగా చెప్పి అవన్నీ చాలా ఆదర్శ నీయమైనవనే అభిప్రాయం కలిగించే ప్రయత్నం చేశారు.

అమృతవల్లి మేనత్త ఈర్ష్యాసూయలతో తనను కులట అనీ, సిగ్గూ లజ్జా లేదనీ ఆభరణభూషితురాలవై తూగుటుయ్యాలలో రాజు రాకకోసం ఎదురుచూసినావని నిందవేస్తే దాన్ని అమృతవల్లి ఎంతమాత్రం ఖండించకుండా మేనత్త చెప్పింది నిజమేనని ముఖం నేలకు తిప్పిందనడం చాలా అసహజంగా ఉంది. ఏ స్త్రీ అయినా తన శీలాన్ని శంకించేమాటను సహించదు. అందునా అమృతవల్లిలాంటి తెలివైన పదహారేళ్ల పడచు ఆ నిందా వాక్యాలకి స్పందించకపోవడం చాలా అసహజమైన విషయం.

తండ్రి నారాయణరాజు తన పుత్రిక అన్య పురుషునిమీద మనసు నిలిపిందనీ, ఆ సంగతి రుజువైందనీ, అందుచేత వివాహం రద్దుచేస్తున్నామని వియ్యంకులకు ఉత్తరం రాస్తాడు. 16 సం॥నుండి తమదైన పెంపకంలో ఉండి, తమ అనుమతిమేరకే రాణిగారి దర్శనానికి మొట్టమొదటిసారిగా పట్టపగలే వెళ్లి తిరిగివస్తే, ఈర్ష్యాసూయాపరురాలైన తన చెల్లెలు రాజుగారితో సంబంధం అంటగడితే తన కూతురు శీలాన్ని తండ్రి అనేవాడు శంకించడం చాలా అసహజంగా ఉంది.

చంద్రశేఖరంగారు చిట్టిరాజుతో మాట్లాడుతూ దాసీజనం ఉన్నారు, వాళ్ళకి డబ్బిచ్చి సంగతి తెల్సుకోవచ్చు, కాని వాళ్లు లేనిపోనివి చెప్పి సత్యాన్ని కప్పిపుచ్చుతారని అంటాడు. అంటే పేదలైన దాసదాసీలు డబ్బుకు సులభంగా అమ్ముడుపోతారనీ తప్పుడుమాటలు చెబుతారనీ అనటమేగదా. ఇదే సందర్భంలో క్రిమినల్ లాయర్ సోమసుందరంగారిని కల్సినప్పుడు నెలకు లక్షలు ఆర్జించే ఆ మహానుభావుడు అత్యంతాధునికమైన చాలా పెద్ద భవనం కలిగియుండి చాలా సాదాసీదాగా ఉన్నాడని కథకుడు వ్యాఖ్యానిస్తాడు. డబ్బున్నవాళ్లు మహానుభావులు, పేదలంతా తప్పుడువాళ్లనేవిధంగా కథకుడు సూత్రీకరించడం చాలా అన్యాయమైన విషయం.

సంస్థానాధీశులు, తమకవసరమైన ఉద్యోగులూ శిష్టజనాన్ని తయారు చేసుకోవడానికి విశ్వవిద్యాలయాలనూ, కళాశాలలను స్థాపించేవారు. అందుకు విద్యాభిమానులనీ, తమ భోగవిలాసాలకొరకు కళలను, సాహిత్యాన్ని వినియోగించుకునేవారు. దానికి ముద్దుగా కళాపోషకులనీ, సాహిత్యాభిమానులనీ బిరుదులు తగిలించుకునేవారు. సిరిపురం రాజావారు అలాంటివారే. కాని బ్రహ్మాజీగారు రాజా పాత్రను గొప్పగా చిత్రించి రాచరిక వ్యవస్థపై మక్కువ చాటుకున్నారు. అమృతవల్లి పాత్రను అన్యాయంగా చివరివరకు బంధించి చివరిగా నాట్యకళాశాల స్థాపన అన్న విషయం ఒక అభ్యుదయమైందిగా భావించి కథ ముగించారు. సంప్రదాయాలు జీవితాలనెలా బలిగొన్నాయోనన్న విషయాలను బాగానే చిత్రీకరించినా ముగింపు పేలవంగా ఉంది.

-వి. పెంటయ్య
కరీంనగర్.

# రంగుల వల

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

రాజులు, వారి రాజ్యాలు అశాశ్వతం అనీ




వారి సత్కార్యాలే పదికాలాలపాటు చరిత్రలో పదిలంగా వుంటాయనేది చారిత్రక సత్యం. పదిమందితో కలిసి రాజాంతఃపురానికి వెళ్లి వచ్చిన ఒక స్త్రీ మలినపడిందనే అపవాదు ముద్రవేస్తేనే తప్పనిసరిగా అంతఃపురంలో చిన్న రాణిగా ప్రవేశించింది. ఆమె వాస్తవ జీవితాన్ని అంతఃపుర రహస్య స్థానంనుండి వెలికితీసి, నీతినిజాయితుల నిగ్గుతీసి, నిజాల్ని మనముందుంచారు రచయిత.

సంగీత, సాహిత్య, నృత్యాల త్రివేణీ సంగమంగా ఆమెను తయారుచేయడానికి ఎంతో శ్రమపడి తెరమాటునుండే ఆ గానమాధురీ రసాస్వాదనంగావిస్తూ రసలోకంలో విహరిస్తున్న రాజుగారి హృదయంతోపాటు రచయిత తన సంగీత, సాహిత్య పరిజ్ఞానాన్ని మనోజ్ఞంగా చిత్రించి అలరింపజేశారు. ఆనాటి కోటల హృదయపేటికలలోని భావాలను వెలికితీసి తుదికవాటాలను తెరిచి అక్షరాల పసిడిమేడను కట్టిన రచయిత ధన్యుడు. చంద్రశేఖరం పాత్రద్వారా ఒక వ్యక్తికి న్యాయం జరిపించడంతోపాటు, కళ సమాజానికి ఉపయోగపడాలని, పదుగురికి ప్రయోజనం కల్పించాలని చెప్పించడం వారి సామాజిక స్పృహకు దర్పణం, రాజుగారిని చూసి ఆమె అవాక్కు కావడం, రాణీగారి వేషంలోనున్న ఆమెనుగాంచి, రాజుగారు నిశ్చేష్టులవడం దానికి ఆమె మేనత్త రంగులు పులమగా, తిరిగి ఆమె దేవిడీని చేరడం,

రాజదంపతులాదరించడం- ఒక్కనాటి కలలో కలిగిన కలవరపాటుగా ఉపవాస వ్రతదీక్షను శిక్షగా విధించుకోవడం ఇవన్నీ చదువుతుంటే భావుకుల అమలిన శృంగారం స్ఫురణకు వచ్చింది. తీర్థయాత్రలనుండి వచ్చిన రాజుగారు నగరాన్ని చూసి బాధపడి, పునరుద్ధరణకు పూనుకోవడం ఈనాటి పాలకులు నేర్చుకోవలసిన ఆదర్శం. పాలకులు అలసత్వాంవహిస్తేరాజ్యం ఎలా వుంటుందో కూడా తెలుసుకోవచ్చు. తన యజమానిపట్ల మంత్రినుండి పనిమనిషివరకూ గల గౌరవం, వారిపట్ల నమ్మకం గలగడం ఆ యజమాని మహోన్నత మనస్తత్వానికి తార్కాణం. ఒక చిన్న సంఘటనను తీసుకొని దానిచుట్టూ అనేక సంఘటనలనల్లి సాఫీగా పాఠకుల హృదయాలను తాకించి ఆనందవశంవద హృదయుల్ని చేసే సుమహారం ఈ "పసిడిపంజరం" అనవచ్చు.

-బి. రాంబాబు
నాగార్జునసాగర్

## అందరూ మంచివారే!

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**మ**నం మరచిపోతున్న కొన్ని విలువలని జ్ఞాపకం చేసే ప్రయత్నం చేశారు ఘంటికోట బ్రహ్మాజీరావుగారు తమ నవల 'పసిడి పంజరం'ద్వారా. చదువుతున్నంతసేపూ 'మల్లీశ్వరి'వంటి సినిమా చూసిన అనుభూతి కలిగింది. ఆ రాచరికపు వైభవాలూ, ఆచారాలూ, ముఖ్యంగా రాచకుటుంబాలలో ఉండే కట్టుబాట్ల గురించి రచయిత సవివరమైన అధ్యయనం చేసి కళ్లకు కట్టేటట్టు చెప్పడంలో కృతార్థులయ్యారు. రాజు, రాణీ, అమృతవల్లి, రామభద్రరాజు, వెంకట్రామయ్యలేగాక చంద్రశేఖరం పాత్ర చిత్రణలో చూపిన నైర్మల్యం నిజంగా కనిపించదేమో!

రాజులలో కూడా శ్రీరామచంద్రుడు ఆరాధ్యంగా మనసా వాచా అనుసరించేవారు ఉండడం అరుదు అనుకునేవాళ్లకు ఈ నవల కనువిప్పు.

పోతే కొన్ని కొన్ని తప్పులు దొర్లకపోలేదు. చిట్టిరాజు కుమార్తె మల్లికను బ్యాంకు మానేజరుకి ఇచ్చి పెళ్లి చేసినట్లు చెప్పారు. అయినా వారి కులాచారంగా అతిథులకు ఇత్తడి

పళ్లెంలో కాళ్లు కడిగి పైటచెంగుతో తడి ఒత్తడం పాత్రోచితంగా లేదు.

ప్రీవీపర్సులను నిర్దాక్షిణ్యంగా లాక్కున్న ప్రభుత్వాలు భార్య కాని భార్య, ఉంపుడుకత్తె గాని ఉంపుడుగత్తెకు ఆస్తిలో పదవ వాటా ఇవ్వడం అన్నది నవలలలో జరిగేదేగానీ యదార్థంలో జరిగేది కాదన్న సత్యం రచయిత మరచారు.

శ్రీ బ్రహ్మజీరావు నవలల్లో చదివించే గుణం ఉంది. రాజకుటుంబం గురించి రాసినా పాఠకులను ఆకట్టుకోగలిగారు. అప్పుడప్పుడూ 'చతుర'లో ఇటువంటి 'అందరూ మంచివారే' కోవకు చెందిన నవలలు రావడం కూడా అవసరమే.

**-గాడేపల్లి సుబ్రహ్మణ్యం**
విశాఖపట్నం

## నీరాజనం

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**తు**పానుముందు ప్రశాంతతలా సాదాగా మొదలైన 'పసిడిపంజరం' నవల చదివేకొద్దీ ఉత్కంఠను రేకెత్తించింది. జీవితంపై ఎన్నో ఆశలు అల్లుకున్న పదహారేళ్ల ముగ్ధ ఎంత హుందాగా సమాజపు వంచనకు గురైందో తేటతెల్లం చేసిందీ నవల. నవలలోని కొన్ని ముఖ్య పాత్రలు చాలా ఉన్నతమైన సంస్కార వ్యక్తిత్వాలను కలిగి వాటి స్థాయిని నిలుపుకున్నాయి. లాయర్ చంద్రశేఖరం పాత్ర నేడు తరిగిపోతున్న నల్లకోటు గౌరవాన్ని నిలబెట్టి దానికి నిజాయితీ విలువలను అద్దింది. ఒకవిధంగా చెప్పాలంటే దీనిని నవల అనడంకన్నా గతకాలపు ఆచార వ్యవహారాలను నేటితరం పాఠకులకు పరిచయం చేసిన ఒక చిన్న రాజాస్థానపు చరిత్ర అనడం సబబుగా ఉంటుందేమో!

అయితే దీనిలోని కొన్ని సంఘటనలు, సన్నివేశాలు అసహజంగా అనిపించాయి. అమృతవల్లి వయసు ప్రభావంతో ప్రవర్తించిన సహజమైన తీరును కుటుంబసభ్యులే తప్పుగా చిత్రీకరించి కుటుంబంనుంచి వెలివేస్తే... ఆమెను రాజదంపతులు చేరదీసి, ధైర్యంచెప్పి ఆశ్రయం ఇవ్వడంలో తప్పులేదు. హర్షణీయం కూడా. రాజ దంపతులిద్దరూ ఆదర్శవంతులూ, ఒకర్నొకరు అర్థం చేసుకున్నవారిగా రచయిత చిత్రీకరించారు. అయితే అమృతవల్లి వివాహం రద్దవడానికి రాజావారు కూడా ఒక పరోక్ష కారణం. మరి ఆమె వైవాహిక జీవిత విషయంలో వారెందుకు సరైన నిర్ణయం తీసుకోలేకపోయారు? తర్వాత ఆమె మనోభావాలను తెలుసుకోకుండా స్వేచ్ఛకు సంకెళ్లు వేసి ఆమె నవయవ్వన జీవితాన్ని బంగారు పంజరంవంటి కోటలో శిక్షణలో ఎందుకు కుదించివేశారు? పైగా ఆమెకు నేర్పించిన సంగీత, సాహిత్య, నృత్య కళలను ఆస్వాదించడంద్వారా రాజావారు తాను ఇచ్చినదానికి ప్రతిఫలం స్వీకరించినట్లే అయిందికదా? అన్న ప్రశ్నలుదయించి అమృతవల్లి విషయంలో వారి ఉదారతను శంకించాయి.

నవలలోని శృంగారాన్ని శృతిమించని రీతిలో చాలా సున్నితంగా హృద్యంగా చెప్పిన రచయిత నేర్పు ముచ్చటగొలిపింది. అలాగే వేశ్యల జీవన సరళిలోని నిజానిజాలను ఎంతో గౌరవప్రదంగా చెప్పిన తీరూ బావుంది. చివరికి లాయర్ చంద్రశేఖరం ద్వారా అమృతవల్లి జీవితానికి వెలుగునిచ్చి మిగిలిన పాత్రలకు విలువనిచ్చారు రచయిత. తెలుగువారి జీవితానికి అద్దంపట్టిన 'పసిడిపంజరం' పాఠకుల హృదయమందిరంలో చోటుచేసుకుంటుందనడంలో సందేహంలేదు. ఘండికోట బ్రహ్మజీరావుగారికి అభినందన వందనాలు! 'చతుర'కు నీరాజనాలు!

**-ఎన్. సూర్యప్రకాశరావు**
నవాబుపేట




# ఏరిన ముత్యాలు

★ ప్రజలు దుర్బలులు కారు - వారికి లేనిది సంకల్ప బలం!

-విక్టర్ హ్యూగో

★ పురాతనమైనందువల్ల విడిచిపెట్టదగినది యంత్రం మాత్రమేకాదు, మేధ పురాతనం కాకుండా ప్రతివారూ అప్రమత్తంగా ఉండాలి!

-లక్ష్మీపత్ సింఘానియా

★ ఇతరుల తప్పులకు కోపం తెచ్చుకునే ముందు, ప్రతివారూ తమ తప్పులను ముందుగా గుర్తుకు తెచ్చుకోవాలి!

-ది మదర్

★ మనం నిజమైన జీవితాన్ని గడపదలచుకుంటే మన మానసికమైన సోమరితనాన్ని వదలాలి. కొంత ప్రాథమిక ఆలోచన చేయాలి. దానివల్ల మన జీవితం అతి సరళంగా మారుతుంది!

-మహాత్మాగాంధీ

★ ప్రతీకారంద్వారా పగ నిర్మూలనం కాదు!

-రాజాజీ

★ ఒక వ్యక్తికి ఉత్తముడైన ఉపాధ్యాయుడూ, సత్సాంగత్యమూ ఉన్నప్పటికీ, అతని వైఖరి అస్థిరంగా, స్వభావ విరుద్ధంగా ఉన్నట్లయితే అది విలువలేనిదే అవుతుంది!

-శ్రీరామకృష్ణ

★ ఏదీ ప్రారంభం కాదు, ఏదీ అంతంకాదు - అది దుఃఖం (మూలుగులతో) చెల్లించబడనప్పుడు. ఎందుకంటే మనం ఇతరుల వేదనలోనుంచి జన్మించాము, మన స్వంత వేదనలోనే నశించిపోతాం!

-ఫ్రాన్సిస్ థామ్సన్

★ ఎల్లప్పుడూ రక్షణ కోరే సద్గుణానికి కావలివాని అవసరం అరుదుగా ఉంటుంది!

-ఆలివర్ గోల్డ్‌స్మిత్

★ మన పూర్వ ప్రముఖులను మాటలతో కీర్తించడంకంటే చేతలద్వారా వారిని అనుసరించటం అత్యంత గౌరవంగా ఉంటుంది!

-హూరస్‌మాన్

★ భావనకు ఉడుపు (దుస్తులు) - భాష!

-శామ్యూల్ జాన్సన్

★ విధి (ప్రారబ్ధం)కి వ్యతిరేకమైన కవచం ఏదీలేదు!

-జేమ్స్ షిర్లే

సేకరణ: జక్కల భరత్

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082 |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082 |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082 |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082 |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082 |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/– RAMOJI RAO**
Publisher

Date: March 1, 1996

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 290328. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977, Rajahmundry 71390, Karimnagar 83216.

